# వ్యాస భండారం

(పరిశోధక వ్యాసాలు)




డా॥ గల్లా చలపతి
అసోసియేట్ ప్రొఫెసర్
తెలుగు అధ్యయనశాఖ
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి





శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి
1999

వ్యాస భండారం

(పరిశోధక వ్యాసాలు)

ACCN
21


రచయిత : డా॥ గల్లా చలపతి





ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 1999

CHP

ప్రతులకు :

రిజిస్ట్రార్
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి-517 502

ధర : రూ.

ముద్రణ :

కీర్తి ప్రింటర్స్
తిరుపతి.

# ఒక మాట....

సాహిత్యానికి చరిత్రకు దగ్గర సంబంధముంటుంది. సాహిత్యాంశాలను చారిత్రక నేపథ్యంతో పరిశీలించడం అవసరం. చారిత్రక దృష్టిగల విమర్శకుడికి సాహిత్యానికి సంబంధించిన పాత కొత్తల ప్రస్తావన పనికిరానిదిగా అనిపిస్తుంది. సాహిత్యతత్త్వాన్ని, అది పొందిన పరిణామ దశలను వివరించడానికి ఆయాకాలాల చారిత్రక సంఘటనల అధ్యయనం ఎంతో అవసరం. చాల మంది రచయితలు, విమర్శకులు ఈ విషయాన్ని గుర్తించి రచనలు చేస్తున్నారు. ఈ ఉద్దేశంతో రచింప బడినవే ఈ గ్రంథంలోని వ్యాసాలన్నీ.

ఈ గ్రంథానికి 'వ్యాస భండారం' అని పేరు పెట్టడానికొక కారణముంది. ప్రాచీన కాలంలో విద్యాస్థానాలైన ఘటికలలో కుండలను పరీక్షల నిర్వహణకు, తాళపత్ర గ్రంథాలను దాచడానికి ఉపయోగించేవారు. ఈ ప్రాచీన విద్యాసంప్రదాయాన్ని స్ఫురింపచేయడానికే ఈ గ్రంథానికీ పేరు.

పదునాలుగు వ్యాసాలున్న ఈ గ్రంథంలో శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం వారిచే ప్రచురింపబడడం సంతోషదాయకం. విశ్వవిద్యాలయాధికారులకు కృతజ్ఞతలు. 'ఆకాంక్ష' పేరుతో ఈ గ్రంథంమీద తన అభిప్రాయం రాసి ఇచ్చిన ఆచార్య సర్వోత్తమరావుగారికి కృతజ్ఞతపూర్వక నమస్కారాలు.

తిరుపతి,
14-1-99

—గల్లా చలపతి.

ఆచార్య కె. సర్వోత్తమరావు
తెలుగు అధ్యయన శాఖ
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి

## ఆకాంక్ష

తమిళనాడు సరిహద్దు ప్రాంతాలలో 'గల్లాపెట్టె' అనే మాట వాడుకలో వుంది. డబ్బు వేసి దాచిపెట్టే పెట్టె అని దాని కర్థం. 'వ్యాస భండారం' రచయిత 'గల్లా' వారు, తన జ్ఞానాన్ని, పరిశీలనను, పరిశోధనను వ్యాసాల రూపంలో మలచి సహృదయ పాఠకులకు అందించిన గల్లాపెట్టె వ్యాసభండారం. ఈ మాట అన్నందుకు పరమప్రమాణం 'భండారమ'నే పదం డా॥ చలపతి గారికి చాల ఇష్టం కావడం.

ఈ భండారంలో 14 వ్యాసాలున్నాయి. పదునాలుగు భువనాలలాగా. కొన్ని చారిత్రక సంబంధులు. మరికొన్ని పదసాహిత్య సంబంధులు. ఇంకా కొన్ని సంస్కృతికి సంబంధించినవి. ఆధునిక సాహిత్య సంబంధి వ్యాసాలు కొన్ని, జానపద సాహిత్య సంబంధి వ్యాసాలు కొన్ని. ఒకటి మాత్రం నిఘంటువులకు సంబంధించినది.

పరిశోధకులు నానా రకాలు. 'రాముని దొకచే బాణం' లాగా ఒక లక్ష్యం ఎన్నుకొని మనుగడ సాగించేవారు. మరొకరైతే 'బహుముఖులు' వారు విహారించని మార్గంలేదు. మర్రిచెట్టు ఊడల్లాగా అనేక ప్రక్రియలలో తమ ప్రజ్ఞాపాటవాలు ప్రదర్శించేవారు. ఈ బహుముఖుల్లో ఒక తేడా వుంది. కొందరిది 'ఆకారానికి సరిపోని ఆహార్యం', అవగాహన ఏ మాత్రం లేని వీరవిహారం. ఇలాంటి వారు కాలు పెట్టినచోట కరువు. పాదం మోపిన చోట బురద. వారి పరిశోధన 'నేతి బీరకాయ' అలాంటి వారికి నమస్కార మొక్కటే చాలు.

ప్రాచీన సాహిత్యం చదువుకొనే వారికి అలంకార శాస్త్రం, నిఘంటు పరిజ్ఞానం మాత్రముంటే చాలనుకోవడం పెద్ద పొరబాటు. చారిత్రకదృష్టి, తాత్త్వికదృష్టి, తులనాత్మక పరిశీలన చాల అవసరం. పాతతరం వారిలో మల్లంపల్లి,

వేటూరి, పుట్టపర్తి మొదలైనవారు ఆ కోవలోనివారు. డా॥ చలపతి సంస్కృతం చదువుకున్నారు. చరిత్రకు అధ్యయనం చేశారు. ఇక తెలుగు సరేసరి. అందుచేత వీరి వ్యాసాలు బహుముఖాలుగా 'వ్యాసభండారం'లో భద్రంగా కనిపిస్తున్నాయి. మొదటి వ్యాసంలో 'గానట–బీసట' అనడానికి ఇచ్చిన వివరణ, నాల్గవ వ్యాసంలో 'భండారం' అనడానికి ఇచ్చిన అర్థవిశేషం, ఐదవ వ్యాసంలో ఆంధ్రుల సంస్కృతి ప్రత్యేకతలు, ఆరవ వ్యాసంలో ఆంధ్రదేశంలో కనిపించే వివిధ మతాల సంస్కృతీ సమ్మేళనాంశం, ఏడవ వ్యాసంలో చారిత్రకాంశాలకు నవలలలోని సన్నివేశాల సమన్వయం ఇలాంటివి ఆయా రంగాలలో అధ్యయనం చేసేవారిని ఆకర్షిస్తాయి, అలరిస్తాయి, ఆలోచింపజేస్తాయి.

గతంలో పాఠ్యప్రణాళికలో ఎంతో విలువైన వ్యాసాలు కనిపించేవి. విషయం, శైలి అనుభూతిని పెంచేవిగా వుండేవి. అలాంటి వ్యాసాలు డా॥ చలపతిగారు వ్రాశారనడం సబబు. వీటికి ప్రసిద్ధి రావాలని ఆకాంక్ష. ఈ వ్యాసాలను 'వ్యాసభండారం'గా శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తన ప్రచురణలుగా ముద్రించడం ఎంతో సంతోషించదగిన విషయం. ఈ రచయిత మరెన్నో గ్రంథాలు వ్రాయాలని, సాహిత్య పరిశోధనలో సమన్వయ దృష్టి పెరగాలని ఆకాంక్ష.

తిరుపతి
మకర సంక్రాంతి, 1999

ఆచార్య కె. సర్వోత్తమరావు.

# విషయానుక్రమణిక

# 1. ప్రాఙ్నన్నయ యుగంనాటి పదసాహిత్య స్థితి

పదం నుండి పద్యం పుట్టిందనేది పండితులు అంగీకరించిన విషయం, పదసాహిత్యం ఎప్పటి నుండి వుంది అనే ప్రశ్న వచ్చినప్పుడు కృష్ణమాచార్యుల సింహగిరి వచనాలు పుట్టిన కాలం నుండి అని చెప్పడం వుంది. ఇలా చెప్పిన వాళ్ళకు కృష్ణమాచార్యులకు ఎంతో ముందు నుండి పదసాహిత్యం వుందని తెలుసు. అయినా లభ్యం కాకపోవడంవల్ల ఇలా చెప్పవలసి వస్తున్నది. నన్నయకు ముందే తెలుగు సాహిత్యముంది. అనేకానేక దేశి ఛందస్సుల ప్రస్తావన వుంది. సంస్కృత ఛందస్సులలో గల పద్యాలు శాసనాలలో దొరుకుతున్నాయి. ఈ నేపథ్యంలో నన్నయకు ముందు పదసాహిత్యం వుందా? ఉంటే దాని స్వరూప మేమిటి అనే అంశాలను పరిశీలిస్తే అనేక విషయాలు బయటపడతాయి.

సాహిత్య పరిశోధనల చరిత్ర పరిశోధనల ఫలితంగా పదసాహిత్యం ఆంధ్ర దేశంలో శాతవాహనుల కాలంలోనే ప్రారంభమైందనడానికి ఆధారాలున్నాయి. హాలుడు సంకలనం చేసిన గాథాసప్తశతిలో పాటల ప్రసక్తి కనిపిస్తుంది. ఆ పాట లన్నీ పాతతెలుగులో వుండి వుంటాయి.

"చక్కగా దంచిన సన్నబియ్యపు వన్నెలాంటి వెన్నెలను, తాను కోరుకున్న దానికన్నా కొల్లగా పండిన పైరును పల్లెరైతు చూశాడు. ఆనందంతో ఇచ్చవచ్చి నట్టు పాడుకొన్నాడు" అని ఏడవ వందలోని 98 వ గాథ చెపుతుంది.

"పెళ్ళికూతురికి పెళ్ళి కడియాలు తొడిగించి పునిస్త్రీలు మంగళగీతాలు పాడుతున్నారు" అని ఏడవవందలోని 42 వ గాథ చెపుతుంది. ఈ పాటలు అప్పటి కప్పుడు వాళ్ళు కట్టుకొన్నవి కావచ్చు. లేక అప్పటికే ప్రచారంలో వున్నవి కావచ్చు. అయితే గాథలన్నీ ప్రాకృతంలో ఉండడంవల్ల ఇవి తెలుగుపాటలా అనేది ప్రశ్న.

నాణకశాస్త్ర పరిశోధకులు శాతవాహనుల నాణాలను పరిశీలించి శాతవాహన రాజులు వారు వేయించిన నాణాలమీద వాళ్ళ పేర్లను ఒకవైపు ప్రాకృతంలోను మరొకవైపు తెలుగులోను చెక్కించినట్లు ఋజువు చేశారు. శాతవాహనులు తెలుగు దేశాన్ని పాలించే రాజులు కావడం, తమ నాణాలు తెలుగుప్రజల మధ్యనే చెలామణీ అవుతాయని ఊహించడం దీనికి కారణాలు.

ఒక ఉదాహరణ చూద్దాం—

వాసిష్ఠీ పుత్రుడైన రెండవ పులుమావి (క్రీ.శ. 88–116) వేయించిన నాణెం.

ప్రాకృత్యం—రాఞో వాసిఠీ పుతస సిరిపులు మావిస

| తెలుగు— అరహణకు | వాహిట్టి | మాకణకు | తిరుపులు | మావికు |
|---|---|---|---|---|
| 5 | 5 | 5 | 4 | 4+ |

వాసిష్ఠీ పుత్రుడైన నాలుగవ శాతకర్ణి (క్రీ.శ. 116–145) వేయించిన నాణెం.

ప్రాకృతం—రాఞో వాసిఠీ పుతస సిరిసాత కణిస

| తెలుగు— అరహణకు | వాహిట్టి | మాకణకు | తిరుహాత | కణకు |
|---|---|---|---|---|
| 5 | 5 | 5 | 5 | 3+ |

ఈ పేర్లలో ఐదు మాత్రల గణాలు కనిపిస్తున్నాయి. మాత్రాఛందస్సు ఏర్పడడానికిది పూర్వస్థితి కావచ్చు.

ప్రాకృత గాథ ఒక దేశి ఛందమే. దీనికి నాలుగు పాదాలుంటాయి. నాలుగు పాదాలకు కలిసి 54 మాత్రలుంటాయి. ఏ గాథలోను 64 మాత్రలకు మించ కూడదు. గాథ నుండి కందం రూపొందిందని కొందరి అభిప్రాయం. అప్పటి దేశి రీతులు మతంగుని 'బృహద్దేశి' అనే లక్షణ గ్రంథంలో చోటుచేసుకొన్నాయి. అంతకుముందే వచ్చిన భరతుని నాట్యశాస్త్రం 32వ అధ్యాయంలో ప్రబంధరీతులు ప్రస్తావించబడినాయి. పదబంధం, ప్రబంధం పర్యాయపదాలు కావడంవల్ల పదం భరతుని కాలానికే ప్రచారంలో ఉండినట్లు చెప్పవచ్చు. ఈ సాక్ష్యాలనుబట్టి తెలుగులో పదరచన క్రీ.శ. ఒకటి రెండు శతాబ్దాల నుండి బాగా వ్యాప్తిచెందినట్లు తెలుస్తున్నది.

శాతవాహనుల ప్రాకృత శాసనాలలోను, ప్రాకృత సాహిత్య గ్రంథాల లోను కనిపించే అత్త, కరణి (తీరున), చోజ్జం (చోద్యం), పాడి (పద్ద) కుసుంభ (కుసుమపువ్వు), మోడి (బింకం), రుంప (రంపం), సావులి (శాలువ) మొదలైన తెలుగుపదాలు ఆ కాలంలో తెలుగు కూడా వ్యవహార భాషగా వుండి ఉంటుందనడానికి సాక్ష్యాలు. క్రీ.శ. 9 వ శతాబ్దానికి చెందిన ఉద్యోతనుడనే ప్రాకృత కవి 'కువలయమాల'లో తన కాలంనాటి 18 దేశాల వారినీ, వాళ్ళ భాష లను పేర్కొన్నాడు. అతడిచ్చిన జాబితాలో ఆంధ్రదేశం, ఆంధ్రభాష ఉన్నాయి. అంతకుముందే మతంగుని బృహద్దేశిలో 'ఆంధ్రి' అనే రాగం ప్రస్తావించబడింది. క్రీ.శ. 10 వ శతాబ్దానికి చెందిన మల్లియరేచన తన కవిజనాశ్రయంలో తరువోజ, ద్విపద, త్రిపద, చేపద, షట్పదలకు లక్షణాలు చెప్పాడు. అప్పటికే శిష్టసాహిత్య సంప్రదాయం బలంగా వ్యాప్తిలో వుండినా ఈ ఛందస్సులన్నీ ప్రజల సాహిత్యంలో వుండేవి. ఈ పరిశీలనవల్ల చాల ప్రాచీన కాలం నుండి దేశీయ ఛందో విధానం ఆంధ్రదేశంలో కొనసాగినట్లు దేశి ఛందస్సులలో పదాలు వ్యాప్తిలో ఉండినట్లు అర్థమవుతుంది.

ఇటువంటి సాహిత్య వాతావరణముండిన ప్రాఙ్నన్నయ యుగంలో పద సాహిత్యం ఎంతో ఉండి ఉంటుంది. నన్నయానంతర తెలుగు కవుల రచనలలో కనిపించే పదసాహిత్య ప్రస్తావనలు ప్రాఙ్నన్నయ యుగ పదసాహిత్యాన్ని మదింపువేయడానికి ఉపకరిస్తాయి.

1. నన్నెచోడుని కుమార సంభవంలో ఈశ్వరుని స్తుతించే అంకమాలికలు (3-38), కల్లుదించేవారి గౌడుగీతాలు (6-45) శబరకామినుల దంచు పాటలు (6-47). స్త్రీలు పాడే ఊయల పాటలు (4-89) ప్రస్తావించ బడినాయి.

2. పాలకురికి సోమన పండితారాధ్య చరిత్రలో తుమ్మెద పదాలు, గొబ్బిపదాలు, వెన్నెల పదాలు, జోలపాటలు, కోలాట పాటలు, చాగుభళాలు ప్రస్తావించ బడినాయి, "ఆతత బసవ పురాతన భక్త-గీతార్థ సమితియే మాతృకగాగ" అనే సోమనాథుని మాటలలో 'భక్త గీతార్థ సమితి' పరిశీలించదగింది. అప్పటికే భక్తిని ప్రతిపాదించే గీతాలు వ్యాప్తిలోకి వచ్చివుంటాయి. దీని మూలాలు ఎప్పటి నుండో ఏర్పడివుండవచ్చు.

3. నాచన సోమన జాజర పాటలను పేర్కొన్నాడు.

వీణాగానం వెన్నెల తేట–రాజమీరగా రమణుల పాట –
పేరు చెప్పిన పిన్రబ్రాహ్మణువీట – జాణలు మెత్తురు జాజర పాట"

అనే గేయంలో ఈ ప్రస్తావన ఉంది. 'చర్చరి' అనే దేశీయ పదమే జాజర పాటగా రూపొందిందని వేటూరి ప్రభాకరశాస్త్రిగారి అభిప్రాయం. ప్రాకృతంలోను, ఆంధ్రాది ఇతర దేశ భాషలలోను ఎన్నో చర్చరీ పదాలున్నాయని సింహభూపాలుడు రాశాడు. "షోడశ మాత్రాః బహవః పాదాః" 16 మాత్రలు అనేక పాదాలు కలిగి అనుప్రాసాన్వితంగా ఉండడం దీని లక్షణం.

4. మతంగుని బృహద్దేశిలో, చాళుక్య సోమేశ్వరుని మానసోల్లాసంలో, చాళుక్య జగదేకమల్లుని సంగీత చూడామణిలో, జాయపసేనాని నృత్తరత్నావళిలో 'ఏకతాళి' ఒక దేశి రచనాభేదంగా పేర్కొనబడింది. "వాడు నన్ను ఎగతాళి చేస్తున్నాడు" అనే నానుడిలో ఏకతాళి ఇంకా కనిపిస్తూవుంది.

5. పాలుకురికి సోమన 'చిందు' పాటను ప్రస్తావించాడు. జాయపసేనాని "గీతార్థాభినయోపేతైః ద్విపదైః చిందు సంజ్ఞికైః" అని లక్షణం చెప్పాడు.

6. ధవళాలు పాడడం నేటికీ కొన్ని వివాహ సందర్భాల్లో కనిపిస్తుంది. "ధవళాలు పాడుతున్నారు" అనే నానుడిలో ఈ మాట వుంది. "కథా షట్పదీ యోజ్యా వివాహేధవళ స్తథా" అని చాళుక్య సోమేశ్వరుడు లక్షణం చెప్పాడు.

పాంచాలీ పరిణయంలో

"ఆలల నామణి కాగ
గయ్యాళి యొకానొక్క వేళ నక్కరలో సు
వ్వాలలు సోబానలు ధవ
ళాలున్ మొదలైన పాటలాడట నేర్పున్" అనే పద్యముంది.

ఇలా చూస్తూపోతే ప్రాచీన కాలంనుండి పదాది దేశి సాహిత్యరీతులు ఆంధ్రదేశంలో పుట్టి వికసించాయని చెప్పడానికి ఎన్నైనా ఆధారాలు దొరుకుతాయి.

అయితే లక్షణాలకు తగిన లక్ష్యాలు దొరకడంలేదు. దీనికి గల కారణాలను అన్వేషించాలి. దీనికి ముందు నన్నయకు ముందుండిన పదాల స్వభావాన్ని గురించి కొంత తెలుసుకోవాలి. ఈ పదాలలో పారమార్థిక ఆలోచనల కంటె సాంఘిక స్పృహగల ఆలోచనలే ఎక్కువగా ఉండివుండవచ్చు. ఎందుకంటే పదసాహిత్యంలో పారమార్థికత కనిపించడం భక్తి ఉద్యమం తరువాతనే మొదలైంది.

"అత్తింటి కోడలు ఉత్తమురాలు - చేటజొన్నలు పోసిచే నిద్రపోను"
"చక్కనాన్నగారి ముక్కుపై చెమట - చేరదేసి ముత్యాలు చెదిరినట్లుండు"
"చలికి వెఱచినట్లు పులికినే వెఱవ - ఆలికి వెఱచినట్లు అమ్మకే వెఱవ"
"కొడుకుల గనని వాళ్ళ కడుపేమి కడుపు - కులముద్ధరించని కొడుకేమి కొడుకు"

ఈ పాటలు ఎప్పుడు పుట్టినాయో తెలియదు. ఇవి నన్నయ్యకు ముందే తెలుగు ప్రజలలో వ్యాప్తి పొందివుంటాయని చెప్పినా పూర్తిగా తప్పుకాదు. ఇలాంటి పాటలలో నన్నయ పూర్వకాలానికి చెందినవి ఉండే ఉంటాయి. "వాడు వీడితో రగడ పెట్టుకున్నాడు" అనడంలో రగడ కనిపిస్తుంది. ఇది ప్రాకృత కవితా ఛందస్సు. ప్రాకృతం, తెలుగు రెండూ పక్కన పక్కన సమప్రాధాన్యాన్ని సంతరించుకుంటూవుండిన కాలంలో ప్రాకృత కవితా ఛందాలలో తెలుగు పదాలు నిర్మితమై ఉంటాయి. ఆంధ్రదేశంలో సుమారు ఐదారు శతాబ్దాల నుండి ప్రాకృత భాషకు ఆదరణ తగ్గి దేశభాష అయిన తెలుగుకు ప్రాధాన్యత హెచ్చింది. ఆ కాలంలో ప్రాకృత గాథా ఛందస్సు ననుసరించి తెలుగులో అనేక పదాలు పుట్టి ఉంటాయి.

ఇప్పటివరకు చెప్పిన విషయాలన్నీ కృష్ణమాచార్యుల ముందు కాలానికి సంబంధించినవి. నన్నయతో ప్రారంభిస్తే కృష్ణమాచార్యుల నాటికి సుమారు రెండు వందలా ఏభై సంవత్సరాల నిడివిలో వచ్చిన సాహిత్యముంది. దేశీయ ముద్రతో కవిత్వం చెప్పిన శివకవులు దేశిఛందో రీతులలో ఒకటైన ద్విపదను ఎక్కువగా పోషించారు. మిగిలిన దేశిఛందాలను అంతగా పట్టించుకోలేదు. ప్రజావ్యవహారంలోని సంప్రదాయాన్ని కొంత గ్రంథస్థం చేశారుగాని పాటలను గ్రంథస్థం చేయలేదు. ప్రజల నోళ్ళలో ఎప్పటి నుండో గిరికీలు కొడుతూ వ్యాప్తిలో ఉండిన పదసాహిత్యం గ్రంథస్థం కాలేదు. దీనికెన్నో కారణాలున్నాయి.

1. పదసాహిత్యం ప్రచారంలో ఉన్నా ప్రజలకు కథాసాహిత్యంపై ఉండిన మక్కువ దీనిపైన లేదు.

భాసుర భారతార్థములు భంగులు నిక్కమెఱుంగ నేరమిన్
గాసట బీసటల్ చదివి గాథలు త్రవ్వ తెలుంగు వారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థము తెన్గున జేసినట్టి య
బ్జాసన కల్పులందలకు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్

(నృసింహ పురాణం - ఎఱ్ఱన)

అనే పద్యంలో కనిపించే 'గాసట'కు గాథాసప్తశతి అని 'బీసట'కు భేతాళ పంచ వింశతి అని కొందరి అభిప్రాయం. భేతాళ పంచవింశతి శాతవాహనుల కాలానికి చెందినదే. ఈ అభిప్రాయంలో వాస్తవం లేకపోవచ్చు కూడా. అయితే శాతవాహనుల కాలం నుండి దేశంలో ఇతర సాహిత్య రూపాల కంటె కథావాఙ్మయానికి ఎక్కువ ప్రాముఖ్యం ఉండినట్లు చెప్పవచ్చు.

2. పదసాహిత్యం మౌఖికంగా ప్రచారమయిందే తప్ప గ్రంథస్థం కాలేదు. నిసర్గరమణీయమైన పదాలు కట్టి పాడే పామరప్రజలకు అక్షరజ్ఞానం లేకపోవడం, అక్షరజ్ఞానమున్నవాళ్ళకు దీనిపైన ఆదరం లేకపోవడం కనిపిస్తుంది.

3. అప్పటి కవులు అక్షర గణ నియమాలున్న ఛందస్సులపై ఎగబడినందువల్ల మాత్రా ఛందస్సుల ప్రాధాన్యం తగ్గింది. కవి జనాశ్రయం వచ్చే నాటికే కొన్ని దేశి ఛందాల ఉనికి నశించిపోయిందన్నా ఆశ్చర్యపడనక్కరలేదు. అప్పటి కవులపైన బలంగా వీచిన మార్గకవితా గాలులు దీనికి కారణం.

4. ప్రాచీన కవితా సంప్రదాయాలు కొంతవరకు లక్షణ గ్రంథాలలో ఇచ్చిన లక్ష్యాల ద్వారా తెలిసే అవకాశముంది. లాక్షణికులు శైవ కవుల భాషను లక్ష్యంగా తీసుకోలేదు. వాళ్ళకు భారతభాషే లక్ష్యం. అలాంటప్పుడు నన్నయకు ముందుండిన కవితా సంప్రదాయాలు తెలిసే అవకాశమేలేదు.

5. నన్నయకు ముందుండిన పదసాహిత్యం మరుగున బడడానికి మరొక ప్రధానకారణం అప్పటి మత ఘర్షణలు. బౌద్ధ జైనాల ఘర్షణ ఒకటి. శైవ వైష్ణవాల ఘర్షణ మరొకటి. శాసనాలలో కనిపించే కొద్దిపాటి సాహిత్యానికి అప్పటి రాజకీయ పరిస్థితి దోహదం చేసింది. చాళుక్యుల ముందు పాలించిన రాజులు

కొంతకాలం ప్రాకృతాన్ని కొంతకాలం సంస్కృతాన్ని పోషించారు. వీళ్ళకు యజ్ఞయాగాదులు చేయడం, రాజకీయ పరిస్థితులను చక్కదిద్దుకోవడం పెద్దపనులు గావడంవల్ల మౌఖికంగా ప్రచారంలో ఉండిన సాహిత్యాన్ని ఆదరించి గ్రంథస్థం చేయించాలనే తలంపు కలగలేదు. వీరశైవ విజృంభణవల్ల అంతకు ముందుండిన సాహిత్యమంతా లుప్తమైపోయింది. శివతత్త్వసారంలోని మల్లికార్జున పండితుల పద్యాలు చూడండి.

"ధ్రువముగ సర్వప్రాణుల, నవశ్యమును జేయకుండునది హింసమదిన్
శివనిందకులగు పాపుల, నవిచారితవృత్తి జంపనగు నీశానా,"

"శివనిందా విషయంబగు. నవమానము సెప్పునట్టి యప్పుస్తకముల్
అవిచారంబునఁ గాల్పఁగ నవు జెప్పెడివాని జంపనగు నీశానా."

అశైవములైన పుస్తకాలనే తగలబెట్టమని శివకవులు శాసిస్తుంటే ఇక పామరు లలో ప్రచారంలో ఉండిన పదసాహిత్యం బతికి ఉంటుందా?

మనకంటె ఈ విషయంలో తమిళులు, కన్నడిగులు కొంత నయం. క్రీ.శ. 4 వ శతాబ్దంలో తమిళదేశాన్ని పాలించిన రాజులు ప్రాచీన గేయాలను సేకరించి సంకలన గ్రంథాలుగా రూపొందించే ప్రయత్నం చేశారు. ఈ పని చేయడానికి కవులను నియమించారు. ఇలా ఏర్పడినవే ఎట్టుత్తొగై, పత్తుప్పాట్టు మొదలైన కవితా సంపుటాలు. "పాటను కవిత్వంగా ఎంచక మనం చెడ్డాం. పాటను తొలి కవిత్వంగా ఎంచి తమిళులు ప్రాచీన సాహిత్యమున్న వాళ్ళయి నారు" అన్న ఆరుద్ర మాటలు అక్షరాల నిజం.

# 2. సాహిత్యంపై రాజకీయ పరిణామాల ప్రభావం

రాజకీయ పరిణామాలకు సాహిత్య స్థితిగతులకు సంబంధముంది. ఆ యా కాలాల రాజకీయ చట్రం నుండి సాహిత్యం పుట్టి వికసించింది. ప్రాచీనకాలం నుండి నిన్న మొన్నటివరకు రాజకీయ విషయాలతో సంబంధం లేని సాహిత్యం కనపడదు. తెలుగులో భారతం ఆవిర్భవించడానికి పండితులెన్ని కారణాలు చెప్పినా ప్రధానమైంది రాజకీయ కారణమే. ఆ యా కాలాలలో పుట్టిన సాహిత్యంమీద ఆ యా కాలాల పరిపాలకుల ప్రభావం తప్పకుండా ఉంటుంది. మొట్టమొదట రాజుల ప్రీత్యర్థమే సాహిత్యం సృష్టింపబడింది. పాలకుల అభిరుచి మేరకే కవులు తమ కావ్యాలకు కథాంశాలను ఎన్నుకున్నారు. ఈ అభిప్రాయానికి లొంగని ఒకటి రెండు ఉదాహరణలు ఉండవచ్చు. అయినా సాహిత్యాన్ని చారిత్రకంగా అధ్యయనం చేసినపుడు కొంతకాలం పాలకులైన వ్యక్తులను గొప్పవాళ్ళుగా చిత్రించడానికి, కొంతకాలం వాళ్ళకు ఆహ్లాదం కలిగించడానికి, మరికొంతకాలం రాచవ్యవస్థ ఫలితంగా సంఘంలో ఏర్పడిన పరిస్థితులను వివరించడానికి కావ్యాలు పుట్టినట్లు అర్థమవుతుంది, సాహిత్య చరిత్రను చాళుక్య యుగం, కాకతీయ యుగం అని రాజవంశాల పేర్లతోనే కొన్ని యుగాలుగా విభజించుకొని పరిశీలించడం ఉంది. ఇది సాహిత్యంపై రాజకీయ ప్రభావాన్ని చెపుతున్నది. భారతీయ సాహిత్యమే ఈ రకంగా తయారైంది. ఈ విషయాలను బాగా వివరించాలంటే చారిత్రకమైన అవగాహనతో ప్రయత్నించవలసి ఉంటుంది.

సాహిత్యం వైదిక సాహిత్యమని, లౌకిక సాహిత్యమని రెండు రకాలు. వైదిక సాహిత్యం మతపునాది నుండి పుట్టింది. లౌకిక సాహిత్యం రాజకీయపునాది నుండి పుట్టింది. లౌకిక సాహిత్యం వాల్మీకి రామాయణంతో ప్రారంభమైంది. సాహిత్యానికి రాజకీయవ్యవస్థకు గల సంబంధం ఋగ్వేదకాలం నుండి కనిపిస్తుంది.

ఋగ్వేదకాలపు సమాజంలో బ్రాహ్మణ, క్షత్రియ, సామాన్య తరగతులుండేవి. బ్రాహ్మణులకు మిగిలిన రెండు తరగతులపై పెత్తనం ఉండేది. క్షత్రియుడంటే ఒక భిన్న తెగకు నాయకుడు. మిగిలిన రెండు తరగతులు ఈ నాయకుని రక్షణలో ఉండడంవల్ల వీళ్ళు ముఖ్యంగా బ్రాహ్మణులు పాలకుని గుణగణాలను పొగుడుతూ ప్రసన్నం చేసుకోవలసి వచ్చింది. ఈ పొగడ్తలు స్తుతుల రూపంలో ఉండడంవల్ల ఇది లౌకిక సాహిత్యానికి మొదటి మెట్టుగా భావించాలి.

వైదిక యుగంలోనే రాజ్యవిస్తరణ ప్రయత్నం జరిగింది. పురుష్ణి(రావినది) నదీ తీరంలో పది తెగల నాయకులకు యుద్ధం జరిగింది. ఈ తెగల్లో భరతులు-అనూసులు-ద్రుహ్యులు-తుర్వసులు-యదు-పురువంశాల వాళ్ళు ముఖ్యులు, భరత తెగ జయించింది. రాజ్యవ్యవస్థకు అంకురార్పణ జరిగింది. రాజాస్థానాల్లో పురోహితులు కుదురుకున్నారు. రాజులు వీరికి భూ దానాలను, గో దానాలను చేశారు. రాజుల ఆయురైశ్వర్యాలకు వీళ్ళు దైవస్తుతి చేసేవారు. ఈ స్తుతు న్నీ నరాంకితాలుగా ఉండడంచేత ఇది లౌకిక సాహిత్యానికి మరో దశ.

వైదిక యుగం చివర్లో సూత్ర సాహిత్యం, పురాణ సాహిత్యం పుట్టింది. సూత్ర సాహిత్యం రాచరికాన్ని అన్ని హంగులతో సుస్థిరపరిస్తే, పురాణసాహిత్యం రాజవంశాల వర్ణనతో పెరిగింది. మనుధర్మ శాస్త్రాది గ్రంథాలు అష్టదిక్పాలకులను స్తుతించడం, వీరి అంశలన్నీ రాజులో ఉంటాయని చెప్పడం, రాజు గొప్పవాడని నమ్మించడానికే. అథర్వ వేదంలో రాజును రాజవంశం నుండి ఎన్నుకోవడం, రాజుపై అభిషేక జలం చల్లడం, ప్రజలు రాజుకు కానుకలు సమర్పించడం రాజక; రాజ, స్వరాట్, సమ్రాట్ శబ్దాలు కనిపించడం రాచవ్యవస్థలో కలిగిన పరిణామాలు.

ఋగ్వేదకాలం నాటి కొన్నికొన్ని తెగలు కలసి క్రీ. పూ. 6వ శతాబ్దినాటికి ఒక్కొక్క జనపదంగా రూపుదిద్దుకొన్నాయి. రాచరికం వంశ పారంపర్య హక్కుగా మారింది. అంగ-మగధ-కాశీ-కోసల-వజ్జి-మల్ల-చేది-వత్స-కురు-పాంచాల-మత్స్య-సూరసేన-అస్సక-అవంతి-గాంధార-కాంభోజ—ఇవి షోడశ జనపదాలు. ఈ సందర్భంలో బౌద్ధ జైనాలు పుట్టడం ఆ కాలంనాటి రాచరికవ్యవస్థపై ప్రభావం చూపడం జరిగింది. క్రీ శ. 4వ శతాబ్దంలో అలెగ్జాండర్ దండయాత్ర

జరిగింది. దీని ఫలితంగా ఉత్తర భారతదేశంలో రాజకీయ ఐక్యత ఏర్పడింది. ఈ ఐక్యత పునాది మీద మౌర్య సామ్రాజ్యం ఏర్పడింది. చంద్రగుప్తుడు మొట్ట మొదటి స్వతంత్ర చక్రవర్తి అయినాడు. ఇతని మంత్రి, శ్రేయోభిలాషి అయిన చాణక్యుడు అర్థ శాస్త్రం రచించాడు. రాజ్యతంత్రం నడపడానికి అవసరమైన అర్థ శాస్త్రం రాజకీయ శాస్త్ర సాహిత్యానికి పునాది.

మౌర్యసామ్రాజ్య పతనంతో బౌద్ధమతం క్షీణించింది. మౌర్యుల తరువాత వచ్చిన శుంగులు, కాణ్వులు, బ్రాహ్మణులు. వీరు వైదిక మతోద్ధరణకు పూను కొన్నారు. క్రీ. పూ. 175లో పుష్యమిత్రుడు అశ్వమేధయాగం చేశాడు. కాళిదాసు మాళవికాగ్ని మిత్ర నాటకం ఆనాటి రాజకీయ పరిణామాన్ని చెప్పే సాహిత్య గ్రంథం. అశ్వరక్షణకు పుష్యమిత్రుని మనుమడు రక్షకుడుగా వెళ్ళడం-మొదలైన రాజకీయ విషయాలు ఆనాటి హూణుల దండయాత్రను వివరిస్తాయి.

రాజకీయ శాస్త్రాలు ఆనాటి రాజుల రాజకీయ జీవితాన్ని నిబద్ధం చేశాయి. వారు నేర్చుకోవలసిన విద్యలను పేర్కొన్నాయి. ఆ కాలం నాటి శాసనాలు ఈ విషయాలను పట్టి చూపుతాయి. హాథీగుంఫా శాసనం 'గంధవ వేదబుధోవనత గీత వాదిత' విద్యలలో ఖారవేలుడు ప్రవీణుడైనట్లు చెబుతుంది. గౌతమీపుత్ర శాతకర్ణి 'ఆగమ' విద్యలలో నేర్పరని గౌతమీ బాలశ్రీ వేయించిన నాసిక్ శాసనంలో పేర్కొనబడింది. భారతదేశంలో దొరికిన సంస్కృత శాసనాలలో మొదటి సంస్కృత శాసనమైన జునాగడ్ శాసనంలో రుద్రదాముడు "స్ఫుట లఘు మధుర చిత్రకాన్త శబ్ద సమయోదారాలంకృత గద్య పద్య కావ్య విధాన" ప్రవీణుడుగా చెప్పబడినాడు. గుప్తుల కాలంనాటి అలహాబాదు శాసనంలో సముద్రగుప్తుని గురించి 'సూక్తమార్గః కవిమతి విభవః - విదుషాం ధ్యాన పాత్రం య ఏకః' అని చెప్పబడింది. రాజులు ఇంతటి పండితులైనపుడు వారి ఆస్థానాలలో ఉండిన కవులు మహా పండితులుగాను, కవులుగాను ఉండివుంటారు. వీరికి పాండిత్యమే జీవ నాధారం. రాజులకు విద్యలు నేర్పటం, వారిని స్తుతిస్తూ కవిత్వం చెప్పడం వీరి పనులు.

వైదిక క్రతువులు చేయడం, సంస్కృత భాషను పోషించడం, బ్రాహ్మణ పండితులను ఆస్థానాలలో పెట్టుకొని పోషిస్తూ అగ్రహారాలు బహుమానంగా ఇవ్వడం వైదిక మతోద్ధరణలోని భాగాలు. శుంగుల కాలం నుండి రాజులంతా

ఈ పనిచేశాడు. ఆస్థానాలలోని ఈ పండితులు రాజుల గుణగణాలను రాజకీయ దండయాత్రలను, రాజుల విజయాలను కీర్తించడం మొదలైంది. ఎన్నో స్తుతులు. కావ్యాలు వెలువడినాయి. ఈ దశ లౌకిక సంస్కృత సాహిత్య స్థితికి పరాకాష్ఠ. ఆస్థాన పండితులంతా గొప్ప కవులు కూడా. రాజశాసనాలను కూడా వీరే రాసేవారు. ఈ శాసనాలను రాజప్రశస్తులు అనే వాళ్ళు. ఈ శాసనాల్లో పరిణతమైన సాహిత్యస్థితి కనిపిస్తుంది.

అశోకుని కాలంలో శాసనాలు ప్రాకృతంలోను, శుంగులకాలం నుండి సంస్కృతంలోను వెలువడినాయి, బౌద్ధ సాహిత్యమంతా పాళిప్రాకృత భాషలోనే వచ్చింది. వైదిక మతాన్ని ఉద్ధరించిన రాజులంతా సంస్కృతాన్ని పోషించారు. ఇలా శాసనాలు రాయడానికి కారణం ఆనాటి రాచరికపు స్థితిగతులు, అప్పటి మత పరిస్థితులు. శాసనాలలో గూడా కావ్యశైలి ఉందనడానికి కొన్ని ఉదాహరణలు.

1. గౌతమీ బాలశ్రీ నాసిక్ శాసనం నుండి—

"సెటగిరి చకోర పవత పతిస — సవరాజ లోకమండల పతిగహీత
సాసనస — దివసకరకర విబోదిత కమల విమల సదిస వదనస —
తి సముదతోయ పీతవాహనస — పటిపుణ చదమడల పియదసనస"

[ప్రాకృతం]

2. సముద్రగుప్తుని అలహాబాద్ స్తంభశాసనం నుండి—

శా॥ "ఆర్యైహిత్యుపగుహ్య భావపిశునై రుత్కర్ణితై రోమభిః
సభ్యేషూచ్ఛ్వసితేషు తుల్య కులజ మ్లానాననోద్వీక్షితః
స్నేహవ్యాలుళితేన బాష్పగురుణా తత్త్వేక్షిణాచక్షుషాయః
పిత్రాభిహితో నిరీక్ష్య నిఖిలాం పాహ్యేవ ఉర్వీం ఇతిః"

3. రెండవ పులకేశి ఐహోళె శాసనం నుండి

"సన్నద్ధ వారణ ఘటాస్థగితాం తరాళమ్
నానాయుధక్షత నరక్షత జాంగరాగమ్
ఆశీజ్జలం యదవ మర్దిత మత్రభగర్భమ్
కౌణాళమ్ అంబర మివోర్జిత సాంధ్యరాగమ్"

ఈ శ్లోకాలు శాసనాలలోనివని తెలియనివాళ్ళు ఏవో కావ్యాలలోనివనుకుంటారు. ఆస్థానకవులు రాజశాసనాలు రాయడమే గాకుండా రాజుల ప్రీత్యర్థం కావ్యాలుగూడా రాశారు. హర్షవర్ధనుని ఆస్థాన కవి బాణుడు కాదంబరితో పాటు హర్షచరిత రాశాడు.

ఉత్తర భారతపు పరిస్థితే దక్షిణ భారతదేశంలో ప్రతిఫలించింది. ఆంధ్ర దేశాన్ని పాలించిన శాతవాహనులు బౌద్ధాన్ని వైదికాన్ని సమంగా పోషించారు. వీరి కాలంలో ప్రాకృత సంస్కృత సాహిత్యం పోషింపబడింది. బృహత్కథ, గాధాసప్తశతి, లీలావతీ కావ్యం అప్పటి ప్రాకృతి గ్రంథాలు. బృహత్కథ రాజకీయ కారణంతో వెలువడిన గ్రంథమే. శర్వవర్మ ఒక శాతవాహన రాజుకు ఆరు నెలలలో సంస్కృతం నేర్పుతానని చెప్పగా అది సాధ్యం కాదని, అలా జరిగితే సంస్కృత ప్రాకృతాలతో పాటు దేశభాషను కూడా పరిత్యజిస్తానని గుణాఢ్యుడు శపథం చేశాడు. శర్వవర్మ అనుకున్న పని సాధించాడు. రోషంతో గుణాఢ్యుడు అడవికి వెళ్ళి కసితో దేవతలకు మానవులకు మారుగా పక్షులను జంతువులను పాత్రలుగా పెట్టి బృహత్కథ పైశాచి భాషలో రచించాడు ఆనాటి రాజవ్యవస్థ ఫలితంగా సంఘంలో కనిపించిన మత ప్రాంఘిన నైతిక విషయాలను అతి సున్నితంగా వివరించే సంకలన గ్రంథం గాథాసప్తశతి. ఒక శాతవాహన రాజుకు సింహళదేశపు రాకుమార్తెకు భీమేశ్వరుని సన్నిధిలో జరిగిన వివాహ వృత్తాంతం లీలావతీ కావ్యం. శర్వ వర్మ సంస్కృతంలో కాతంత్ర వ్యాకరణం రచించాడు. ప్రాకృతం ప్రజల భాషగాను, సంస్కృతం పండితుల భాషగాను మారాయి. క్రమంగా సంస్కృతానికి ఆదరణ హెచ్చింది, కారణం రాజుల వైదిక మతోద్ధరణ. వీటితోపాటు 'దేశభాష' కూడా కొందరి వ్యవహార భాషగా ఉండేది. క్రీ. పూ. 2వ శతాబ్దం నాటి 'నాగబు' శాసనం దీనికి ఉదాహరణ. శాతవాహనుల తరువాత వచ్చిన ఇక్ష్వాకులు అశ్వమేధం చేశారు. బ్రాహ్మణులను పోషించారు. క్రమంగా రాజులు దేశభాషను ఉద్ధరించే ప్రయత్నం చేశారు. శాలంకాయనుల కాలంలో వెలువడిన 'శాసనాలంకారమ'నే బౌద్ధ గ్రంథం ఒక శాలంకాయన రాజును తెలుగు రాజుగా పేర్కొన్నది. విష్ణుకుండినులు ప్రాకృతాన్ని వదలి తమ శాసనాలన్నింటినీ సంస్కృతంలో వేయించారు, సంస్కృతానికి పెద్ద ఆదరణ ఏర్పడింది. తెలుగు ఒక భాషగా కుదురుకొన్నది. మాధవవర్మ కాలంలో 'జనాశ్రయ ఛందో విచ్ఛితి'

అనే గ్రంథాన్ని గణస్వామి రచించాడు. ఈ గ్రంథం అప్పటికి వ్యవహారంలో వున్న కొన్ని తెలుగు ఛందాలను వివరిస్తున్నది. ఇదే సమయంలో రేనాటి చోళులు తమ శాసనాలను పూర్తిగా తెలుగులో వేయించారు. ఇక్ష్వాకుల కాలం నుండి శాసనాలలో వంశవృక్షాలు ఇవ్వడం, తమ వంశం చంద్రుని నుండో, సూర్యునినుండో మొదలైనట్లు చూపడం ఒక అలవాటుగా మారింది.

తూర్పు చాళుక్యులు తమ శాసనాలను తెలుగులో వేయించారు. శాసనాలలో వంశవృక్షాలు ఇవ్వడం వీరికి కూడా అలవాటైంది. తమ పూర్వులను గౌరవంతో చెప్పుకోవడం ఒక ఆచారమైంది. ఇలాంటి శాసనాలను ఆస్థానకవులు వ్రాసేవారు. రాజరాజు ఆస్థానకవి, పండితుడు అయిన నన్నయ నందంపూడి శాసనాన్ని సంస్కృతంలో రచించాడు. ఆ శాసన పాఠం అవసరమైనంతవరకు గ్రహించడం అవసరం.

"శ్రీధామ్నః పురుషోత్తమస్యమహతో నారాయణస్య ప్రభోర్నాభీ
పంకరుహాద్బభూవ
జగత స్స్రష్టా స్వయం భూ స్తతః । జజ్ఞేమానస సూనురత్రి రితి
య స్తస్మాన్మునే రత్రితస్సోమో వంశ
కరస్సుధాంశు రుదిత శ్శ్రీకంఠ చూడామణిః । తస్మాదాసీత్ సుధా
సూతేర్బుధో బుధనుత స్తతః । జాతః
పురూర వానామ చక్రవర్తీ సవిక్రమః తస్మాయురాయుషోనహుషః
నహుషాద్యయాతి చక్రవర్తీ
వంశకర్తా.... సుధన్వనః పరీక్షిత్ పరిక్షితో భీమసేనః భీమసేనా
త్ప్రదీపనః । ప్రదీపనాశ్చ శంతనుః శంతనో విచిత్రవీర్యా
విచిత్రవీర్యా పాండురాజః...."

ఈ శాసనంలో చాళుక్య వంశం ఎవరితో ప్రారంభమైందో చూపబడింది. చాళుక్య వంశంలోని రాజరాజుకు ఈ శాసనంలో చూపబడిన వాళ్ళంతా పూర్వులు.

ఈ కాలంనాటికి సప్తసంతానాల ప్రశస్తి ఏర్పడింది. చెరువు తవ్వించడం, చెట్లు నాటించడం, దేవాలయాలు నిర్మించడం, కావ్యాలు రాయించి అంకితం తీసుకోవడం మొదలైనవి సప్త సంతానాలు. వీటివల్ల ఇహపర సౌఖ్యాలు కలుగుతా

యని విశ్వాసం. రాజరాజు నన్నయను భారతాంధ్రీకరణ చేయమన్నాడు. దీనికి భారతంమీద ఆయనకున్న మక్కువ ఒక్కటే కారణం కాదు. రాజరాజు వైదిక మతాభిమాని. తన పేరు ప్రతిష్ఠలు పెంచుకోవాలంటే కావ్యరచన చేయించాలి. కృతి శాశ్వతంగా నిలిచేది. అలాంటి కృతి తన పూర్వుల కథతో ఉంటే ఇంకా బాగుంటుంది. రాజరాజు నన్నయను భారత రచన చేయమని అడిగినట్లున్న క్రింది పద్యంలో ఈ విషయాలన్నీ ఉన్నాయి.

"హిమకరుదొట్టి పూరు భరతదేశ కురు ప్రభు పాండు భూపతుల్
క్రమమున వంశక ర్తలనగా మహినొప్పిన యస్మదీయ వం
శమున బ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్"

శాసనాలలో కనిపించే వంశవృక్ష విపరణను ఈ పద్యంలోని "క్రమమున వంశ కర్తలనగా" అనే విషయం సూచిస్తుంది. నన్నయకు తరువాత వచ్చిన తెలుగు కవులంతా ప్రధానంగా ఆస్థాన కవులే. పోషకులైన రాజులచేత అడిగించుకొని కావ్యాలు రాశారు. రాజులకు సంబంధించిన అనేకాంశాలను పీఠికలో చేర్చారు. రాజుల అభిరుచి మేరకు కావ్యాలలో వస్తునిర్దేశం జరుగుతూ వచ్చింది. కావ్యంలో సాంఘిక స్థితిగతులను చిత్రించడం అవసరమైనా ఆ విషయాన్ని కొంత నిర్లక్ష్యం చేసి రాజులకు ప్రీతిపాత్రమైన వర్ణనలనే చేశారు కవులంతా. సాహిత్య స్రష్టలు కవులైనా ఆ గౌరవం వారిని పోషించిన రాజులకే దక్కింది.

"మును మార్గకవిత లోకం
బున వెలయగ దేశి కవిత బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బున జన చాళుక్యరాజు మొదలగు పలువుర్"

ఆంధ్ర దేశంలో దేశి కవితను పుట్టించినవాడు చాళుక్యరాజని, ఆయనే రాజరాజ నరేంద్రుడని ఈ పద్యంద్వారా అర్థమవుతున్నది. రాయల అంతఃపుర తగాదా తీర్చడానికి ముక్కుతిమ్మన పారిజాతాపహరణ కావ్యాన్ని రాయడం ఆ విషయాన్ని ఇంకా బాగా నిరూపిస్తుంది. ఇలా చూస్తూపోతే రాజకీయ పరిణామాల ననుసరించి సాహిత్యం నిర్దేశింపబడుతూ రావడం గమనించవచ్చు.

# 3. ఒక అన్నమయ్య పాట – చారిత్రక విశేషాలు

దేశ కాలాది పరిమితి లేకుండా జ్ఞానమే రూపంగా కలిగి అనుభవం చేతనే తెలిసికోదగినదై శాంతమయమైన జ్యోతిస్స్వరూపంతో వెలిగే పరబ్రహ్మానికి నమస్కారమన్నాడు భర్తృహరి.[1] పరమాత్మ భర్తృహరికి నిర్గుణ నిరాకార తత్త్వంగా కనిపించాడు. పరమాత్మ శబ్దం చాల విస్తృతార్థం గలది. పరమాత్మ అంటే విశిష్టమైన ఆత్మ. సకల సృష్టి శరీరమైతే ఆ సృష్టికి చైతన్యం–జీవం–ఆత్మ పరమాత్మ. ఇది యోగులు దైవాన్ని అర్థం చేసుకొనేతీరు. సాధారణ జీవులకు ఈ తత్త్వం అందదు. వారికి దేవుడు భౌతికరూపంలో కనిపించాలి. ఆ రూపంలో గుణ విశిష్టత ఉండాలి. ఇలాంటి ప్రాపంచిక దృష్టితో దేవునికి సగుణ సాకార తత్త్వం సిద్ధించింది. ప్రాణిలో వెలిగే చైతన్యం పరమాత్మ. ప్రాణికి గల ఆత్మకు ఆ ప్రాణిలోగల పరమాత్మకు గల సంబంధం ద్వైతాద్వైత విశిష్టాద్వైతాలుగా రూపుదిద్దుకొన్నది. తాత్త్వికులైన కవులు దేవుని అనంత కళ్యాణగుణాలను కీర్తించారు. ఆరాధించే భక్తుని మనః పరిపాకాన్నిబట్టి, దృష్టిభేదాన్నిబట్టి దేవుడికి వివిధ రూపాలు ఏర్పడినాయి. శివకేశవ భేదం ఇలాంటిదే. కుండ, ముంత, మూకుడు మొదలైనవి ఒకే మూలతత్త్వమైన మట్టికి చెందినట్లే వివిధ నామాలతో ఆరాధింపబడే దైవాంశలన్నీ ఒకే మూలతత్త్వమైన పరబ్రహ్మకు చెందినవే. ఏకాకృతితో వెలిగే పరంజ్యోతి స్వరూపమైన పరమాత్మ వేంకటాచలంపై శ్రీ వేంకటేశ్వరుడుగా అర్చారూపంలో ఆరాధింపబడుతున్నాడు. ఆయనలో ఎందరో దేవతల అంశలున్నాయి. ఆరాధకుల దృష్టిననుసరించి వారి మనః పరిపాకాన్ననుసరించి వివిధరూపాలలో ఆయన కనిపిస్తాడు

అన్నమయ్య పాట : పదకవితా పితామహుడైన అన్నమయ్యకు ఏడు కొండలమీద కొలువుతీరిన కొండలయ్య పిలిస్తే పలికే ఇలవేల్పు. అన్నమయ్య

జీవితమంతా కొండలయ్య సన్నిధిలోనే గడిపాడు. కొండలయ్య గుండెను కరిగించ డానికి, తన జీవుని వేదనను వినిపించడానికి ఎన్నో సంకీర్తనలను కట్టి ఆడుతూ పాడాడు. శ్రీ వేంకటేశ్వరుని రూపంలో వున్న కొండలయ్య వైష్ణవానికి మూల తత్త్వమైన శ్రీమన్నారాయణుడుగానే కాక నృసింహుడుగా, రాముడుగా, కృష్ణు డుగా, విఠలుడుగా – ఇలా ఎన్నో రూపాలలో అన్నమయ్యకు కనిపించాడు అన్నమయ్య విశిష్టాద్వైతి. ఆయనకు జగమంతా వైష్ణవమయంగా కనిపించడం సహజమే. అయితే అప్పటికే కొండలయ్యకు వివిధ రూపాలతో అర్చించే భక్తులు కూడా ఉండడం అన్నమయ్య గమనించాడు. కొందరు శివుడని, కొందరు శక్తియని భావించడం అన్నమయ్యకు వింతగా తోచలేదు. ఆ యంశలన్నీ పరబ్రహ్మలో అంతర్లీనంగా ఉన్నవేనని అన్నమయ్య భావించాడు. 'శ్రీ వేంకటేశ్వరుని ఇలా వివిధరూపాలుగా భావించడానికి వీలుకాదని, ఆయన శ్రీ మహావిష్ణువేన'ని ఋజువు చేయవలసిన అవసరం అన్నమయ్యకు కనిపించలేదు. అంతకుముందే రామానుజుల కాలంలోనే స్వామి విష్ణువేనని నిరూపించబడింది. ఇది ఆ కాలపు భక్తులందరికీ తెలుసు. వివిధరూపాలలో కనిపించే దేవతలకు జరిగే పూజలన్నీ మహావిష్ణువుకే చెందుతాయన్నది వైష్ణవ సిద్ధాంతం, అందువల్ల స్వామిని ఇతర రూపాలుగా భావించి అర్చించడంలో తప్పులేదని అన్నమయ్య మతం. ఈ విషయాన్ని తెలిపే ఒక ప్రధానమైన పాటను అన్నమయ్య రచించాడు. ఆ పాటను చూడండి—

ఎంతమాత్రమున నెవ్వరు దలచిన అంత మాత్రమే నీవు
అంతరాంతరము లెంచి చూడఁబిండంతే నిప్పటి యన్నట్లు ॥పల్లవి॥

కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుఁడని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మంబనుచు
తలఁతురు మిము శైవులు తగిన భక్తులును శివుఁడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆదిభైరవుఁడనుచు ॥ఎంత॥

సరి నెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీవనుచు
దరిశనముల మిము నానా విధులను తలఁపుల కొలఁదుల భజింతురు
సిరులమిమ్మునే యల్పబుద్ధిఁ దలచిన వారికి నల్పంబవుదువు
గరిమల మిమునే ఘనమని తలఁచిన ఘన బుద్ధులకు ఘనుడవు ॥ఎంత॥

నీ వలన గొరతే లేదు మరి నీరు కొలఁది తామెరవు
ఆవల భాగీరథి దరి బావుల ఆ జలమే వూరినయట్లు
శ్రీ వేంకటపతి నీవైతే మముఁ జేకొని వున్న దైవమని
యీవల నీవే శరణని యెదను యిదియే పరతత్త్వము నాకు ॥ఎంత॥

— ఆధ్యాత్మ సంకీర్తనలు, సం. 2, సంకీర్తన 393.

అన్నమయ్యకు శ్రీవేంకటేశ్వరుడే పరతత్త్వం. ఆ పరతత్త్వాన్ని వైష్ణవులు విష్ణుడని, శైవులు శివుడని, కాపాలికులు భైరవుడని, శాక్తేయులు శక్తియని పిలిచారు. ఈ అంశలన్నీ సమన్వయం పొందిన పరతత్త్వం వేదాంతులు దర్శించే పరబ్రహ్మ స్వరూపం. శివుడు, భైరవుడు శైవ తత్త్వానికి చెందిన అంశలు, శైవ తత్త్వంలో శాంతరూపం శివుడైతే క్రోధరూపం భైరవుడు. శివుడు శుభంకరుడు. భారతదేశంలో శివతత్త్వం అనాదిగా ఉంది. ఋగ్వేదంలో అభవ, శివ, రుద్ర అనే రూపాలు కనిపిస్తాయి. అందుకే అన్నమయ్య ఆదిభైరవుణ్ణి పేర్కొన్నాడు. సృష్టిని నియంత్రించేది శక్తి. శక్త్యారాధకులు శాక్తేయులు. ఈమె స్త్రీ దేవత. ఉత్కృష్టమైన పరతత్త్వానికి స్త్రీ పురుష భేదం లేదు. ఈ భేదం ఉపాసకుని దృష్టి భేదం నుండి పుట్టి వర్ధిల్లింది. ఈ పాటలో అన్నమయ్య స్వామిని ఎందుకిలా భావించాడన్నది ప్రశ్న. అన్నమయ్యకు స్వామి శివుడుగా భైరవుడుగా శక్తిగా కనిపించలేదని, ఆయన మనోదృష్టిలో ఎల్లప్పుడూ భువనసుందరుడైన శ్రీమన్నారాయణుడుగానే గోచరమైనాడని ఆయన వ్రాసిన అనేకానేక పాటలు నిరూపిస్తాయి. ఇలా అన్నాడంటే అది ఆనాటి సంఘంలో నలుగుడు పడుతున్న కొందరి అభిప్రాయ ప్రకటనమేనని భావించాలి. అన్నమయ్య నాటికి స్వామిని గురించి ఇలాంటి ఆలోచనలున్నాయని ఈ పాట వ్యక్తం చేస్తున్నది. ఈ అభిప్రాయం అన్నమయ్య నాటిదే కాదు, చాల ప్రాచీనకాలం నుండి ఉన్నదే. భగవద్రామానుజులు ఎన్నో పురాణాల నుండి ఉపపత్తులు చూపించి తిరుమలదైవం వైష్ణవదైవమని నిర్ణయించడమే కాక ఆ కాలం నాటి ప్రభుత్వాలను, భక్తులను, ప్రజలను నమ్మించాడు. అప్పటినుండి శ్రీ వేంకటేశ్వరుడుగా ఆరాధింపబడే తిరుమలదైవం వైష్ణవదైవమని లోకంలో స్థిరపడింది. అయినా కొందరిలో స్వామి శివుడనే అభిప్రాయం కూడా కొనసాగుతూనే వచ్చింది. స్వామి ఎవరు ఎలా భావిస్తే అలా వారిని ఉద్ధరిస్తూ

రావడంవల్ల అభిప్రాయ భేదాలకు తావు లేకుండా పోయింది. ఇది వేంకటాచల మాహాత్మ్యం, శ్రీనివాసుని సంకల్పం.

కాలక్రమంగా కొందరి ఆలోచనలలో ఉండిన స్వామి శివతత్త్వం 20వ శతాబ్ది ప్రారంభం వరకు కొనసాగింది. తిరుమల ఆలయం మొదట శైవక్షేత్రమని, ఈ క్షేత్రానికి అనుబంధంగానే తిరుచానూరులో సుందరరాజ పెరుమాళ్ ఆలయం నిర్మింపబడిందని, సుందరరాజ పెరుమాళ్ శైవదైవమని తెలిపే కొన్ని ఆధారాలున్నట్లు చరిత్ర చెప్తున్నది.

## ప్రభుత్వ శాసన శాఖవారి వివరణ:

తిరుమల ఆలయానికి సంబంధించిన విశ్వాసాలెలా ఉన్నా ఆలయంలో పూజాది కార్యక్రమాలు కుంటుపడకుండా జరిగాయి. చారిత్రకంగా పరిశీలిస్తే ఈ ఆలయ నిర్వహణను రాజవంశాల తరువాత కుంఫిణీ ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్నది, కంపెనీ ఉద్యోగులు మత సంస్థలో జోక్యం చేసుకోవడం హిందువులకు నచ్చలేదు విక్టోరియా మహారాణి కాలంలో కుంఫిణీ ప్రభుత్వాధికారులు ఇంగ్లాండులో ఆలయ వ్యవహారం హిందువులకే అప్పగించాలని క్రీ.శ. 1842-43ల మధ్య ఒక నిర్ణయం తీసుకొన్నారు. ఈ నిర్ణయం ప్రకారం శ్రీ వేంకటేశ్వర దేవాలయం, గోవిందరాజ, శ్రీరామ, కపిలేశ్వర, పద్మావతీ దేవాలయాల నిర్వహణ 21-4-1843లో శ్రీ హాథీరాంజీ మఠానికి చెందిన మహంతు శ్రీ సేవాదాసు గారికి అప్పగించబడింది.[2] అప్పటినుండి 1933 వరకు ఆరు తరాల మహంతులు విచారణ కర్తలు (పరిపాలకులు)గా ఆలయాలను నిర్వహించారు. కుంఫిణీ ప్రభుత్వ పరిపాలన కాలంలోనే 'మద్రాసు ప్రెసిడెన్సీ' ఏర్పడింది. భారతదేశంలోని ప్రాచీన అవశేషాలను వెలికి తీసి భద్రపరచడానికి పురావస్తుశాఖ ఏర్పడింది. 'సీవెల్' అనే ప్రెసిడెన్సీ ఉద్యోగి దక్షిణ భారతదేశంలో అప్పుడప్పుడే కనుమరుగవుతూ ఉండిన ఎన్నో ప్రాచీన దేవాలయాలను, ఇతర కట్టడాలను పరిశీలించి, ఎన్నో విషయాలను సేకరించి "Antiquarian Remains of the Madras Presidency" అనే పేరుతో రెండు సంపుటాలు సిద్ధం చేశాడు. ఈ సందర్భంలోనే పురావస్తుశాఖకు అనుబంధంగా శాసన పరిశోధన శాఖ ఏర్పడింది. ఈ శాఖ కార్యాలయం 'ఊటీ'లో నెలకొల్పబడింది. 'ప్రెసిడెన్సీ'

లోని అన్ని ప్రాంతాలు తిరిగి శాసనాలు సేకరించే పని ప్రారంభమైంది. అధికారిక శాసనపరిశోధకులుగా ఇద్దరు ముగ్గురు ఆంగ్లేయులు పనిచేసిన తరువాత ఆ పదవిలోకి వెంకయ్య అనే భారతీయుడు వచ్చాడు. అప్పటి శాసనపరిశోధకుల పని ఏమిటంటే ఒక సంవత్సరంలో తిరిగి సేకరించిన శాసనాలను అధ్యయనం చేసి, శాసనాల నివేదిక తయారుచేసి ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి పంపడం. ప్రభుత్వం ఆ నివేదికలను ప్రచురించేది. ఇలా ప్రచురింపబడిన నివేదికలే తరువాత "Annual 'Reports on South Indian Epigraphy' పేరుతో వార్షిక శాసన నివేదికలయినాయి. 1-6-1904 లో వెంకయ్య తయారుచేసి ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి పంపిన నివేదికలో తిరుమల, తిరుచానూరు దేవాలయాలకు సంబంధించిన ఆసక్తికరమైన విషయాలున్నాయి. అందువల్ల ఆంగ్లంలో ఉన్న ఆ నివేదికను పూర్తిగా ఇక్కడ చూపడం అవసరం.

"From Tirumala I (V. Venkayya, M.A., officiating Govt. Epigraphist) proceeded to Thiruchānūr, which is popularly known as Chiratānūr and as Padmasaras among the Madhvas. The village derives its importance from the temple which is now dedicated to Alamēlumanga, the consort of the God at Tirupati and which is a comparitively recent one. It is doubtful if this goddess was the presiding deity of the place in early times as well. The most ancient shrine of the temple, which is said to have been called Sundararāja Perumal was pulled down a few years ago and the ancient Inscriptions which it contained were all scattered. Some of the inscribed slabs are found at the entrances to private houses. A few have been built into modern structures and others are laying uncared for in the temple and its neighbourhood. In some of these fragments the village is called Tiruchchōgunur or Tiruchchōginur, while the form Tiruchchōgunur occures in later inscriptions found at Yogimallavaram, which is quite close to

Tiruchchanur. Thus the connection which is claimed for the village with the sage Śuka is not warrented by earlier records. **The temple or at least the shrine which has been pulled down was apparently known in ancient times as Iḷangōyil.** In one of the Tanjore inscriptions of the Chola King Rajaraja-I (South Indian Inscriptions, Vol. II No. 66) reference is made several times to the Tiruviḷangōyil temple at Kaḍambūr. **Here there is nothing to prove absolutely whether Tiruviḷangōyil was a Saiva or Vaishnava temple.** The Tamil work Periyapuranam, which gives an account of the sixty-three devotees of Siva mentions the Iḷangōyil at Mīyachchūr, which must be Saiva. Again in the Nallure grant of Vijayanagara King Harihara-II published by me (EP. Ind. Vol. III, p. 126, Verse 24) Yaḷangōyil which is a popular form of Iḷangōyil, occures as the name of a Saiva temple. The word Iḷangōyil itself means 'the house of the young king' and may be taken to devote a shrine of Subrahmanya. Thus there is reason to suppose that the shrine in Tiruchchānūr temple which has been pulled down was originally called Iḷangōyil and was therefore Saiva. From the earliest hitherto discovered inscription of the place (No. 262 of 1904) it appears that this shrine was built as an accompaniment of the temple at Tirupati, known at that time as Tiruvengaḍattu Perumanaḍigal. **Perhaps this can be taken to support the popular belief that the deity at Tirumala was originally Slva.**"[8]

క్రీగీతలు గల ఆంగ్ల వాక్యాలు నిశితంగా పరిశీలింప దగినవి, ఈ ఆంగ్ల వాక్యాలను బట్టి నేటి పద్మావతీదేవి ఆలయం ప్రాచీన కాలంలో తిరువిళంగోయిల్ అని, 20వ శతాబ్ది ప్రారంభంలో ఇదే ఆలయం సుందరరాజపెరుమాళ్ ఆలయంగా పిలవబడేదని, 1904 కు కొన్ని సంవత్సరాల ముందు ఈ దేవాలయం కూల్చ

బడిందని అర్థమవుతున్నది. ఈ దేవాలయానికి సంబంధించిన శాసనాలున్న కొన్ని రాతిపలకలు దేవాలయ సమీపంలో అక్కడక్కడ చెల్లాచెదురుగా పడి ఉండినట్లు కూడా వెంకయ్య చెపుతున్నాడు. సుందరరాజపెరుమాళ్ శైవదైవం. ఈ దేవాలయం తిరువేంగడంలో కొలువున్న దేవునికి అనుబంధంగా నిర్మింపబడినదట. తిరుమలలో కొలువైన దేవుడు శివుడని ఆనాటి ప్రజలలో గల విశ్వాసాన్ని ఈ విషయం బలపరుస్తున్నది. దీనిని బట్టి శ్రీ పద్మావతీదేవి తిరుచానూరు ఆలయంలో ప్రాచీనకాలం నుండి కొలువున్న దేవత కాదేమోననిపించే అవకాశం ఉంది. తిరుచానూరుకు సంబంధించిన క్రీ. శ. 8 లేక 9వ శతాబ్దికి చెందిన శాసనాలు యోగి మల్లవరంలో దొరికాయి. బహుశ ఈ కాలంలోనే తిరుచానూరు దేవాలయం సుందరరాజపెరుమాళ్ ఆలయంగా పిలవబడి ఉంటుంది. ఈ విషయాలను బట్టి తిరుచానూరు దేవాలయం ఒకప్పుడు శైవక్షేత్రంగా ఉండి క్రీ. శ. 19వ శతాబ్ది చివరి దశకంలో వైష్ణవ క్షేత్రంగా మారి ఉంటుందని ఊహించవలసి ఉంది. తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి ఆలయంలోను, తిరుమల శ్రీనివాసుని ఆలయంలోను వైఖానస పాంచరాత్ర ఆగమ విధుల ననుసరించి వైష్ణవ పూజా విధానాన్ని నిబంధించిన రామానుజుల దృష్టి తిరుచానూరు దేవాలయం మీద పడలేదన్నది చారిత్రక సత్యం. ఒకవేళ పడి ఉంటే అన్నమయ్య నాటికే ఈ దేవాలయం వైష్ణవ క్షేత్రంగా మారి ఉండేది.

వెంకయ్య చెప్పిన మాటలను తేలికగా తీసిపారేయడానికి వీలుగాదు. ఎందుకంటే ఆనాటి ప్రజలలో గల విశ్వాసాలనే కాకుండా కొన్ని శాసనస్థ విషయాలను కూడా పరిశీలించిన తరువాతనే ఆయన ఆ మాటలు చెప్పాడు. అప్పటి వారికి సత్యదృష్టి ఎక్కువ కదా! ఒక మత వ్యవస్థకు సంబంధించిన దేవాలయంలో కాలక్రమంలో మరొక మతవ్యవస్థ ఏర్పడడం చరిత్రకు కొత్తకాదు. ఆంధ్రదేశంలోనే ఎన్నో ప్రాచీన బౌద్ధ జైన దేవాలయాలు శైవ దేవాలయాలుగా మార్పు చెందాయి. ఈ మార్పులో భాగంగా శైవ దేవాలయాలు వైష్ణవ దేవాలయాలుగా మారి ఉండవచ్చు. ఈ మార్పు క్రీ. శ. పదమూడు పదునాల్గవ శతాబ్దాలలో జరిగింది. ఇలాంటి మార్పు తిరుచానూరు దేవాలయంలో ఆలస్యంగా జరిగి ఉంటుంది. కుంఫిణీ ప్రభుత్వం 21-4-1843 లో తిరుచానూరు శ్రీ పద్మావతీ దేవాలయాన్ని కూడా శ్రీ హాథీరాంజీ మఠానికి అప్పగించినట్లు చరిత్ర చెపుతూ ఉండడంవల్ల తిరుచా

నూరులో శ్రీ పద్మావతీ దేవాలయం అప్పటికే బాగా ప్రసిద్ధి చెందిన దేవాలయంగా ఉండినట్లు భావించవలసి ఉంది. ఈ దేవాలయాన్ని వెంకయ్య 'Comparitively recent one' అన్నాడు. అంటే 1904 నాటికి సుమారు వంద సంవత్సరాల ముందుదిగా అనుకోవచ్చు. ఒకప్పుడు సుందరరాజపెరుమాళ్ కోవెలగా ఉండినా ప్రస్తుతం పద్మావతీ దేవాలయం వైష్ణవ దేవాలయం. ఈ దేవాలయ చరిత్రలో ఎన్నో మార్పులు జరిగి ఉండవచ్చు.

## వెంకయ్య అభిప్రాయం:

తిరుమల ఆలయం శైవదేవాలయం కాబట్టి దానికనుబంధంగా తిరుచానూరులో కూడా సుందరరాజపెరుమాళ్ గుడి కట్టబడి ఉంటుందని వెంకయ్య అభిప్రాయపడినట్లు ఆయన వ్రాసిన చివరి ఆంగ్ల వాక్యం చెబుతున్నది. ఒక రకంగా ఇది ఆయన అభిప్రాయం కూడా కాదు. ఆనాటి ప్రజల వ్యవహారంలో ఉండిన ఒక అభిప్రాయాన్ని ఆయన చెప్పాడు. ఇలా చెప్పడంవల్ల ఆయన కూడా ఈ అభిప్రాయాన్ని అంగీకరించినట్లు అవుతున్నది. శాసన పరిశోధకుడుగా చారిత్రకుడుగా అందులోని సత్యాసత్యాలను వెల్లడించే ప్రయత్నం ఆయన చేయలేదు. అది శాసన నివేదికకు చెందిన ఉపోద్ఘాతం కాబట్టి అప్పటికి ఆయనకా స్ఫురణ లేదు. ఇది చాల నిదానంగా, సహేతుకంగా ఆలోచించవలసిన విషయం. 1904 లో వెంకయ్య ప్రజాభిప్రాయాన్ని గ్రంథస్థం చేయడం, 15వ శతాబ్దిలోనే అన్నమయ్య శ్రీనివాసుడు భక్తులకు వారివారి దృష్టిననుసరించి శివుడుగా శక్తిగా దర్శనమిస్తాడని పాటద్వారా ప్రకటించడం, అంతకుముందే ఆళ్వారులు స్వామిలో శివాంశ కూడా కనిపిస్తున్నదని తమ పాశురాలలో ప్రస్తుతించడం మొదలైన విషయాలను లోతుగా పరిశీలిస్తే శ్రీ వేంకటేశ్వరుడు శైవదైవమనే అభిప్రాయం ప్రాచీనకాలం నుంచి అందరిలో కాకపోయినా కొందరిలోనైనా ఏర్పడి వెంకయ్య కాలం వరకు ప్రచారంలో ఉండి ఉంటుందని అనిపిస్తున్నది. తిరుపతి ఆలయం వైష్ణవాలయమేనని, అందలి దైవం శ్రీమన్నారాయణుని అర్చావతారమైన శ్రీ వేంకటేశ్వరుడని క్రీ. శ. 13వ శతాబ్దిలో రామానుజులవారు నిరూపించి స్థాపించినట్లు శ్రీ వేంకటాచల ఇతిహాసమాల ప్రకటిస్తున్నది.[4] తదాదిగా తిరుమల వైష్ణవక్షేత్రమనడానికి ఎవరికీ అనుమానం ఉండేది కాదట. అంటే అంతకుముందు అనుమాన

మున్నట్లే కదా! ఇది ఆధారాలు లేని అనుమానం. వేంకటాచలాధీశుని గురించి వివరించే ఆధారాలన్నిటిని పరిశీలిస్తే ఈ అనుమానం నిరాధారమైందిగా తోస్తుందని వైష్ణవపండితులు చెపుతారు. ఈ ఆధారాలను అన్నమయ్య చూడకుండా ఉంటాడా? అయినా 'ఎంతమాత్రమున నెవ్వరు దలచిన' అనేపాట వ్రాశాడు. ఈ విషయాన్ని ఇంక కొంచం లోతుగా పరిశీలించవలసి ఉంది. దీనికి ముందు వేంకటాచలాన్ని గురించి ప్రాచీన సాహిత్యం ఏమంటున్నదో చూద్దాం.

**తమిళ సాహిత్యం :**

ప్రాచీన తమిళ సాహిత్యం వేంకటాచలాన్ని ఎన్నో విధాలుగా ప్రస్తావించింది. ఈ సాహిత్యం తిరుమలను 'తిరువేంగడమ'ని శ్రీ వేంకటేశ్వరుని 'తిరువేంగడడన్' అని కీర్తించింది. పాణిని కాలానికి ముందుదిగా చెప్పబడుతున్న తొల్కాప్పియమ్ ఉత్తర దిశలో ఉన్న వేంగడానికి దక్షిణ దిశలో ఉన్న కుమారికి (కేప్ కొమారిన్) మధ్యగల ప్రాంతం తమిళభాషా ప్రాంతమని చెప్పింది. దీనినిబట్టి క్రీస్తు శకానికి కొన్ని వందల సంవత్సరాల ముందు నుండి తిరుమలకు తిరువేంగడమనే వ్యవహారనామముండినట్లు అర్థమవుతుంది. తిరువేంగడాన్ని వైష్ణవ క్షేత్రంగాను, తిరువేంగడడన్‌ను శ్రీమన్నారాయణుడుగాను తమిళసాహిత్యం భావించింది. ఈ భావనలో తరువాత కాలాలలోకూడా మార్పులేదు. తమిళ కావ్యయుగానికి చెందిన పత్తుపట్టు, పురననూరు, శిలప్పదికారమ్, మణిమేఖలై మొదలైన కావ్యాలన్నీ తిరువేంగడాన్ని ప్రస్తావించాయి. క్రీ. శ. 2వ శతాబ్దానికి చెందినదిగా భావింపబడుతున్న శిలప్పదికారమ్ తిరువేంగడంమీద కొలువుతీరిన శ్రీనివాసుని హృద్యంగా వర్ణించింది.

"వీంగ్‌నీర్ అరువి వేంగడమ్ ఎన్నుమ్
ఓంగు ఉయర్ మలయత్తు ఉచ్చిమీమన్లై
ఎరి కదిర్ న్యాయరుమ్ అంగుళమ్ విళంగి
ఇరుమరంగు ఓంగియ ఇడై నిలై త్తానత్తు
మిన్నుక్కోడి ఉడుత్తు విళంగి ఎల్ పూండు
నన్నిఱమేగ నిన్డదు పోల
పగై అణం కాళియుమ్ పాల్ వెణ్ చెంగముమ్

తగ్గి సెఱు తానరై కయినేన్ది
నలన్ కిళర్ ఆర్ మార్బిల్ పూండు
పొలమ్ పూవాడయిల్ పొలిందు తోన్రియ
చెంగ నిడియోన్ ఇన్ద వణ్ణముమ్"

(శిలప్పదికారమ్, కన్దుకన్ కథై 42-53)

పద్మాక్షుడైన శ్రీమహావిష్ణువు తిరువేంగడంపై అర్చామూర్తిగా కొలువుతీరి ఉన్నాడు, రెండువైపుల కనిపించే కాంతిప్రవాహం స్వామి కిరువైపుల సూర్యచంద్రులవలె ఉంది. కటిభాగం నుండి కింది వరకు కాంతులు వెదజల్లే బంగారు వస్త్రం కట్టబడి ఉంది. ఉదరంపైన అందమైన పూమాల శోభిస్తూ ఉంది. రెండు చేతులలో అప్రతిహతమైన సుదర్శన చక్రం, ధవళ శంఖం అమరి ఉన్నాయి. ఈ ఆకారంలో స్వామి మెరుపుతీగ ఇంద్రధనస్సులో ఒప్పారే నీలమేఘంవలె కనిపిస్తున్నాడు.

ఈ వర్ణనను పరిశీలిస్తే తిరువేంగడం మీద వెలసిన దైవం శ్రీ మహావిష్ణువే గాని అన్యదైవం కాదని తెల్లమవుతుంది. అయితే ఆళ్వారులలో ఒకరిద్దరు స్వామిలో శైవాంశ కనిపిస్తున్నదని ప్రస్తుతించడంవల్ల భక్తులలో ఈ సందేహం ఏర్పడిందేమోననిపిస్తుంది. ఆళ్వార్ అనే మాటకు విష్ణుభక్తుడని అర్థం. ఈ మాటలోనే వైష్ణవముంది. అలాంటి ఆళ్వారులు స్వామిని శివుడంటారా ? వాళ్ళకలాంటి ఆలోచనే రాదు. స్వామి విరాడ్రూపంలో ఇతర దైవాంశలన్నీ సమన్వయం పొందినట్లు వీరికి అనుభూతి కలిగింది. వైష్ణవ సంప్రదాయం ఆళ్వారులు పంద్రెండుగురని పేర్కొన్నది. పొయ్‌గై ఆళ్వారు, పూదత్తాళ్వారు, పేయాళ్వారు, తిరుమళిగై ఆళ్వారు, నమ్మాళ్వారు, కులశేఖరాళ్వారు, పేయాళ్వారు, తొండరరడిప్పొడి ఆళ్వారు, తిరుప్పాణాళ్వారు, తిరుమంగై ఆళ్వారు, మధురకవి ఆళ్వారు, అండాళ్—ఈ పన్నెండుగురు. వీరిలో తొండరడిప్పొడి ఆళ్వారు, మధురకవి ఆళ్వార్లు తప్ప మిగిలిన పది మంది ఆళ్వార్లు తిరువేంగడాన్ని తిరువేంగడనాధుని తమ దివ్య ప్రబంధాలలో కీర్తించారు. వీళ్ళెవరూ తిరువేంగడానికి రాలేదు. ఈ క్షేత్రప్రశస్తిని విని, తమ దార్శనిక శక్తితో స్వామిని చూశారు. కొందరికి స్వామిలో శివాంశ కనిపించింది.

శ్రీ పేయాళ్వార్ :

ఈ యాళ్వారు స్వామిని 19 పాశురాల్లో కీర్తించాడు. ఈయనకు స్వామి హరిహరాత్మకమూర్తిగా దర్శనమిచ్చాడు. కింది పాశురాల్ని గమనించండి.

"తాళ్ శడైయుమ్ నీళ్ ముడియుమ్ ఒణ్ మళవుమ్ శక్కరముమ్
శూళరవుమ్ పొన్నాణుమ్ తోన్రుమాల్ శూళుమ్
తిరణ్ణరువి పాయుమ్ తిరుమలై మేలెన్దైక్కు
ఇరణ్ణురువు మొన్రా ఇశైన్దు"[5]

ఈ పాశురానికి తెలుగు అనువాదమిలా ఉంటుంది. "చల్లని కొండకాలువలో రమణీయమైన వేంకటాచలంపై వేంచేసివున్న స్వామికి తలపై జటలు, కిరీటం, చేతిలో గొడ్డలి, చక్రం, మొలలో నాగాభరణం, బంగారుమొలతాడు ఉండడంవల్ల ఈయన హరి స్వరూపి, హరస్వరూపిగా కూడా భావింప బడుతున్నాడు,"

తిరువేంగడాన్ని మొట్టమొదట తిరుమలగా పేర్కొన్నవాడు పేయాళ్వార్. ఆయన కూడా తిరుమలకు రాలేదు. స్వామిని చూడలేదు. మనోనేత్రంతోనే స్వామిని దర్శించాడు. స్వామి హరిహరాత్మక మూర్తిగా ఈయనకు గోచరించాడు. దీనినిబట్టి స్వామిని శివుడని చెప్పడానికి వీలుగాదు. అయితే ఈ యాళ్వారు స్వామి నిలా భావించడానికి కూడా చారిత్రక కారణాలున్నాయి. తమిళ దేశంలో శైవం వైష్ణవం ఇంచుమించు ఒకే కాలంలో ప్రాచుర్యం పొందాయి.

భక్తి ఉద్యమం :

దక్షిణ దేశంలో ఏర్పడిన భక్తి ఉద్యమానికి శైవ, వైష్ణవ శాఖలు మూల స్తంభాలు. ఈ ఉద్యమావిర్భావానికి కారణం అప్పుడప్పుడే తమిళ దేశంలో వ్యాపిస్తూ ఉండిన బౌద్ధమే. సన్యాసులు, తత్త్వవేత్తలు ఉద్రేకపూరితమైన ఒక భక్తి ఉద్యమాన్ని రూపొందించారు.

"The movement was strongly theistic in its character and definitely aimed at puting down Jainism and Buddhism. An ardent devotion to Siva or Vishnu began to spread among the people. The Saiva Saints

known as Nāyanmārs of whom these were 63 and the Vaishnava leaders called Aḷwars ten or twelve in number according to different accounts kept moving from shrine to shrine singing devotional songs and holding public disputations. Royal patronage came to be transferred to the Bhakti movement. Hymns in praise of Siva and Vishnu were composed in easy popular speech of the time and were so soul-stirring that people were greatly attracted to the Bhakti Movements.''[6]

భక్తి ఉద్యమంలో క్రీ. శ. 10వ శతాబ్దం తరువాత శైవ వైష్ణవాల మధ్య ఘర్షణలు ఏర్పడినాయి. శైవం వీరశైవంగాను, వైష్ణవం వీర వైష్ణవంగాను మారాయి, క్రీ. శ. 2వ శతాబ్ది నుండి 9వ శతాబ్ది వరకు మత పరమైన ఒడు దుడుకులు ఎక్కువగా కనిపించవు. నాయన్మారుల, ఆళ్వారుల ఉపాస్య దైవాలు వేరైనా వారి దృష్టి వైదిక మతోద్ధరణ. ఉత్తర భారతం నుండి వచ్చి ప్రాచుర్యం పొందుతూ వుండిన బౌద్ధ జైనాలను ప్రజల మనసుల నుండి తరిమి కొట్టడానికి వీరు ప్రయత్నించారు. తిరుమంగై ఆళ్వారు నాగపట్నంలోని బౌద్ధ విహారంలో స్థాపించిన బంగారు బౌద్ధ విగ్రహాన్ని అపహరించి శ్రీరంగంలోని శ్రీరంగనాథ దేవాలయ మరమ్మత్తు పనులకు ఉపయోగించాడని చరిత్ర నమ్ముతూ వుంది.[7] ఇందులోని సత్యాసత్యాల మాట ఎలా వున్నా భక్తి ప్రచారానికి ఆళ్వారులు ఎంత పాటుపడినారో దీనిని బట్టి ఊహించవచ్చు. పన్నెండుగురు ఆళ్వారులు క్రీ. శ. 2-8 శతాబ్దాలమధ్య జీవించినట్లు పండితుల అభిప్రాయం.[8] పండ్రెండవ ఆళ్వారైన ఆండాళ్ క్రీ. శ. 776లో జన్మించింది. సమకాలికులైన నాయన్మారులు ఆళ్వారులు కూడా ఉన్నారు. తిరుప్పాణాళ్వారు నందనార్‌కు సమకాలికుడు. వీరు ఒకరి స్తుతు లను మరొకరు వినే ఉంటారు. మార్గాలు వేరైనా వారి ప్రయత్నం, ప్రయోజనం ఒకటిగానే ఉండి ఉంటుంది. ఒకే పరతత్త్వంలో రెండు రూపాలుండటం విచిత్ర మేమీ కాదనిపించి ఉంటుంది. పేయాళ్వారుకు ఋగ్వేదంలోని పురుష సూక్తం మదిలో మెదిలి ఉంటుంది. స్వామి హరి హరాత్మకంగా దృష్టి పథంలో వెలిగాడు. ఈ కారణాలచేతనే ఆ పాశురం పేయాళ్వారు నోటి నుండి జాలువారి ఉంటుంది.

హరిహర రూపిగా కనిపించిన స్వామి ఈ ఆళ్వారుకు వక్షస్థలంలో లక్ష్మిని నిలుపుకొన్న శ్రీమన్నారాయణుడుగా కూడా కనిపించాడు.

"The greatness of Peyāḷwar lay in his knowledge-vision of the divine from deeper perception of God s eternal di-unity as Divine-Two, comprising Nārāyaṇa and his consort Sri (Tiru)."[9]

**శ్రీ పొయ్‌గై యాళ్వారు :** ఈయన పది పాశురాల్లో శ్రీ వేంకటేశ్వరుని స్తుతించాడు. ఈయన వెలిబుచ్చిన అభిప్రాయాలు చాల విలువైనవి. శ్రీమన్నారాయణుడు ఎప్పుడూ భూమి పైననే నివసించాలని సంకల్పించి శ్రీనివాసమూర్తిగా తిరుమలలో అవతరించాడని, నిలబడి భక్తుల ఆర్తిని పోగొడుతున్న స్వామి అపురూప సౌందర్యాన్ని తిరువేంగడంలోనే దర్శించానని —

"ఇడన్దదు బూమి ఎడుత్తదు కున్నమ్
కడన్దదు కఞ్జనై మున్నఞ్జ - క్కిడన్దదు వుమ్
నీ రోద మా కడలే నిన్నదువుమ్ వేఙ్గడమే
పేరోదు వణ్ణర్ పెరిదు"[10]

అనే పాశురంలో వర్ణించాడు. మరొక పాశురంలో తిరువేంగడం మీద కొందరు ఆటవికులైన కురవజాతివారు తప్ప మరెవ్వరూ ఉండేవారు కాదని, ఆ ప్రాచీన దశలో స్వామికి జరిగే పూజ నియమానుసారంగా ఉండేది కాదని, అక్కడకెళ్ళిన భక్తులు వారికి తోచిన రీతిలో పూజాదికాలు నిర్వర్తించేవారని వివరించాడు.[11] ఈ ఆళ్వారు కూడా తిరువేంగడాన్ని స్వయంగా దర్శించలేదు. ఈ పాశురంలోని విషయం ఆయన ఎవరి ద్వారానో విన్నదే. పూజాదికాలు ఎవరి ఇష్టమొచ్చినట్లు వారు నిర్వహించేవారన్న విషయం చాల విలువైంది. ఇది క్రీ. శ. ఏడెనిమిది శతాబ్దాల ముందు విషయం. శ్రీనివాసుని అప్పటి అర్చామూర్తి కొందరు భక్తులకు శివరూపంగాను, శక్తిరూపంగాను కనిపించిందేమో. అప్పటి నుండి తిరువేంగడం మీద వెలసిన దైవం శివుడని, శక్తియని పరంపరాగతమైన ప్రచారం కొనసాగిందేమో. తమిళ దేశంలో పరిపుష్టి పొందిన వైష్ణవం తిరుపతికి వచ్చిన తరువాత స్వామికి జరిగే పూజాదికాలు వైష్ణవాగమాల ననుసరించి నిబంధింపబడినాయి. పొయ్‌గై ఆళ్వారు చెప్పినది అప్పటికి ప్రాచీన దశ. ఆ తరువాత తిరుమల వైష్ణవ

క్షేత్రంగా ప్రసిద్ధి పొందినా ప్రాచీన దశలలో ఏర్పడిన పరంపరాగతమైన అభిప్రాయాలు సమాంతరంగా కొనసాగి ఉంటాయి. ఈ యభిప్రాయాలు అన్నమయ్య నాటికీ ఉన్నాయి.

**భగవద్రామానుజ ముని :**

నాథముని, యామునాచార్యులు, వేదాంతదేశికులు మొదలైన వాళ్ళంతా శ్రీ వైష్ణవానికి ప్రచార ప్రాభవాలు కలిగించినా రామానుజుల కాలంలోనే వైష్ణవం రాజాదరణను, ప్రజాదరణను పొంది బాగాపండి ఫలవంతమైంది. తిరుమల ఆలయంలో అప్పటివరకు కొనసాగుతూ వుండిన పూజా విధానంలోని అవ్యవస్థను చక్కదిద్ది వైఖానస పాంచరాత్రాగమాల ననుసరించి ఆ పద్ధతిని క్రమబద్ధం చేసినవాడు రామానుజాచార్యులు. అప్పటివరకు స్వామి రూపానికి సంబంధించి ఏర్పడిన ఎన్నో సందేహాలను తొలగించి యాదవరాజు కొలువులో వేంకటేశ్వరుడుగా పిలవబడే దైవం విష్ణువేనని వేదాగమ పురాణాల నుండి కావలసినన్ని ఉపపత్తులు చూపించి నిర్ద్వంద్వంగా నిరూపించినవాడు కూడా రామానుజాచార్యులే. క్రీ. శ. 10వ శతాబ్దిలో దక్షిణ భారత దేశంలో ఏర్పడిన మతస్పర్థల ఫలితంగా ఆధిక్యతకోసం శైవవైష్ణవాల మధ్య వాగ్వివాదాలు జరిగాయి. ఈ ఘర్షణలో ఆలయంలోని వైష్ణవాచార్యులు వేంకటాచలాన్ని వదలి ఇతర ప్రాంతాలకు వెళ్ళారు. ఇది అదనుగా గ్రహించి శైవులు అప్పటికి శ్రీ వేంకటేశ్వరుడు శివుడని పరంపరంగా ఉండిన అభిప్రాయం నిజమని నమ్మి దేవాలయంలో చేరి అప్పటివరకు కొనసాగిన వైష్ణవ పూజను మార్చి శైవాగమాల ననుసరించి పూజా విధానాన్ని ఏర్పరచారు. ఈ సందర్భంలో రామానుజులు శ్రీరంగం నుండి తిరువేంగడానికి రావలసి వచ్చింది. ఆయన రాకవల్ల తిరుమల తిరుపతులలో వైష్ణవం పునస్థాపితమైంది.

**శ్రీ వేంకటాచల ఇతిహాస మాల :**

ఇతర పురాణాలలో చెల్లాచెదురుగా ఉన్న వైష్ణవానికి అవసరమయ్యే అనేక విషయాలను సేకరించి తిరుమల కలియుగ వైకుంఠమని, శ్రీనివాసుడే శ్రీమన్నారాయణుడని చెప్పే ప్రయత్నం ఈ గ్రంథంలో కనిపిస్తుంది. స్వామి శివుడని, శక్తియని భావించేవారి సందేహాలన్నీ ఈ గ్రంథంచదివితే తొలగి పోతాయి.

ఈ గ్రంథం రామానుజుల కాలంలోనే సంస్కృత వచనంలో రచింపబడింది. ఋగ్వేదం నుండి వేంకటాచల మాహాత్మ్యం వరకుగల వివిధ పురాణాల నుండి స్వామిని విష్ణువుగా స్థాపించే అంశాలన్నీ ఇందులో ప్రదర్శితమైనాయి. ఋగ్వేదంలోని 'అరాయికానే వికటే గిరిం గచ్ఛ' అనే మంత్రం తిరువేంగడ పర్వతాన్ని గురించే చెపుతున్నదని, అందువల్ల అప్పటికే ఈ కొండకు ప్రశస్తి ఉండని ఈ గ్రంథం చాటుతున్నది. 'Puranas say that this Hill was brought here from the land of Vaikuntha by Garuda for the sport of the Divine couple. The Hill it self is spoken of as an Avatara of Apisesha, the serpent Couch of vishnu''[18] అనే అభిప్రాయం ఈ పర్వతం ప్రాచీనకాలం నుండి వైష్ణవంతో ముడి పడినదేవని చెపుతున్నది.

వామన పురాణంలో స్కందుడు వేంకటాచలం మీద తపస్సు చేసినట్లు కథ ఉంది. తారకాసుర వధ తరువాత కలిగిన మనస్తాపాన్ని పోగొట్టుకోడానికి తపస్సు చేయాలని కుమారస్వామి భావించాడు. ప్రశాంత వాతావరణం గల అనుకూల ప్రదేశం ఎక్కడుందో చెప్పమని తండ్రి నడిగితే శివుడు వేంకటాచలం మీద తపస్సు చేయమని సలహా ఇచ్చినట్లు కూడా ఈ పురాణంలో ఉంది. ఈ కథను ఆధారం చేసుకొని శైవ పూజారులు నారాయణవనానికి వెళ్ళి రాజుతో తిరువేంగడం శైవ క్షేత్రమేనని నమ్మించడానికి ఇలా చెప్పారు. ''The god who flourished on the southern side of Swamy pushkarini (Holy tank) is in reality Bhagavan skanda (Subrahmanya). He is alternately Called Kurmaraswamy and the Tank is called Swami pushkarini. because it is a tank. Just like Bhimasena is abbreviated ,Bhima' and Satyabhama 'bhama' it is easy to infer that Swami is an abbreviation of Kumara Swami ''[19] ఈ మాటలను రాజు నమ్మేటట్లు చేశారు వీళ్ళు. తరువాత కొందరు వైష్ణవులు శ్రీరంగానికెళ్ళి రామానుజుల వారికి ఈ విషయం తెలియజేశారు. ఆయన రాజా స్థానానికి వచ్చి రాజుకు కలిగిన సందేహాలను తొలగించి స్వామి విష్ణువేనని నిరూపించి అందరినీ ఒప్పించి వెళ్ళారు. ఈ విషయాలు చారిత్రకంగా నిరూపింపబడినాయి. అయితే ఇలాంటి అభిప్రాయాలు మధ్యయుగంలో కూడా ఉండడానికి

వేంకటాచల ప్రాచీన దశకు చెందిన సుస్థిరమైన అభిప్రాయాలు లేకపోవడమే కారణం. ఈ దేవాలయ ప్రాచీనత్వ దశను తెలుసుకోడానికి పురాణ విషయాలే ఆధారం.

**తిరుమల ఆలయ ప్రాచీన దశ:**

స్వామి పుష్కరిణి లక్ష్మీనారాయణుల క్రీడార్థం వైకుంఠం నుండి గరుడుని చేత తీసుకొని రాబడినదని పురాణాలు చెపుతున్నాయి. పుష్కరిణి సమీపంలో కుమారస్వామి తపస్సు చేయడంచేత ఇది స్వామి పుష్కరిణిగా పిలవబడిందని, అందువల్ల ఈ క్షేత్రం కుమారక్షేత్రం అయిందని ఆ తరువాత బలమైన అభిప్రాయా లేర్పడినాయి. వరాహ పురాణంలో స్వామి పుష్కరిణి మహిమ చెప్పబడింది. స్వామి పుష్కరిణిలో స్నానం, సద్గురువుల పాదసేవనం, ఏకాదశీ వ్రతం అనే మూడు అత్యంత దుర్లభాలని ఈ పురాణంచాటింది. ఈ పుష్కరిణీ స్నానం అనేక శుభాలను కలిగించడమే కాకుండా బ్రహ్మహత్యా పాతకాలను కూడా పోగొడుతుంది. అందుకే సుబ్రహ్మణ్యస్వామి తారకాసురుని చంపి నందువల్ల కలిగిన పాతకాన్ని పోగొట్టుకోడానికి పుష్కరిణికి ఉత్తరంవైపు తపస్సు చేసినట్లు కూడా ఈ పురాణం పేర్కొన్నది.[14] ఈ కథ తిరుమల గొప్పతనాన్ని గురించి చెపుతుందే కాని కుమారస్వామి ఇక్కడి ఉపాస్యదైవమని చెప్పదు.

వేంకటాచల మాహాత్మ్యంలో చెప్పబడిన పద్మావతీ శ్రీనివాసుల కల్యాణకథలోని ఆకాశరాజు, తొండమానుడు మొదలైన పాత్రల ననుసరించి తిరుమల ప్రాచీనతను నిర్ణయించడం కష్టం. పద్మావతీ శ్రీనివాసుల వివాహం తరువాత ఆకాశరాజు తమ్ముడైన తొండమానుడు (తుండీర మండల పాలకుడు) శ్రీనివాసునికి దేవాలయం నిర్మించినట్లు పురాణకథనం. ఈవిషయాన్నిగురించి తిరుమల తిరుపతి దేవస్థాన పరిశోధకులైన సాధు సుబ్రహ్మణ్యశాస్త్రి ఇలా అంటున్నారు. "This account of Bhavishyottara Purāṇa makes out that Tondaman was the builder of Venkateswara temple with the vimana, two gopuras, three prākāras, the severel apartments and appertinances in and out of it. as well as resting places on the way uphilis. But the Devasthanam inscriptions refer to those items as the service of different individuals

at different periods of time"[18] తిరుమల దేవాలయంలో క్రీ. శ. 8వ శతాబ్ది చివరిదశకం నుండి శాసనాలు కనిపిస్తుండడం చేత అప్పటినుండి దేవాలయ చరిత్రను చారిత్రకంగా పరిశీలించవచ్చు. కలియుగ ప్రారంభానికే ఈ దేవాలయం ఉండినదని చెప్పేవారు కూడా ఉన్నారు. విజ్ఞులు కొందరు ఆకాశరాజు కథను ప్రతీకాత్మకంగా వివరిస్తారు. ఆకాశరాజు ఆకాశానికి ప్రతీక. శ్రీమన్నారాయణుడు జలానికి ప్రతీక. తిరువేంగడమ్ పృథివికి ప్రతీక. తొండమానుడు స్నేహానికి ప్రతీక. భగవంతుడు ఆకాశం నుండి అంటే దివి నుండి అంటే నిత్య విభూతి నుండి భూమికి అంటే తిరువేంగడానికి అంటే లీలా విభూతికి చేరాడు. భూమి ఆయన లీలా విభూతికి రంగం. ఆయన నారాయణుడు కాబట్టి 'నార' అనే శబ్దానికి నీరని అర్థం ఉంది కాబట్టి పుష్కరిణి కూడా వైకుంఠం నుండి భూమి మీదికి వచ్చింది. భగవంతునికి భక్తునికి మధ్యగల సంబంధం స్నేహం లేక ప్రేమ. ఈ సఖ్యమే తొండమానుని ద్వారా స్వామికి ఆవాసం కలిగించి (దేవాలయం నిర్మించి) పునీతమైంది. ఈ ఆధ్యాత్మిక వివరణ దేవాలయం అనాదిగా ఉందని చెప్పడానికి పనికొస్తుంది.

శ్రీనివాసుని విగ్రహం స్వయం వ్యక్తమైన స్థానకమూర్తిగా అవతరించిందని భావిస్తారు. పొయ్‌గై ఆళ్వార్ కాలం వరకు ఈ విగ్రహం ఎవరెవరిచేత ఎన్ని విధాలుగా పూజింపబడిందో తెలియదు. ఆ స్థితిలో మత విశ్వాసాలు సరిగా ఆవిష్కరింపబడకపోవడంవల్ల, స్వామివారి విగ్రహం ఏ రూపానికి దగ్గరగా ఉందో పోల్చుకోవడానికి వీలుగాకపోవటంవల్ల ఒక పరతత్త్వానికి ప్రతిబింబమైన విగ్రహంగా పూజింపబడి ఉంటుంది. పొయ్‌గై ఆళ్వార్ కొండపై ప్రజలుండేవారని, కురబలనే ఆటవిక తెగవారు మాత్రమే ఉండేవారని, వారు కూడా వారికిష్టమైన రీతిలోనే పూజాదికాలు నిర్వహించేవారని చెప్పిన విషయం కూడా దీనికి ప్రోద్బలకంగా ఉంది. క్రీ.శ. [illegible]-వ శతాబ్ది నుండి దేవాలయానికి ఆధారాలతో కూడిన చారిత్రక స్థితి ఏర్పడింది. అంటే అప్పటికి శ్రీనివాసుని విగ్రహాన్ని కొందరు శివుడుగా, కొందరు శక్తిగా భావించి పూజాదికాలు నిర్వహించారు. శ్రీనివాసుని విగ్రహం శైవానికి గాని శాక్తేయానికి గాని చెందినది కాదని, వైష్ణవానికి సంబంధించినదేనని తరువాత నిరూపితమైంది.

## శ్రీనివాసుడు శివుడా ? :

శ్రీనివాసుడు శివుడిని, సుబ్రహ్మణ్యుడని. శక్తిస్వరూపి యని వివిధ కాలాల నుండి వాదోపవాదాలు సాగాయి. శ్రీనివాసుడు ఇతర మూర్తులను తనలో సమన్వయించుకొన్న విష్ణుమూర్తేనని ఆళ్వారులు, ఆచార్యులు చెప్పారు. 'ది తిరుమల టెంపుల్' అనే గ్రంథంలో డా॥ ఎన్. రమేశన్ ఈ విషయాలకు కూలంకుషంగా చర్చించి స్వామి వైష్ణవస్వామేనని స్థిరపరచారు. శ్రీనివాసుడు శివుడని చెప్పేవాళ్ళు చూపే ఆధారాలివి—

1. స్వామి శిరస్సుపై 20 అంగుళాల పొడవైన కిరీటముంది. కిరీటానికి రెండు వైపుల స్వామి జటాజూటం వంకరలు తిరిగి భుజాల వరకు వేలాడుతూ కనిపిస్తుంది.
2. స్వామి చేతులకు, నడుముకు నాగాభరణాలున్నాయి.
3. అర్చన సమయాల్లో బిల్వపత్రాలను వాడడం ఇప్పటికీ ఉంది.
4. స్వామి శిరస్సు పైన అర్ధచంద్రుడు కనిపిస్తాడు.
5. స్వామి గర్భగుడిలో గోడకానుకొని కాకుండా మధ్యలో కొలువై ఉన్నాడు.
6. దేవాలయంలో ఒక స్ఫటిక శివలింగ ముండేది. తదనుగుణంగా పూజ జరిగేది. తరువాత ఎప్పుడో రామానుజులు వైష్ణవం ప్రకారం పూజా విధానం ఏర్పాటుచేశాడు.

ఈ విషయాలన్నీ ఆధారరహితాలు. స్వామి శిరస్సుపై కిరీటముంది. జటాజూటం లేదు. అర్ధచంద్రుడు కిరీటంపై అలంకారప్రాయంగా కనిపిస్తాడే కాని శివుని జటాజూటంలో కనిపించే చంద్రునివలె కనిపించడు. స్వామి చేతులకు నడుముకు నాగాభరణాలున్నది వాస్తవమే. ఆదిశేషుని శరీరంతో నిర్మితమైన పానుపుపైన స్వామి పవ్వళిస్తాడు కాబట్టి పాముతో సంబంధముంది. సర్పం స్వామి సాన్నిధ్యంలో ఎల్లప్పుడూ ఉండే నిత్యులలో ఒకటి. ప్రతిరోజు స్వామి సన్నిధిలో పఠించే మంత్రపుష్పం ఈ విషయాన్ని స్పష్టీకరిస్తుంది. ఆలయంలో స్ఫటికలింగంలేదు. ఎప్పుడో విద్యారణ్యులవారు స్వామి ఆలయంలో స్ఫటిక లింగ మున్నట్లు చెప్పారట. విద్యారణ్య స్వామి క్రీ.శ. 14-వ శతాబ్దానికి చెందినవాడు,

అప్పటికి ఆరువందల సంవత్సరాల నుండి వేయబడిన ఏ శాసనమూ ఈ విషయాన్ని పేర్కొనలేదు. ఈ కారణాలవల్ల స్వామిని కొందరు తెలియనివారు శివుడన్నారే కాని ఆయన ప్రాచీనకాలం నుండి విష్ణువేనని నిర్ణయించవలసివుంది.

## శ్రీనివాసుని విగ్రహం శక్తి విగ్రహమా ? :

కొందరు శ్రీనివాసాలయాన్ని శక్తి దేవాలయమన్నారు. ఉత్తరప్రాంతం నుండి వచ్చే భక్తులు ఈ దేవాలయాన్ని బాలాజీ దేవాలయమని, స్వామిని 'బాలాజి' అని పిలుస్తున్నారు. 'బాల' దుర్గకు మరొక రూపం. స్వామికి మెడిమల వరకు జీరాడే వస్త్రం రెండు వైపులా కనిపిస్తుంది. ఈ వస్త్రం దుర్గాదేవికి అలంకరించిన చీరగా చెప్పవచ్చు. పూజా సమయాల్లో గంధం ఉపయోగించడంవల్ల, అభిషేక సమయాల్లో పసుపు ఉపయోగించడంవల్ల, మూల విగ్రహానికి శుక్రవారమే అభిషేకం చేయడంవల్ల స్వామిని స్త్రీ దేవతగా చెప్పవచ్చు. దేవీ భాగవతం స్వామిని కలియుగ ఏకైక దేవత వేంకటేశ్వరిగా కీర్తించింది. ఇవన్నీ కారణాభాసాలే.

ఉత్తర ప్రాంతపు భక్తులు స్వామిని 'బాలాజి' అని పిలవడం క్రీ.శ. 17వ శతాబ్ది తరువాతనే. అంతకుముందు సాహిత్యంలోగాని, శాసనాలలోగాని ఈ పేరు ప్రస్తావింపబడలేదు. శివాజి కాలం నుండి ఉత్తర భారతదేశం నుండి భక్తులు తిరుమలక్షేత్ర దర్శనానికి రావడం ప్రారంభమైంది. ఈ కారణం ఆధారంగా స్వామిని బాలాజీ అని పిలవడానికి వీలుగాదు. లలిత సహస్రనామావళిలో 'బాలా' అనేది 965వ నామంగా ఉంది. "బాలాకుమారీ. 'త్వం కుమార ఉతవా కుమారీ, ఇతి శ్రుతేః. త్రిపురా సిద్ధాంతేఽపి బాల లీలా విశిష్ట త్వాత్ బాలేతి కథితా ప్రియే" అని వ్యాఖ్యానం.[17] శ్రుతిలో 'నీవు కుమారుడువు లేక కుమారివి' అని ఉంది. పరతత్త్వానికి స్త్రీ పుం భావం లేదు. శక్తి శబ్దం స్త్రీ లింగం కాబట్టి పరబ్రహ్మ స్వరూపిణియైన పరాశక్తి త్రిపుర సుందరిగా ధ్యానింపబడుతున్నది. "నైన స్త్రీసపుమానేషనైన చాయం నపుంసకః యత్యశ్ఛరీర మాదత్తే తేనతేన సయుజ్యతే" అన్నదీ సందర్భంలో గమనింపదగిన అంశం. లలితా సహస్రా నామావళి బ్రహ్మాండ పురాణ ఉత్తర కాండలో వుంది.

శక్త్యారాధన చాల ప్రాచీనమైంది. శ్రీ సూక్తం, దుర్గా సూక్తం వేదము లోనివే. త్రిసంధ్యలలో ఉపాసింపబడే గాయత్రి సూర్యమండల మధ్యస్థయైన దేవీమూర్తి. ఆమెవల్ల సూర్యునికి వెలుగు వస్తున్నది. సంధ్యావందనం శక్త్యారాధనే. అజ్ఞాతవాసం వెళ్ళేటప్పుడు మత్స్యదేశం చేరడానికి ముందు ధర్మరాజు దుర్గాస్తుతి చేశాడు.[18] కురుక్షేత్ర యుద్ధారంభంలో శ్రీకృష్ణుని ఆదేశంలో దుర్గను స్తుతించాడు.[19] శక్త్యారాధనకు ఇంత ప్రాశస్త్యమున్నపుడు నిజంగా శ్రీనివాసుడు శక్తిస్వరూపిణి అయినట్లయితే ప్రాచీనకాలం నుండి ఈ యభిప్రాయం ఉండాలికదా! కాని అలా లేదు.

శ్రీమన్నారాయణునికి గల దశావతారాలలో శ్రీ కృష్ణావతారం పూర్ణావతారం. గర్గ సంహితలో కృష్ణశబ్దం ఇలా వ్యాఖ్యానించబడింది.

"కకారః కమలాకాంతః ఋకారో రామ ఇత్యపి
షకారః షడ్గుణపతిః శ్వేతద్వీప నివాసకృత్
ణకారో నారసింహోఽయం అకారోఽక్షరోఽగ్నిభుక్
విసర్గాచ తథాహ్యేతౌ నరనారాయణావృషీ
సంప్రలీనాశ్చ షట్పూర్ణాః యస్మిన్ శబ్దే మహాత్మని
పరిపూర్ణతమో సాక్షాత్తేన కృష్ణః కీర్తితః,"

శ్రీమద్భాగవతంలో బాలకృష్ణ శబ్దానికి ఎంతో ప్రాధాన్యముంది. శ్రీకృష్ణుడు చెఱసాలలో తండ్రియైన వసుదేవుడికి సాక్షాత్కరించిన సందర్భంలో భాగవతం 'తమద్భుతం బాలకమంబుజే క్షణం....' అనే శ్లోకముంది. ఇందులోని 'బాల'కు బాలకృష్ణుడని అర్థం. స్వామికి గల 'బాలాజి' అనే నామం బాలకృష్ణుడులోని 'బాల' ననుసరించి ఏర్పడి వుంటుంది. తెలుగు భాగవతం కూడా శ్రీకృష్ణుని బాలకుడని, బాలుడని ఎన్నోసార్లు పేర్కొన్నది. గోవర్ధన పర్వతాన్ని గొడుగుగా పైకెత్తి పట్టిన గోపాలకృష్ణుడు గోప గోపీ జనులను భయపడవద్దని చెప్పే సందర్భంలో—

"బాలుండీతడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపగా
జాలండోయని దీని క్రింద నిలువన్ శంకింపగా బోలదు"

అనే పద్యం వుంది."[9] ఈ విద్దూరం చూచి అందరూ 'ఏడేండ్ల బాలుడెక్కడ క్రీడం గరి తమ్మియెత్త క్రియ ..' అనుకున్నారట. బలరామకృష్ణులు కంసుని చూడడానికి మధురకు వెళ్ళిన సందర్భంలో చాకలివానిని మంచి ఉడుపులు ఇవ్వమని కోరినపుడు కంసుని గుడ్డలు ఉతికే రజకుడు 'కట్టా ప్రాణము గోలుపోయెద సుమీ కంసోద్ధతిన్ బాలకా' అని భయపెట్టినాడు. ఇలా ఎన్నోసార్లు శ్రీకృష్ణునికి 'బాలక' అనే పదం వాడబడింది. కృష్ణావతార ఘట్టాలతో ఈ దేవాలయానికి ఎంతో సంబంధముంది. అన్నమయ్య సంకీర్తనలలో బాలకృష్ణుని ప్రస్తావించినవి ఎన్నో వున్నాయి. తిరుమలలో ఉట్ల ఉత్సవం ఇప్పటికీ జరుగుతున్నది. ఈ కారణాలను బట్టి స్వామికి గల 'బాలాజి' అనే నామం బాలకృష్ణుడనే అర్థంలోనే సార్థకమై వుంటుంది.

మోడిమల వరకు వస్త్రమున్నంత మాత్రాన స్వామిని స్త్రీ దేవత అనడానికి వీలుగాదు. పర్వదిన సందర్భాలలో పాదాలు తగిలేటట్లు వస్త్రం ధరించిన పురుషుని స్త్రీయనడానికి వీలుపడదు కదా! ఇలా పాదాల వరకు జీరాడే వస్త్రాన్ని తమిళంలో 'ఉల్చాత్తు' అంటారు. శాసనాలను పరిశీలిస్తే ఈ ఉల్చాత్తు ఇటీవలి కాలంతో అలంకరింపబడినదిగా తెలుస్తుంది. క్రీ. శ. 15వ శతాబ్ది నుండి స్వామికి గంధం సమర్పింపబడినట్లు శాసనాధారాలున్నాయి. స్వామి అలంకార ప్రియుడు కాబట్టి గంధం అవసరమే. పూర్వకాలం నుండి శ్రీ గంధం స్త్రీ పురుష లిరువురూ వాడే వారు. ప్రతి శుక్రవారం స్వామికి జరిపే పవిత్ర స్నానానికి పసుపు వాడుతూ ఉండినట్లు సాక్ష్యాలు లేవు. అయితే స్నానానికి ఉపయోగించే నీళ్ళలో కలిపే ఇతర ద్రవ్యాలలో పసుపు కూడా ఒక ద్రవ్యం. వైష్ణవ దేవాలయాలన్నిటిలో స్నపన తిరుమంజన సమయాల్లో పసుపును ఒక ద్రవ్యంగా వాడడం వుంది. దేవీ భాగతం పేర్కొన్న శ్రీ వేంకటేశ్వరి శ్రీనివాసుని భార్యయైన శ్రీ మహాలక్ష్మి దేవియే. త్రిమూర్తుల శరీరాలలో వారి భార్యల స్థానాలను గుర్తిస్తే ఈ మాటలోని ఔచిత్యం అర్థమవుతుంది. వాగీశ్వరి బ్రహ్మ భార్య. ఆమె సరస్వతి. బ్రహ్మ నోటిలోనే వుంటుంది. హృదయేశ్వరి విష్ణువు భార్య. ఆమె లక్ష్మి. విష్ణువు హృదయం మీద కనిపిస్తూ వుంటుంది. అర్ధనారీశ్వరి శంకరుని ఇల్లాలు, ఆమె పార్వతి. శివుని అర్థ శరీరం ఆమెదే. ఇలాగే వేంకటేశ్వరి వేంకటేశ్వరుని భార్య. ఆమె మహాలక్ష్మి. శ్రీవాసుని వక్షస్థల విహారిణి. అందువల్ల వేంకటేశ్వరి శక్తి నామం కాదు. శ్రీమన్నారాయణుని ఇల్లాలే,

కొందరు స్వామిని కుమారస్వామి అన్నారు. వారు చూపించే సాక్ష్యం స్వామి పుష్కరిణి. కుమారస్వామి దేవాలయాలకు అనుబంధంగా వున్న కోనేర్లన్నిటికి పుష్కరిణి అనే పేర్లు లేవు. పైగా స్వామి చతుర్భుజుడు. కుమారస్వామి షణ్ముఖుడు. స్వామి సర్వాంతర్యామి. సృష్టిలోని ప్రతి అంశా స్వామిలో కనిపిస్తుంది. దేవతలందరూ స్వామిలో కనిపిస్తారు. ఈ విషయాలను సమన్వయిస్తూ రమేశన్‌గారు ఇలా నిర్ధారించారు.

"It must be made clear here that the external manifestation of the Lord at Tirumala is only that of Lord Vishnu, but he being a Sarvabhūtāntarātma, can be worshipped and is being worshipped as Siva by Saivites, as Skanda by those who worship Subrahmanya Swami, as divine Mother by those who worship Devi or Sakti. The Lord of Tirumala is not a mere sectarian God, though the outward from is undoubtedly that of Lord Vishnu only. He is Vishnu, Siva, Rudra, Brahma, Mahēswari, Mahakāḷi, Mahā Lakshmi, Maha Saraswati, Skanda or any other form to any devotee who conceives of the Lord in that aspeet. All the upachāras or the services rendered to this idol are in effect rendered to the eternal Lord. This is the real secret of the Lord of Seven Hills. (2)

**అన్నమయ్య ఆలోచనలు :**

అన్నమయ్య శ్రీనివాసుని ఆకార విశిష్టుడుగాను, ఆకార రహితమైన పరమాత్మగాను కూడా స్తుతించాడు. స్థూలంగా అద్వైతులు నిరాకార నిర్గుణ తత్త్వాన్ని, విశిష్టాద్వైతులు సగుణ సాకార తత్త్వాన్ని ప్రతిపాదించారు. అన్నమయ్య ముందు స్మార్తుడు. తరువాత వైష్ణవ దీక్ష తీసుకొన్న విశిష్టాద్వైతి.

"తాపః పుండ్రః తథా నామ మంత్రో యాగశ్చ పంచమః
అమీ పరమ సంస్కారా పారమైకాంత్య హేతవః"

అనే శ్లోకాన్ని బట్టి వైష్ణవమత దీక్ష తీసుకొనేవారు. పంచ సంస్కారాలను పొందాలి. అన్నమయ్య పంచ సంస్కారాలను విష్ణునామక యతిద్వారా పొందినట్లు చిన్నన్న చెప్పాడు. విశిష్టాద్వైతంలో ఈ పంచ సంస్కారాలతో పాటు శరణాగతి, ప్రపత్తులు కూడా ముఖ్యమైనవి. 'అన్యథా శరణం నాస్తి-త్వమేవ శరణం మమ' అనే నమ్మకంతో స్వామిని ఆశ్రయించడం శరణాగతి. జీవుడు స్వామికి తన సర్వస్వాన్ని సమర్పించుకోవడం ప్రపత్తి. అన్నమయ్య వైష్ణవాన్ని ప్రబోధించిన ఆళ్వారుల, ఆచార్యుల రచనలన్నిటిని ఆపోశనం పట్టినవాడు. రామానుజుల శ్రీ భాష్య గీతా భాష్యాల ప్రభావం ఈయనపై కంఠదఘ్నంగా ఉన్నట్లు ఎన్నో సంకీర్తనలు చాటుతాయి. అయినా జన్మతః సిద్ధించినది అద్వైతం, మధ్యలో వచ్చింది విశిష్టాద్వైతం కాబట్టి అన్నమయ్య స్వామినెలా భావించాడో కింది పాట చూస్తే తెలుస్తుంది.

పురుషుండని శ్రుతి వొగడీనట – ఆ పురుషుడు నిరాకారమట
నిరసవాక్యము లొండొంటికి నివి వింటే నసంబద్ధములు ॥పల్లవి॥

మొగమున బ్రాహ్మలు మొలిచిరట – ఆ మూరితి అవయవ రహితుడట
తగు బాహులను రాజులట – ఆ తత్త్వమే యెంచగ శూన్యమట
పగటున తొడలను వైశ్యులట – ఆ బ్రహ్మము దేహము బయలట
అగపడి పాదాల శూద్రులట – ఆతని రూపము లేదట...."[22]

ఈ పాటలో అన్నమయ్య స్వామి సాకార నిరాకార తత్త్వాలను స్తుతించాడు. ఇది ఒక రకమైన పద్ధతి. గౌరిపెద్దిరామసుబ్బశర్మ గారు ఈ విషయాన్ని గురించి "పరతత్త్వ విషయంలో అద్వైత విశిష్టాద్వైతములకు ఏమంత పెద్ద భేదము కాన రాదు. కాని ఈయనిది మధ్యవైష్ణవము గదా! కావున కొన్ని పాటలయందు సాక్షాత్తుగ అద్వైతమునే ఖండన చేసినట్టుల కానవచ్చు చున్నది," అన్నారు,[23] అన్నమయ్య కుమారుడు పెదతిరుమలాచార్యులు కూడా స్వామిని పరతత్త్వంగా భావించి సర్వజగత్తూ స్వామి నుండే ఉద్భవించిందని చెప్పాడు. అన్నమయ్య పాట సందేహాలను కలిగించేదిగాను, సందేహాలను తొలిగించేదిగాను వున్నా ఆయన ఉద్దేశించింది సాకారమూర్తినేనని నిస్సంశయంగా చెప్పవచ్చు. పెదతిరుమ లయ్య అభిప్రాయం కింది పద్యంలో కనిపిస్తుంది,

శ్రీదేవి యురమున శిరసునఁ దులసి
భూకాంత వీఁపునఁ బదాగ్రమున గంగ
కమలాసనుఁడు నాభి గాముండు మనసున
సవ్య వామాక్షుల శశియు రవియు
ధ్వజమున గరుడుండు తపసులు కాంతుల
సకల వాయువులు నాసా పుటముల
జగములు కుక్షిని జలధులు తరులందు
ఘన రోమముల దేవగణము లెల్లఁ

గలిగి శోభిల్లు నీ మూర్తి దలఁచి నీకు
సేవ శతకంబు చెప్పెదఁ జిత్తగించు
కలిత లక్ష్మీశ సర్వజగన్నివేశ
విమల రవి కోటి సంకాశ వేంకటేశ." [4]

ఈ పద్యంలో పెదతిరుమలయ్య స్వామి విరాడ్రూపాన్ని, అందులో ప్రతిఫలించే వివిధ దేవతలను మన కండ్లముందు పెట్టినాడు.

ఈ నేపథ్యంతో అన్నమయ్య పాటను వ్యాఖ్యానించాలి. అన్నమయ్య నాటికి స్వామిని వివిధ రూపాలతో ప్రస్తుతించే పద్ధతి వుంది. ఈ పద్ధతి కొంత మందిలో ఉండినా మరికొందరిలో స్వామి శ్రీ మహావిష్ణువే నన్న అభిప్రాయం కూడా ఉంది. భువనసుందరుడైన స్వామిలో సర్వప్రకృతీ ఉంది. దేవతలందరూ వున్నారు. దీనిని మరొక రకంగా చెప్పాలంటే స్వామి సృష్టి అంతటా వ్యాపించి సర్వప్రాణులకే గాక దేవతలందరికీ చైతన్యమై ప్రకాశిస్తున్నాడని చెప్పవలసి వుంటుంది. విశిష్టాద్వైతం విశ్వసించే సిద్ధాంతమిదే. ఈ సిద్ధాంతం అన్నమయ్య రచనలలో అంతస్సూత్రంగా వుంటుంది. ఆయన పాటలో కనిపించే శివాదులు స్వామిలో లయించిన అంశలే గాని వేరువేరు తత్త్వాలు కారు. స్వామిని శివుడని, శక్తియని భావించే తనకాలపు ప్రజల అభిప్రాయాలను అన్నమయ్య తనపాటలో చూపించాడు. అన్నమయ్య దృష్టిలో శ్రీ వేంకటేశ్వరుడు శ్రీ మహావిష్ణువే. అలివేలుమంగమ్మ శ్రీ మహాలక్ష్మియే. స్వామి మూర్తి సృష్టియంతటా ప్రపంచమై వున్నదనే అన్నమయ్య విశ్వాసం. అందువల్ల ఎంతో ప్రాచీనకాలం

నుండి ఉన్న తిరువేంగడం వైష్ణవ క్షేత్రమే. అక్కడ వెలసిన శ్రీనివాసుడు శ్రీమన్నారాయణుడే.

## సూ చి క లు

1. భర్తృహరి గొప్ప సంస్కృతకవి. ఇతడు సుభాషిత త్రిశతిని రచించాడు. ప్రారంభంలో ప్రార్థనా శ్లోకంగా—

దిక్కాలాద్య నవ చ్ఛిన్నానంత చిన్మాత్ర మూర్తయే
స్వానుభూత్యేక మానాయ నమః శాంతాయ తేజసే

అనే శ్లోకాన్ని రచించాడు. ఈ శ్లోకం ఈ కవికి గల వేదాంత తత్పరతను చూపుతున్నది.

2 Subrahmanya Sastri, Sadhu. 'Tirumala Sri Venkateswara' Tirupati, 1981, pp 336—342.

3 Govt of Madras, Public Dept. G.O. & C Nos. 678, 679. 12th August, 1904. దీనిని 1904వ సంవత్సరానికి చెందిన వార్షిక శాసన నివేదికగా భావించవచ్చు.

4 శ్రీ వేంకటాచల ఇతిహాసమాల సంస్కృత వచనంలో శ్రీ అనంతాచార్యచే రచింపబడింది. ఇతడు రామానుజుల శిష్యుడుగా చెప్పబడుతున్నాడు. 'తిరుమలై అనంతాళ్వాన్' పేరుతో ప్రసిద్ధి కెక్కినాడు. ఇది సుమారు 900 సంవత్సరాల నాటి గ్రంథం. ఇందులో ఏడు విభాగాలున్నాయి. ప్రతి విభాగానికి స్తబకమని పేరు. వేంకటాచలానికి, శ్రీ వేంకటేశ్వరునికి సంబంధించిన పురాణాంతర్గత విషయాల నెన్నిటినో ఈ గ్రంథం వివరిస్తుంది. వైష్ణవులు దీనినొక చారిత్రక గ్రంథంగా భావిస్తారు.

5. తి.తి.దే. తిరుపతివారు 1993లో ప్రచురించిన శ్రీ వేంకటేశ్వరస్వామి ఆళ్వారుల మంగళా శాసనం నుండి, పుట 44. 63వ పాశురం.

6. Nilakantha Sastri & Srinivasachari. 'Advanced History of India, Second Reprint, 1982, p. 305.

7. అదే. పు. 306.

8. Varadachari, K. C. 'Alwars of South India', Bombay, 1973. Introduction, p. IX.

9. అదే. పు. 21.

10. శ్రీ వేంకటేశ్వరస్వామి ఆళ్వారుల మంగళాశాసనం నుండి పుట. 34, 39వ పాశురం.

11. Snbrahmanya Sastri, Sadhu, op. cit, P. 122.

12. సంస్కృత వచనంలో ఉన్న 'శ్రీ వేంకటాచల ఇతిహాసమాల'ను ప్రొఫెసర్ వి.వి. రామానుజమ్ తి.తి.దే వారి పత్రిక సప్తగిరిలో 1986 జూలై నెల నుండి ప్రతి నెలా 'సీరియల్'గా ప్రచురించారు. ఈ ఆంగ్ల వాక్యాలు 1986 జూలై నెలలో ప్రచురింపబడిన భాగం నుండి గ్రహింపబడినాయి.

13. అదే.

14. వరాహ పురాణం. మొదటి భాగం. మూడవ అధ్యాయం, 27. 28 శ్లోకాలు.

15. Subrahmanya Sastry, Sadhu, op. cit. P. 81.

16. 'The Tirumala Temple' అనే గ్రంథం 1981లో తి.తి.దే వారిచేత ప్రచురింపబడింది. అప్పటివరకు తిరుమల దేవాలయానికి సంబంధించి వెలువడిన ప్రచురణల నన్నిటిని పరిశీలించి డా॥ రమేశన్ ఈ గ్రంథాన్ని రచించారు. ఇది తిరుమల దేవాలయానికి చెందిన సమస్త విషయాలను విపులంగా తెలిపే విజ్ఞాన సర్వస్వం. శ్రీనివాసుని వివిధ దైవాంశలను గురించి రాయడానికి ఈ గ్రంథం నాకెంతగానో ఉపకరించింది.

17. 'లలితా సహస్ర నామావళి'కి భాస్కరరాయని సౌభాగ్య భాస్కరమనే భాష్యం వుంది, ఇది క్రీ. శ. 17వ శతాబ్దిలో రచింపబడింది.

18. 'అస్తువన్మన సాలదేవీం దుర్గాం త్రిభువనేశ్వరీం'. విరాటపర్వం 8-1-26

19. 'నమస్తే సిద్ధ సేనానీ, ఆర్యేమందార వాసినీ' భీష్మపర్వం 23-4-13

20. పోతన భాగవతం. తెలుగు సాహిత్య అకాడమీ ప్రతి. దశమస్కంధం, 920వ పద్యం.

21. Ramesan, N. 'The Tirumala Temple', 1981, P. 121.

22. రామసుబ్బశర్మ, గౌరిపెద్ది(సం)ఆధ్యాత్మ సంకీర్తనలు. సం. I/-. సం. 252

23. అదే. పీఠిక. పుట 32.

24. పెదతిరుమలయ్య రచించిన నీతి సీస పద్యాల శతకంలో మొదటి పద్యం.

# 4. సంకీర్తన భండారం
## (తాళ్ళపాక ఆర్ర)

బౌద్ధం మనకెన్నో విషయాలను నేర్పింది, హిందూ (వైదిక) దేవాలయాల నిర్మాణానికి, దారు శిలాలోహాది విగ్రహాలను ప్రతిష్ఠించి పూజించడానికి బౌద్ధ స్తూపాలు, నిలువెత్తు బౌద్ధ విగ్రహాల ఆరాధన ఆధారాలు. బౌద్ధ స్థూపాలు బౌద్ధ మత కార్యకలాపాలకు కేంద్రాలు. బౌద్ధమత సిద్ధాంతాల చర్చ, బౌద్ధ భిక్షువులకు శిక్షణ ఇవ్వడం. ప్రాకృత భాషలో వెలువడిన బౌద్ధ గ్రంథాల ప్రదర్శన-పరిరక్షణ ఈ కార్యకలాపాలలో భాగాలు. మనదేశంలో మొట్టమొదట వ్రాత పద్ధతిని ప్రవేశ పెట్టింది కూడా బౌద్ధమేనని చారిత్రకుల అభిప్రాయం. ముఖ్యంగా బుద్ధుని నిర్యాణం తరువాత బౌద్ధమత సిద్ధాంతాలను తాళపత్రాలపై రాయించడం సంప్ర దాయంగా మారింది. ప్రముఖ శాసన శాస్త్రవేత్త డి. సి. సర్కార్ ఇలా అంటున్నారు.

"According to Buddhist tradition, the canon was written on Palmyra leaves immediately after the Buddha's death "[1]

ఇది నిజమైనప్పటికి బౌద్ధం పెరిగి పెద్దదయింది ఉత్తర భారతదేశంలో కాబట్టి అక్కడ తాళపత్రాలు లభించేవా అన్న విషయం పరిశీలించవలసి వుంది. ఉత్తర భారతదేశంలో భూర్జపత్రాల మీద, దక్షిణ భారతదేశంలో తాళపత్రాల మీద క్రీ. శ. రెండు మూడు శతాబ్దాల నుండి రాసే అలవాటు వుండినట్లు పండితు లందరూ అంగీకరించిన మాట. అయినా అక్కడ తాళపత్రాలు దొరకవని చెప్ప డానికి కూడా ఆధారాలంతగా కనిపించవు.

ఉత్తర భారతదేశంలో భూర్జ పత్రాలపై రచింపబడిన గ్రంథాలు క్రీ. శ. రెండు మూడు శతాబ్దాలకు చెందినవి అక్కడి బౌద్ధ స్థూపాలలో భద్రపరచబడి

ఉండేవి. వీటిలో ఇప్పటివరకు లభించినవి ప్రాకృతభాషలో ఖరోష్ఠి లిపిలో రచింపబడిన 'దమ్మపదం', క్రీ. శ. 4వ శతాబ్దిలో సంస్కృతంలో రచింపబడిన బౌద్ధ గ్రంథం 'సంయుక్తాగమ సూత్రాలు' మొదలైనవి.[2] బౌద్ధ స్థూపాలు బౌద్ధ దేవాలయాలే. బౌద్ధ మతానికి చెందిన ప్రాకృత సాహిత్యం ఈ స్థూపాలలో భద్రపరచబడేది. దీనిని బట్టి దేవాలయాలలో మతపరమైన సాహిత్యాన్ని భద్రపరచడం భారతదేశంలో చాల ప్రాచీనకాలం నుండి వస్తున్న ఆచారంగా కనిపిస్తుంది.

వైదిక దేవతలకు చెందిన దేవాలయాలు దక్షిణ భారతదేశంలో సుమారు క్రీ. శ. ఒకటో శతాబ్ది నుండి, ఉత్తర భారతదేశంలో సుమారు ఇంకొంచం తరువాత నిర్మింపబడడం ప్రారంభమైంది. గుడిమల్లం (చిత్తూరు జిల్లా, ఆంధ్ర ప్రదేశ్)లోని పరశురామేశ్వరాలయం దక్షిణ భారతదేశంలోని తొలి శివాలయమని, శాతవాహనరాజుల కాలానికి చెందినదని చారిత్రకుల అంచనా. అప్పటినుండి గుహాలయాలు, తరువాత తరువాత ఇటుకలతో నిర్మింపబడిన దేవాలయాలు కనిపించాయి ఈ దేవాలయాలలో స్తంభాల మీద గోడల మీద శిల్పాలు సజీవములుగా భ్రమింపజేసే అద్భుత శిల్పాలను మలచారు. ఈ శిల్పాలు కవులను, కళాకారులను స్పందింపజేశాయి. నాట్యకత్తెల పాదమంజీరాల నుండి సరిగమలను పలికించాయి. దేవతల అంగరంగభోగాలకు కావలసిన గాయకులు, వాద్యగాంధ్రు, నట్టువులు, నాట్యకత్తెలు ఆలయ పరివారంలో చేరారు. దేవాలయాలలో రంగ మంటపాలు, నృత్య మంటపాలు వెలిశాయి. రాజులేగాక సామాన్యులు సైతం దేవాలయాలను పోషించారు. పూజలతో సంగీత నాట్యాలతో ఆలయప్రాంగణాలు ప్రతిధ్వనించి పోయాయి. ఈ ఉత్సవ సంరంభంతో పులకించిన భక్తులే కొందరు కవులైనారు. దేవాలయాలలో భక్తి కావ్యాలు పురుడు పోసుకొన్నాయి. సంగీత నాట్యశాస్త్ర గ్రంథాలు ఎన్నో దేవాలయ ప్రాంగణాలలో ఆవిర్భవించాయి. కాకతీయుల కాలంలో నిర్మింపబడిన రామప్ప దేవాలయంలోని నృత్య భంగిమలను వెలార్చే శిల్పాలకు జాయపసేనాని విరచిత నృత్య రత్నావళితో గల సంబంధం తెలిసినదే. సంగీత నృత్యాది లలిత కళలకు దేవాలయాలకు సంబంధముండినట్లు మధ్యయుగం నాటి శాసనాల ద్వారా, సాహిత్యం ద్వారా వెల్లడవుతుంది.

ప్రాపంచిక వాసనలకు దూరంగా దేవాలయాలలోనే వుంటూ దేవుని గుణ రూపాదులను స్తుతిస్తూ జీవించినవారు చరిత్రలో ఎందరో వున్నారు. వీరు రచించిన

స్తోత్ర సాహిత్యమంతా వారి ఉపాస్యదైవాలకే అంకితమయ్యేది. ఇలాంటి సాహిత్య గ్రంథాలు ఆ యా దేవాలయాలలోనే భద్రపరచబడేవి. ఈనాటికీ కొందరు భక్తులు 'రామకోటి' రాసిన కాగితపు ప్రతులను వైష్ణవ దేవాలయాలలో భద్రపరచడం కనిపిస్తుంది. ఒంటిమిట్ట (సిద్ధవటం తాలూకా కడప జిల్లా ఆంధ్రప్రదేశ్) లోని శ్రీ కోదండరామస్వామి ఆలయంలో వావిలికొలను సుబ్బారావు (ఆంధ్ర వాల్మీకి) రచించిన రామకోటి కాగితపు ప్రతులు మొన్న మొన్నటి వరకు ఉండేవి. ఇది ఈ వ్యాసకర్త ప్రత్యక్షంగా చూచిన విషయం.

దేవాలయాలలో భద్రపరచబడిన స్తుతి సాహిత్యంలో ఇప్పటివరకు దొరికినవాటిలో 'సింహగిరి నరహరి వచనములు' మొదటిదిగా భావించవచ్చు. తాళపత్రాలపై లిఖించబడిన ఈ స్తుతి సాహిత్యం చాలకాలం నిలవదని ఆ భక్త కవులకు తెలుసు. అయినా మరొక రచనా మాధ్యమం వారికి తోచలేదు. అదృష్టం కొద్దీ అలాంటి తాళపత్ర గ్రంథాలకు అనేకులు ఎత్తి రాసివుండడంచేత కొన్నైనా దొరికాయి. తాళపత్రం సహజంగా పెళుసు. దానికి తోడు దక్షిణభారతదేశంలో ఎండలు ఎక్కువ. వేడికి తాళపత్రం త్వరగా శిథిలమవుతుంది. ఈ విషయం గమనించి తాళపాక కవులు మాత్రం తమ సంకీర్తనా వాఙ్మయాన్ని రాగిరేకులపై చెక్కించి అజరామరం చేశారు. భారతదేశంలో సాహిత్యాన్ని రాగిరేకులపై చెక్కించి భద్రపరచడం మరెక్కడా కనపడదు.

## రాగిరేకులపై సాహిత్యం :

రాగిరేకులపై శాసనాలను చెక్కించడం క్రీ.శ. 4 వ శతాబ్ది నుండి కనిపిస్తున్నది. ఇప్పటివరకు దొరికిన తామ్రశాసనాలలో పల్లవరాజైన శివస్కంధవర్మ వేయించిన మైదవోలు (గుంటూరు జిల్లా) హిరహడగళ్ళి (బళ్లారి జిల్లా, కర్ణాటక) తామ్రశాసనాలు ప్రాచీనాలుగా కనిపిస్తాయి. ఇవి క్రీ.శ. 4వ శతాబ్ది మధ్య ప్రాంతానికి చెందినవి. ఉత్తర భారతదేశంలో గుప్తుల రాజైన కుమారగుప్తుని కాలంలో వేయబడిన 'ధనాయ్‌దహా' (రాజషాహి జిల్లా, ఉత్తర బెంగాల్) తామ్రశాసనం (క్రీ.శ. 433) మొదటిది[8]. తరువాత ఎన్నో తామ్ర శాసనాలు వెలువడినాయి. అయితే సాహిత్యం రాగిరేకుల కెక్కడం ఆశ్చర్యాన్ని కలిగించే విషయం. మన దేశంలో రాగిరేకులమీద సాహిత్యాన్ని చెక్కించే అలవాటు కూడా ప్రాచీనకాలం

నుండి వున్నట్లు తెలుస్తున్నది. కనిష్కుడు కొన్ని బౌద్ధమత గ్రంథాలను రాగి రేకుల మీద రాయించినట్లు హూయాన్‌త్సాంగ్ రాసినట్లు డి.సి. సర్కార్ పేర్కొన్నాడు.[4] ఇలాగే కావ్యాలను శిలలపై చెక్కించే సంప్రదాయం కూడా వుండేది. కాంచీపురంలోని కచ్ఛపేశ్వరాలయంలో ఒక శిలాస్తంభం మీద మయూరుని సూర్యశతకం అక్షరత్వాన్ని పొంది వుండడం సాహిత్యకులకు తెలుసు. కాకతీయుల కాలంలో నృసింహ విరచిత సిద్ధోద్వాహ కావ్యం ఒక శిలపై చెక్కబడి కనిపిస్తుంది.

తాళ్ళపాక కవులు రచించిన సంకీర్తన వాఙ్మయం రాగిరేకుల మీద చెక్కబడి తిరుమల శ్రీనివాసుని ఆలయంలో భద్రపరచబడింది. ఇలా తామ్రఫలకాలపై సాహిత్యాన్ని చెక్కించడం ఆంధ్రదేశంలో ఇదే మొదలు. తరువాత కాలంలో కూడా ఎవరూ తమ సాహిత్యాన్ని రాగిరేకులమీద చెక్కినట్లు కనపడదు. తాళ్ళపాకవారు తమ సంకీర్తన వాఙ్మయాన్ని రాగిరేకులమీద క్రీ.శ. 1525-30 సంవత్సరాల మధ్యకాలంలో చెక్కించి శ్రీవారి ఆలయంలోని బంగారు వాకిలికి సమీపంలో నిర్మించిన 'సంకీర్తన భండారం'లో భద్రపరచినట్లు వేటూరి ఆనంద మూర్తిగారు అభిప్రాయపడుతున్నారు.[5]

ఇలా భక్తి సాహిత్యాన్ని దేవాలయాలలోని ప్రత్యేక స్థలాలలో భద్రపరచి భావితరాల భక్తులకు, భక్తకవులకు అందించడం ప్రాచీన సంప్రదాయంగా తోస్తుంది. ఇప్పటికీ కొన్ని గృహాలలోని పూజాగదులలో దేవుళ్ళ పటాలముందు. విగ్రహాలముందు పసుపు కుంకుమలతో అలంకరించిన భగవద్గీతాది మత గ్రంథాలను వుంచి పూజించడం వుంది. దీనికి సంబంధించిన మరొక విషయాన్ని ఇక్కడ ప్రస్తావించడం అవసరం. ఇలాంటి భక్తి సాహిత్యాన్ని దేవునికి అంకితంగా రచించిన కవుల రాతి ప్రతిమలను కూడా దేవాలయాలలో ప్రతిష్ఠించడం కనిపిస్తుంది. భగవద్రామానుజుల కాలం నుండి ఈ పద్ధతి వుండినట్లు భావించవచ్చు. ఆయన రచించిన శ్రీ భాష్యం ప్రతులు ఆయన కాలంలోను తరువాత కాలంలోను ప్రఖ్యాత వైష్ణవ క్షేత్రాలలో భద్రపరచబడి వుంటాయి. ఆయా దేవాలయాలలో ప్రధాన దైవతములకు అభిముఖంగా ముకుళిత హస్తాలతో వున్న శ్రీ భాష్యకారుని విగ్రహాలు ప్రతిష్ఠింపబడి వుండడం ఇప్పటికీ కనిపించే సత్యం. ఈ విషయంగా కొంత ప్రాచీన దశకు వెళ్ళి పరిశీలిస్తే ఆసక్తికరమైన విషయాలు తెలుస్తాయి. పరమపదించిన వ్యక్తి బొమ్మను ఒక శిలపై చెక్కించి బొమ్మ కింద

శాసనం చెక్కించి మత ప్రాధాన్యతగల స్థలాలలో ప్రతిష్ఠించడం క్రీ. శ. 3వ శతాబ్దినుండి కనిపిస్తున్నది. క్రీ. శ. 3వ శతాబ్దిలో నాగార్జున కొండ ప్రాంతాన్ని పరిపాలించిన వీరపురుష దత్తుడు తన సవతితల్లి వమ్మభట్టారిక జ్ఞాపకార్థం ఒక శాసన కంభం నాటించాడు.[6] ఈ కంభంమీద ఆమె బొమ్మ చెక్కబడింది. బొమ్మ కింద దాని వివరాలను తెలిపే శాసనం బ్రాహ్మీ లిపిలో వుంది. ఈ శాసన కంభాన్ని ఛాయా కంభమని ఆ శాసనం పేర్కొన్నది. మధ్యయుగంలో దేవాలయాలలో దేవుని కెదురుగా నిలబడి చేతులలో వెలుగుతున్న దీపాలను పెట్టుకొని ఆరాధిస్తున్న నిధంగా ఉన్న శిల్పాలు కనిపిస్తాయి. ఇవి ఛాయా దీపాలని పిలవబడినాయి. తిరుమల ఆలయంలో గల దేవేరులతో కూడివున్న శ్రీకృష్ణదేవరాయల, అచ్యుతరాయుల విగ్రహాలు ఈ కోవకు చెందుతాయి. అయితే ఈ విగ్రహాలు ముకుళిత హస్తాలతో స్వామి కభిముఖంగా ఉన్నాయేగాని చేతులలో దీపాలు లేవు. ఇలాగే తాము రచించిన స్తోత్ర సాహిత్య గ్రంథాలను దేవాలయాలలో భద్రపరచిన భక్తకవుల విగ్రహాలు కూడా చెక్కబడి కనిపించడం ఒకఆరాధన విశేషం. శ్రీవారి ఆలయంలోగల తాళ్ళపాక అరకు ఇరువైపుల అన్నమయ్య పెదతిరుమలయ్యల శిల్పాలు కనిపిస్తున్నాయి.

### తాళ్ళపాక కవుల సంకీర్తనలు రాగిరేకుల కెక్కడం:

తాళ్ళపాక కవులు ఆంధ్ర దేశంలో సంకీర్తన సంప్రదాయానికి మూల పురుషులు. సంకీర్తన సుమాలతో తిరుమల వేంకటేశ్వరుని ఆరాధించిన ఆచార్యులు అన్నమాచార్యులు (1424–1503), పెద తిరుమలాచార్యులు (1458–1554), చిన తిరుమలాచార్యులు (1488–1562). శృంగార ఆధ్యాత్మికములను పేరుతో వీరు రచించిన కొన్ని వేల సంకీర్తనలు రాగిరేకుల మీద చెక్కబడినాయి. ఈ రాగి రేకులను వీరు శ్రీవారి ఆలయంలో ప్రత్యేకంగా నిర్మించిన అరలో భద్రపరచారు. ఈ అరకుగల ద్వారానికి ఇరువైపుల తాళ్ళపాక అన్నమాచార్యుల, ఆయన కుమారుడైన పెద తిరుమలాచార్యుల బొమ్మలు గోడలమీద చెక్కబడినాయి. ఈ అరను అన్నమయ్య భండారమని పేర్కొన్నాడు. ఇదే సంకీర్తన భండారం. ఈ రేకులపై తాళ్ళపాక కవుల ఇతర కృతులు కూడా చెక్కబడినాయి. చిన్నన్న ద్విపద కావ్యాలు మాత్రం రాగిరేకుల మీది కెక్కలేదు.

ఈ రాగిరేకులు నిడుదరేకులు, సాధారణ రేకులు, పెద్ద రేకులు అని మూడు రకాల పరిమాణాలలో కనిపిస్తున్నాయి. నిడుదరేకులు 33×2½ అంగుళాల కొలత గలవి. సాధారణ రేకులు సుమారు 15×7 అంగుళాల కొలత కలిగి వున్నాయి. పెద్దరేకుల కొలతలు 27×16 అంగుళాలు. వీటిలో తిరుమల ఆలయంతోని తాళ్ళపాక అరలో వుండినవన్నీ సాధారణ రేకులే. మిగిలిన రేకులు అహోబిలం, శ్రీరంగాలలో దొరికినవి. వైష్ణవ వాఙ్మయ ప్రచారార్థం వీటిని తాళ్ళపాక కవులే ఆయా క్షేత్రాలకు పంపి వుండవచ్చునని తాళ్ళపాక వాఙ్మయ పరిశోధకుల అభిప్రాయం.[8]

సంకీర్తన రచనకు ఆద్యుడైన అన్నమయ్య సంకీర్తన భండార వ్యవస్థకు కూడా ఆద్యుడై వుంటాడు. తాళ్ళపాకవారు రచించిన వాఙ్మయంలో ఒకే ఒకచోట భండారానికి సంబంధించిన అంశం కనిపిస్తుంది. అన్నమయ్య రచించిన—

"దాచుకో నీ పాదాలకుఁ దగనే జేసిన పూజలివి
పూఁచి నీ కీరితిరూప పుష్పములివి యయ్యా
ఒక్క సంకీర్తనే చాలు వొద్దికై మమ్ము రక్షించగ
తక్కినవి భండారాన దాఁచి వుండనీ"

అనే ఆధ్యాత్మ సంకీర్తనను బట్టి అన్నమయ్య కాలం నాటికే సంకీర్తన భండారం ఏర్పాటు చేయబడినట్లు తెలుస్తుంది. సంకీర్తనలను భండారంలో శాశ్వతంగా దాచి వుంచడం అన్నమయ్య ఉద్దేశం కాదు. ఆ సంకీర్తనలు ప్రతిరోజు దైవసన్నిధిలో పాడబడాలని, భక్తులు వినాలని, ఇతర వైష్ణవ దేవాలయాలలో కూడా వీటికి ప్రచారం జరగాలని ఆయన ఆశించాడు. ఆయన ఆశయాలను పెద తిరుమలాచార్యులు నెరవేర్చారు. ఒక్కొక్క సంకీర్తన ఒక్కొక్క పూజా కుసుమమని అన్నమయ్య భావించాడు. కొందరు పండితులు అన్నమయ్య నాటికి సంకీర్తనలు రాగిరేకుల మీదికి ఎక్కలేదని పెద తిరుమలాచార్యుల కాలంలో ఈ పని జరిగి వుంటుందని అభిప్రాయ పడుతున్నారు. వేటూరి ప్రభాకర శాస్త్రిగారి ఊహ ఇలా వుంది. "అన్నమాచార్యుని నాట సంకీర్తనములు తాటియాకుల మీద వ్రాసియుంచబడెనేమో! అతని తరువాత పెద తిరుమలాచార్యుడు వానిని రాగిరేకుల మీదఁ కెక్కించెను, ఈ ఊహ నిజమైతే అన్నమయ్య తాను రచించిన తాళపత్ర ప్రతులను భండారంలో భద్రపరచి వుండాలి. కొన్నాళ్ళకివి శైథిల్య స్థితిని

పొందగా చూచి ఆవేదనపడి తండ్రిగారి సంకీర్తనలు భాండాగారంలో శాశ్వతంగా ఉండాలనే తలంపుతో పెద తిరుమలాచార్యులు వాటిని రాగిరేకులపై చెక్కించడం ప్రారంభించినట్లు భావింపవలసి వుంది. ఏమైనా సంకీర్తన ప్రతులను భద్రపరచ డానికి ఒక భండారాన్ని ఏర్పాటు చేయాలన్న తలంపు అన్నమయ్యదే ననిపి స్తున్నది.

**భండారం - అర్థ వివరణ :**

భాండాగారానికి హ్రస్వరూపం భండారం. కోశాగారమని ఈ మాట కర్థం. భాండాగారానికి అధికారి భాండాగారాధ్యక్షుడు. ఇప్పటి భాషలో కోశాధికారి భాండా గారాధ్యక్షుడు, ఇప్పటి భాషలో కోశాధికారి (Treasury Officer) పన్ను రూపంలో ప్రజలనుండి వసూలు చేసిన ధనధాన్యాదులను కోశాగారంలో రాజు భద్రపరుస్తాడు. కోశాగారం రాజ్యానికి గుండెకాయ వంటిది. అందుకని రాజు సమర్థుడైన వానినే కోశాగారాధ్యక్షుడుగా నియమిస్తాడు. తాళ్ళపాక వారి సంకీర్తన భండారం కూడా ఒక రకంగా కోశాగారమే. ఇందులో ధన ధాన్యాదులకు మారు సంకీర్తనల తాళపత్రప్రతులు, రాగిరేకులు భద్రపరచబడినాయి. దీనిని ''Treasure House of Knowledge''గా చెప్పవచ్చు. సాహిత్య గ్రంథాలను బద్రపరచుకొనే గదిని అన్నమయ్య భండారమని ఎందుకు పేర్కొన్నాడన్నది విచారణీయం. సాధారణార్థంలో ఏ వస్తువునైనా భద్రపరచే గదిని భండారమని, కోశాగారమని పిలవడం వుంది. అన్నమయ్య కూడా భండారమనే మాటను సామాన్యార్థంలోనే వాడివుంటాడు.

భాండాగారం అనే మాటనుండి భండారం అనే మాట ఏర్పడినట్లు బండారు అనే మాటనుండి కూడా బండారం అనే మాట ఏర్పడి వుండవచ్చుననిపిస్తున్నది. తెలుగులో బండారు (బండ+అరు) అంటే రాతిపైన నూరి ఆరిపోవకముందే పూసుకొనే పసుపు అని అర్థం. 'వేపబండారు' అనే మాట రాయలసీమ ప్రాంతపు వ్యవహారంలో వుంది. లేతవేపాకులను బండపై నూరి మశూచికంవల్ల శరీరంపై ఏర్పడిన పుండ్లపై పూస్తారు. పసుపు, వేప - ఈ రెండూ క్రిమిసంహారక ద్రవ్యాలు. క్రిమిదష్టం కాకుండా వుండడానికి తాళపత్రాలపై పసుపు చల్లి కొంత ఆరిన తరువాత నిర్ణీత గదిలో భద్రపరచడంవల్ల ఈ గదికి భండారమని పేరేర్ప

డిందేమో. పెద తిరుమలాచార్యుల కాలంలో వాఙ్మయం రాగిరేకుల కెక్కించి కాబట్టి రాగిరేకులు త్రుప్పు పట్టకుండా వుండడానికి పసుపునీళ్ళు చల్లి కొంత ఆరిన తరువాత గదిలో నిక్షిప్తం చేసివుంటారని చెప్పడానికి వీలుంది. ఈ ఆలోచనలు కేవలం ఊహలైనప్పటికీ తెలుగు దేశంలో ముఖ్యంగా రాయలసీమలో ఇలాంటి అలవాట్లు వుండడంవల్ల బండారు అనే మాటనుండి భండారం అనే మాట ఏర్పడి వుండవచ్చునని ఊహించవచ్చు. 'పండ' అంటే పాండిత్యం; జ్ఞానం. పండారం అనే మాటనుండి కూడా భండారం ఏర్పడి వుండవచ్చు. జ్ఞానానికి నెలవు ఈ భండారం. అన్నమయ్య మాటల కొత్త కూర్పులు 'శ్రుతులు, శాస్త్రాలు, పురాణ కథలు, సుజ్ఞాన సారాలు' అయినట్లు చెప్పబడింది.[1] సుజ్ఞానసారం సంకీర్తన వాఙ్మయమంతటా విస్తరించింది. ఈ జ్ఞానం జీవి ప్రాపంచిక వాసనలను, బంధాలను, ఛేదిస్తుంది. అందుకే ఈ జ్ఞాన విధానాలైన సంకీర్తనలను భావితరాల భక్తులకోసం భద్రం చేయాలనుకొన్నారు తాళ్ళపాక కవులు. ఈ రకంగా చూచి నపుడు ధన ధాన్యాదులతో నిండిన ప్రాచీన ప్రభుత్వాల భండాగారాల కంటె తాళ్ళపాకవారి సంకీర్తన భండారం ఎంతో విలువైనదనిపిస్తుంది. సంకీర్తన భద్రత కోసం ఒక భండారాన్ని నిర్మించాలన్న ఆలోచన తాళ్ళపాక కవులకు రావడం ఎంతో మెచ్చదగిన గొప్ప విషయం.

### సంకీర్తనలు రాగిరేకుల మీది కెక్కింది పెద తిరుమలాచార్యుల కాలంలో :

పెద తిరుమలాచార్యులు చేసిన పనుల్లో ముఖ్యమైంది, వేరెవరూ చేయలేనిది తన తండ్రివి తనవి అనేకవేల సంకీర్తనలను, తన లఘుకృతులను పెద్ద-పెద్ద రాగిరేకులపై చెక్కించి సంకీర్తన భండారంలో భద్రపరచడం. రాగిరేకులపై 'అన్నమరాజు తిమ్మయ' వ్రాయసకాడుగా కనిపిస్తున్నాడు. ఎంతో మంది ఎన్నో సంవత్సరాలు శ్రమపడి ఈ కార్యక్రమం పూర్తిచేసి వుండాలి. ఎంతో ద్రవ్యం దీనికి ఖర్చయి వుంటుంది. ఈ ద్రవ్యం తాళ్ళపాక కవులకు ఆనాటి రాజులు చేసిన దానాలనుండి సంగ్రహించబడి వుండవచ్చు. శ్రీ కృష్ణదేవరాయల రాజ్యకాలానికి (1509-1529) అన్నమయ్య పరమవృద్ధుడు. పెద తిరుమలాచార్యులు తిరుమలలో నివసిస్తూ వుండగా ఆయనమీద రాయలవారి దృష్టి పడినట్లు పెద తిరుమలాచార్యులు రాయల ఆస్థానికి వెళ్ళినట్లు, సత్కారం పొందడానికి ప్రయత్నించినట్లు,

ఈయన పతివ్రతా ధర్మాన్ని గురించి చెప్పిన పద్యాన్ని తెనాలి రామలింగకవి అవహేళన చేసినట్లు, అయినా రాయలు ఈయనకు యథోచిత సత్కారం చేసి పంపినట్లు ఊహించడానికి కొంత ఆధారమున్నదని వేటూరి ఆనందమూర్తిగారు వ్రాశారు.[10] వీరు ఈ విషయం చెప్పడానికి ఆధారం గురజాడ శ్రీరామమూర్తి రచించిన 'కవి జీవితములు' అనే గ్రంథం.[11] ఈ విషయం ఇంకా పరిశీలింపవలసి వుంది. ఒకవేళ పెద తిరుమలాచార్యులు రాయలవారిని దర్శించడానికి వెళ్ళివుంటే అది రాగిరేకుల వ్రాతకు కావలసిన సహాయాన్ని అర్థించడానికే అయివుంటుంది. రాయలవారు ఈయనకు చేసిన దానాలను గురించి ఏ శాసనమూ పేర్కొనకపోవడం వల్ల పెద తిరుమలాచార్యులకు రాజసహాయం లభించలేదని భావించాలి.

రాయల తరువాత విజయనగర చక్రవర్తి అయిన అచ్యుతరాయలు (1529–1542) పెద తిరుమలాచార్యులకు స్నేహితుడు, శిష్యప్రాయుడు. అచ్యుతరాయలు చంద్రగిరిలోను, పెద తిరుమలాచార్యులు తిరుపతిలోను వుండినప్పుడు వాళ్ళిద్దరు కలుసుకోవడము, స్నేహం ఏర్పడడం జరిగివుంటుంది. పెద తిరుమలాచార్యులు అచ్యుతరాయల మనస్సుకు హత్తుకొనే కొన్ని శృంగార కీర్తనలను తిరువేంగళ నాథుని మీద చెప్పడం, ఈ ప్రేమతో అచ్యుతరాయలకు అంతకు ముందే శ్రీనివాసునిమీద వుండిన భక్తి మరింత గాఢమై సంకీర్తనలను రాగిరేకుల మీద వ్రాయించే పనిలో సహాయపడి వుంటాడనుకోవడం నమ్మదగిన విషయం. తిరుమల పడికావలి గోపురం ముందుభాగంలో ఎడమవైపు గోడ అడుగు భాగంలో వేయబడిన తెలుగు శాసనంలోని "అచ్యుతరాయ మహారాయ ...... ష్టం గాను తిరువేంగళనాథునికి శ్రింగార సంకీర్తనలు చెప్పిన తాళ్ళపాక అన్నమయ్యకు " అనే విషయం దీనిని నిరూపిస్తుంది.[12] అచ్యుతరాయలు క్రీ. శ. 1529లో విజయ నగర ప్రభువైనాడు. అప్పటినుండి పెద తిరుమలాచార్యులకు మరింత రాజాదరణ దొరికింది. ఇన్నివేల సంకీర్తనలను రాగిరేకులమీద చెక్కించడానికి ఎన్నో సంవత్సరాలు పట్టివుంటుంది. వేటూరి ఆనందమూర్తిగారు క్రీ. శ, 1525 నుండి 1545 వరకు ఈ కార్యక్రమం కొనసాగి 20 సంవత్సరాల కాలంలో పూర్తి అయి వుంటుందని ఊహిస్తున్నారు. పెద తిరుమలాచార్యులు గ్రీష్మర్తువులో సంకీర్తన రచన ప్రారంభించినందువల్ల దీనిని సూచించడానికి శ్రీవారి ఆలయంలో గ్రీష్మోత్సవము నొకదానిని నెలకొల్పినట్లుంది. "క్రీ. శ. 1541లో సంకీర్తన భండారము

కడ దీపములుంచుటయు, శ్రీవైష్ణవు లిరువురు పనిచేయుచుండుటయు పై కార్యమింకను (రాగిరేకులపై చెక్కించడం) ముగియమిని సూచించునేమో! ఇక క్రీ. శ. 1545లో సంకీర్తన భండారమువద్ద సంకీర్తనముల నారాధించుటకై 20 రోజులపాటు గ్రీష్మోత్సవ సందర్భమున నివేదనలు జరుగుట గమనింపదగిన విషయం. అప్పటికాకార్యము ముగిసియుండును. ఆరంభమై ఇర్వదేండ్లు పూర్తి యగుటను సూచించుటయే కావచ్చును 20 దినములపాటు జరుగు గ్రీష్మోత్సవముతో దానిని ముడి పెట్టినాడు."[13]

ఈ వివరాలనుబట్టి చూస్తే అన్నమయ్య ప్రేరణతో సంకీర్తన భండారం నెలకొల్పబడి పెదతిరుమలాచార్యుల చేతిమీదుగా సంకీర్తన వాఙ్మయం 20 సంవత్సరాల కాలంలో రాగిరేకులమీది కెక్కినట్లు అర్థమవుతుంది. అన్నమయ్య కాలంలో భండారంలో వుంచిన తాళపత్ర ప్రతులలోని వాఙ్మయానికి పెదతిరుమలయ్య శాశ్వతత్వం చేకూర్చాడు. తన సంకీర్తనలను స్వామి సన్నిధిలో భద్రం చేయాలనుకొన్న అన్నమయ్యకు రాగిరేకులపై చెక్కించాలనే తలంపు కలిగివుండదు. ఈ తలంపు పెదతిరుమలయ్యకే కలిగినట్లు పండితుల అభిప్రాయం.[14] ఇలా భద్రపరచబడిన సంకీర్తనలను స్వామి సన్నిధిలో పెదతిరుమలయ్య ఆయన కుమారులు గానం చేయడమేగాక ఇతర గాయక పండితులను కొందరిని నియమించి నియమిత సమయాలలో వారిచేత సంకీర్తనలను గానం చేయించే ఏర్పాటు కూడా చేశారు. ఈ పండితులకు జీతభత్యాలను సమకూర్చారు. తిరుమల దేవాలయంలోని మూడవ ప్రాకార కుడ్యంపై తమిళంలో వేయించిన శాసనంలో పెదతిరుమలయ్య స్వామివారి దేవాలయానికి 450 ఫణముల ధనం; కుప్పం, కీలం గున్రమ్ అనే రెండు గ్రామాలను సమర్పించాడు.[15] ఈ ఆదాయంతో ఇతర సేవలతోపాటు సంకీర్తన భండారం ముందు ప్రతిరోజూ నాలుగు తిరుపోనకాలు నివేదించబడడానికి, రోజుకొక ఉళక్కు నూనె సరఫరా చేయడానికి ఏర్పాటు చేయబడింది. అక్కడ పనిచేసే శ్రీ వైష్ణవులిరువురికి జీతం క్రింద ప్రసాదాల పంపకం కూడా ఏర్పాటు చేయబడింది. సంకీర్తనలు వినేవారికి పప్పిరుబుడ్లు, చందన తాంబూలాదులు ఇవ్వడం సమకూర్చబడింది. నిత్యం తిరుమంజన సమయంలోను, శుక్రవారం పునుగుకాపు సమయంలోను, బ్రహ్మోత్సవ రథోత్సవ సందర్భాల్లోను సంకీర్తనలను ఆలపించే పద్ధతి నెలకొల్పబడింది. సంకీర్తనలను రచించి గానం

చేస్తూ భక్తితోపాటు వైష్ణవమత విషయాలను కూడా ప్రచారం చేయడం ఆనాటి పదకర్తల పద్ధతి. ఇది ఒక సంప్రదాయంగా మారింది, దీనికి 'సంకీర్తన అరుళప్పాడు' అని పేరేర్పడింది. 'అరుళప్పాడు' అంటే అనుగ్రహింపజేయడం. స్వామి దయనర్థించి పాడే పాటలతో కూడిన ఉత్సవమిది. తిరుపతిలోని గోవింద రాజస్వామి ఆలయంలో కూడా ఈ సంకీర్తనల గానం ఏర్పాటు చేయబడింది. ఆ కాలంలోని ప్రఖ్యాత వైష్ణవ క్షేత్రాలకు ఈ సంప్రదాయం వ్యాపించింది. క్రీ. శ. 1562 నాటి ఒక శాసనంలో మంగళగిరి నృసింహాలయంలో కూడా సంకీర్తన అరుళప్పాడు జరుగుతూ వుండినట్లు కనపడుతుంది.[16]

**తాళ్ళపాక అర :**

తాళ్ళపాక కవుల సాహిత్యాన్ని రాగిరేకుల మీద వ్రాయించి తిరుమల ఆలయ ప్రాంగణంలో భద్రపరచిన గదికి 'తాళ్ళపాక అర' అని పేరేర్పడింది. ఈ అరను సంరక్షించడంలో పెద తిరుమలయ్య తరువాత ఆయన సంతతివారు కూడా ఎంతో శ్రద్ధ తీసుకొన్నారు. తాళ్ళపాక అర సంగీత సాహిత్యాలకు సంబంధించిన ఒక వ్యవస్థగా రూపు దిద్దుకొన్నది. దీని ప్రఖ్యాతి ఇతర వైష్ణవ క్షేత్రాలకు పాకింది. ఇందులోని రాగిరేకులు కొన్ని శ్రీరంగాది క్షేత్రాలకు వెళ్ళాయి. అక్కడ కూడా స్తోత్ర సాహిత్య గ్రంథాలను భద్రపరచే సంప్రదాయం ఏర్పడి వుంటుంది. ఈ వ్యవస్థకింత ప్రాధాన్యత ఏర్పడినా దీనికి సంబంధించిన వివరాలను ప్రాచీన కవులెవరూ ప్రస్తావించలేదు. కడకు పదకవులు కూడా వీటి ఉనికిని పేర్కొనక పోవడం ఆశ్చర్యం. తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఈ రాగి రేకులను బయటికి తీయించి అందలి సాహిత్యాన్ని కాగితాల మీద వ్రాయించి పండితులచేత పరిష్కరించి ప్రకటించడానికి పూనుకొన్నారు. 1935లో తాళ్ళపాక వారి 'లఘు కృతులు' మొదటి సంపుటం విజయరాఘవాచార్యులు మరియు ఆదినారాయణ నాయుడు గార్ల పరిష్కరణతో ముద్రింపబడింది. 1922 నుండి తిరుమల తిరుపతులలో గల శాసనాలను సేకరించి ప్రకటించే ప్రయత్నం కూడా జరిగింది.[17]

**రాగి రేకులను గుర్తించిన వారు :**

మొట్టమొదట తాళ్ళపాక అరలోని రాగి రేకులను గుర్తించి ప్రస్తావించిన వాడు విదేశీయుడైన ఏ. డి. క్యాంబెల్. ఆయన 1816లో గమనించిన విషయమిది,

"Having heard that a number of poems engraved on some thousand sheets of copper had been preserved by the pious care of a family of brahmins in the temple on the sacred hill at Tirupati, I deputed a native for the purpose of examining them, but with the exception of a treatise on grammar of which a copy was taken, the whole collection was found to contain nothing but voluminous hymns in praise of the Deity."[18]

ఆ తరువాత 1882 వరకు ఈ విషయాన్ని పట్టించుకొన్నవారులేరు. రాబర్ట్ సీవెల్ మద్రాసు ప్రెసిడెన్సీలోని ప్రాచీన అవశేషాలను సేకరించి ఒక పట్టిక తయారుచేసి 1882 లో ఒక గ్రంథంగా ప్రకటించాడు.[19] ఈ గ్రంథంలో సీవెల్ శ్రీవారి ఆలయంలోని తాళ్ళపాకవారి అరలో రెండుబండ్ల రాగిరేకు ఉండినట్లు వ్రాశాడు. వీటిని ఇతడు శాసనాలుగా భ్రమించాడు. 1888 లో ప్రభుత్వ ఎపిగ్రఫిస్టుగా వుండిన డాక్టర్ హల్జ్ తన సహాయుడైన వి. వెంకయ్యను తిరుపతిలోని శాసనాలను సంపాదించే పనికి పురమాయించాడు. వెంకయ్య తిరుపతిలోగల చాల శాసనాల ప్రతిబింబాలను తీశాడు. తిరుమల గుడిలో శాసన ప్రతిబింబాలు తీయడానికి ప్రయత్నించగా అప్పటి మహంత్ ఆయనను గుడి లోపలి భాగాలను తనిఖీ చేయడానికి అనుమతించలేదు. ఉత్తర ఆర్కాటు జిల్లా కలెక్టరు జోక్యం చేసుకొన్నా ప్రయోజనం లేకపోయింది. ఈ విషయాలను హల్జ్ ప్రభుత్వ దృష్టికి తెచ్చాడు.[20] అప్పటి మద్రాసు ప్రెసిడెన్సీ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి అభిప్రాయాన్ని హల్జ్‌కు తెలియజేశాడు. ప్రధాన కార్యదర్శి అభిప్రాయంలోని ప్రధాన భాగమిది.

"His excellency in council regrets that the Mahant refused to permit Dr. Hultzsch's brahmin assistant to enter the inner part of the Tirumala Temple at upper Tirupati and trusts that on a future occasion permission to do this may be accorded."

ప్రధాన కార్యదర్శి హల్జ్‌కు పంపిన ఈ ఉత్తరం ప్రతి మహంతుకు కూడా పంపబడింది.

1903 లోనో 1904 లోనో వెంకయ్యకు ఆలయం లోపలికి వెళ్ళి పరిశీలించే అనుమతి లభించింది. 1904 లో జారీ అయిన ప్రభుత్వ వార్షిక శాసన నివేదికలో[21] వెంకయ్య ఇలా ఒక నోట్ వ్రాశాడు.

"Through the kind offices of Mr. M.L. Vanghan, I.C.S., Collector of North Arcort, I was permitted to examine the interior of the temple at Tirumala and the copper Plates secured there......They are however not sasanas or royal edicts, but contain songs composed by a member of Tallapakam family."

ఈ ఆంగ్ల వాక్యాలనుబట్టి సీవెల్ అక్కడి రాగిరేకులను శాసనాలుగా భావిస్తే వెంకయ్య నాటికి అవి శాసనాలు కాదని సంకీర్తన వాఙ్మయాన్ని చెక్కిన రాగిరేకులని లోకానికి వెల్లడైంది, ఈ విషయం 1816 లో క్యాంబెల్ తెలుసుకొన్నా అతడు దానిని గురించి మరెక్కడా వ్రాయకపోవడంవల్ల ఆ విషయం గోప్యంగానే వుండి పోయింది.

ఆ కాలంలో ఆంగ్లేయులకు ఆలయ ప్రవేశంలేదు. హల్ట్ ఆలయం లోపలికి వెళ్ళడానికి ఎంతో ప్రయత్నించాడు. ఫలితం లేకపోయింది. ఆలయం లోపల శ్రీ కృష్ణదేవరాయల, ఆయన దేవేరుల తామ్రశిల ఉన్నాయని విన్నాడు, చూచి ఫోటోలు తీయాలనుకొన్నాడు. వీలుకాలేదు. ఈ విషయాలను 1903 జూలై 24 వ తేదీన మద్రాసు ప్రభుత్వ దృష్టికి తెచ్చాడు.

"As no European is permitted to enter the temple these three statues, which are of considerable historical interest, deserve to be photographed by a caste Hindu."[22]

అని ఆయన ప్రభుత్వానికి వ్రాస్తే హల్ట్ దగ్గర పని చేస్తుండిన వారిలో ఒక హిందువును పంపి ఫోటోలు తీయించుకోమని అప్పటి ప్రధాన కార్యదర్శి సమాధాన మిచ్చాడు. హల్ట్ 1903 లో తన పదవికి రాజీనామా చేసి వెళ్ళగా ఆ పదవిలో వెంకయ్య నియమింపబడినాడు. వెంకయ్య హయాంలో దేవాలయం లోపలి చారిత్రకాంశాలు ఎన్నో బయటకు వచ్చి అనేకులకు తెలిశాయి.

తిరుమల దేవాలయాంతర్గత విశేషాలకు వెలికి తీసినట్లే అప్పటి ప్రభుత్వం ఇతర ప్రసిద్ధ దేవాలయాల విషయాలను కూడా వెలికి తీసే ప్రయత్నం చేసింది. ఈ ప్రయత్నంలో భాగంగా అహోబిల దేవాలయాన్ని పరిశీలించినపుడు అక్కడ కూడా సంకీర్తనలున్న రాగిరేకులు కనిపించాయి. 1915 లో జారీ అయిన మద్రాసు ప్రభుత్వ శాసన నివేదికలో ఆ విషయా లిలా ప్రకటింపబడినాయి.

"Many huge inscribed Copper Plates are kept in the underground cellers in the temple on upper-Ahcbilam. These are of the same type as those found in the Tallapakam vari Kottu on the Tirupati Hill and also actully belong to that temple and not to Ahobilam"[28]

ఇవి పెదతిరుమలాచార్యుల కాలంలో అక్కడికి వెళ్ళినవి కావచ్చు.

**ఉపసంహారం :**

క్రీ.శ. 16 వ శతాబ్దిలో సాహిత్యాన్ని రాగిరేకులమీద చెక్కించడం ఆశ్చర్యకరమైన విషయం. అంతకు ముందు కూడా ఇలాంటి పని జరిగిందని పరిశోధనలు చెపుతున్నా అవేవీ దొరకడంలేదు. తాళ్ళపాక కవుల తరువాత కూడా ఇలాంటి పని చేసినవారు లేరు. ఇదొక బృహత్కార్యం. తాళ్ళపాక ఆచార్యుల ఆధ్యాత్మకానురక్తికి ఆనాటి రాజకీయశక్తి కొంత తోడుకావడం వల్ల ఈ పవిత్ర కార్యం కొనసాగింది. పూర్వకాలంలో బౌద్ధ విశ్వవిద్యాలయా లుండేవని చారిత్రకులు చెపుతారు. బౌద్ధ స్థూపాల విస్తరణ కార్యక్రమమే విశ్వవిద్యాలయాలుగా రూపుదిద్దుకొని ఉంటుంది. బౌద్ధ విశ్వవిద్యాలయాల్లో ప్రాకృత భాషలో రచింపబడిన బౌద్ధ గ్రంథాలు భద్రంచేయబడినాయి. అలాగే క్రీ.శ. 4 వ శతాబ్దం నుండి సుమారు 13 వ శతాబ్ది వరకు దక్షిణ భారతదేశంలో విద్యాస్థానాలుగా గుర్తింపబడిన ఘటికా స్థానాలు పనిచేసినట్లు శాసనాధారాలున్నాయి. ఈ ఘటికలలో ఆచార్యు లుండేవారు. పుస్తక భాండాగారాలుండేవి. ఘటికలు దేవాలయాలకు అనుబంధంగా వుండడం వల్ల దైవకార్యాలకు, సాహిత్యకర్తల భక్తితత్పరతకు సంబంధ మేర్పడింది. ఈ సంబంధం భక్తకవుల స్తోత్ర సాహిత్యాన్ని దేవాలయాలలోనే భద్రపరచడానికి

దోహదం చేసింది. ఇదే తాళ్ళపాక కవులకు కూడా ప్రేరణ. ఈ ప్రేరణ తాళ్ళపాక అర నిర్మాణానికి, సంకీర్తనలను రాగిరేకులమీద చెక్కించడానికి కారణ మైంది. తాళ్ళపాక కవులు ధన్యులు. శ్రీవారి ఆలయంలో వారు ఆలపించిన సంకీర్తన గానం వినగలిగిన వారికి నిత్యనూతనంగా వినిపిస్తూనే ఉంటుంది.

## సూచికలు :


1. Indian Epigraphy, 1965, p. 62.
2. ibid. p 64.
3. Sircar, D.C. Select Inscriptions. p. 280
4. Ibid, p. 377
5. తాళ్ళపాక కవుల కృతులు-వివిధ సాహితీ ప్రక్రియలు. హైదరాబాదు, 1974, పుటలు 83-85.
6. Epigraphia Indica, Vol. XX.
7. శృంగారాధ్యాత్మక సంకీర్తనల పరిష్కృత సంపుటాలలో గల పీఠిక లలో—వేటూరి ప్రభాకరశాస్త్రి, ఉదయగిరి శ్రీనివాసాచార్యులు; తాళ్ళపాక వాఙ్మయ పరిశోధన గ్రంథంలో ఆనందమూర్తి ఈ యభిప్రాయం ప్రక టించారు.
8. అన్నమాచార్య చరిత్ర పీఠిక, తి.తి.దే. ప్రచురణ, 1978, పుట. 90.
9. సంకీర్తన లక్షణంలో 12 వ పద్యం.
10. తాళ్ళపాక కవుల కృతులు—వివిధ సాహితీ ప్రక్రియలు. 351 వ పుట లోని అధోజ్ఞాపిక.
11. కవి జీవితములు, 1955. పుట. 236.
12. తి.తి.దే. శాసనాలు. Vol, IV. No. 20
13. ఆనందమూర్తి, వేటూరి. తాళ్ళపాక కవుల పదకవితలు—భాషాప్రయోగ విశేషాలు. 1976, పుట. 97.

14. తాళ్ళపాక పెదతిరుమలయ్య 'శ్రీ భగవద్గీత—తొలి తెలుగు భావానువాదం' గ్రంథానికి ప్రొఫెసర్ కొత్త సచ్చిదానందమూర్తి రాసిన పీఠికలో ఈ విషయాలను చర్చించారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రచురణ. 1978.

15. తి.తి,దే. శాసనాలు. Vol. IV. No 155

16. దక్షిణ హిందూదేశ శాసనములు. Vol IV. No 710

17. See the preface of the TTD Epigraphical Report, 1930. p. 1

18. Vide Introduction, Grammar of Teloogoo Language by A.D. Campbell. First Edition, 1816, Madras.

19. ఈ గ్రంథం 'List of Antiquarian Remains of the Madras Presidency, అనే పేరుతో మద్రాసులో అప్పటి పురావస్తుశాఖ వారిచేత ప్రకటించబడింది.

20. Annual report on South Indian Epigraphy, 1889, p. 1

21. Madras Epigraphical Report, 1903, p 3.

22. Ibid, 1903, p. 6.

23. Ibid, 1915, p. 96.

# 5. ఆంధ్రుల సంస్కృతి - ప్రత్యేకతలు

శ్రీమద్రామాయణ సంస్కృతి (ఆర్య సంస్కృతి) ఆంధ్ర దేశంలో వ్యాపించకముందు ఇక్కడ ప్రచారంలో ఉన్న సంస్కృతి దేశీయ సంస్కృతి. గౌతమబుద్ధుని కాలానికే (క్రీ. పూ. 6వ శతాబ్దం) ఆంధ్రదేశంలో సువ్యవస్థితమైన దేశీయ సంప్రదాయం, సంస్కృతి ఏర్పడినాయి. ఉత్తర భారతదేశం నుండి ఆర్య. బౌద్ధ సంస్కృతులు క్రీ. పూ. 5వ శతాబ్దం నాటికి ఆంధ్ర దేశానికి వచ్చి వ్యాపించాయి. ఆర్య సంస్కృతికి మరో పేరు వైదిక సంస్కృతి. అప్పటికి ఇక్కడ వుండిన దేశీయాచారాల మీద వైదిక సంస్కృతి ప్రభావం పడడంతో అప్పటి దేశీయమైన సంస్కృతి వైదిక సంస్కృతిలో కలసిపోయింది. అగ్నిని ఆరాధించడం వైదిక సంస్కృతిలో భాగం. వేపచెట్టును పూజించడం అప్పటి దేశీయ సంస్కృతిలో భాగం. వేపచెట్టుకింద నాగప్రతిమలను ప్రతిష్ఠించి పూజించటం ఆంధ్ర దేశంలో కనిపించే అతి ప్రాచీనమైన ఆచారం. క్రీ. పూ. 3వ శతాబ్దిలో అశోకుడు ధర్మలిపులను ఆంధ్ర దేశంతో వేయించకముందే బౌద్ధం ఇక్కడికి వచ్చి వ్యాపించింది. అప్పటి నుండీ నాగారాధన బౌద్ధంలో కలిసి పోయింది. వైదిక సంస్కృతి భారతీయ సంస్కృతిగా విస్తృతరూపం పొందింది. దేశంలోని అన్ని ప్రాంతాలలో ప్రాంతీయమైన స్వల్ప భేదాలున్నప్పటికీ వీటి కతీతంగా భారతీయ సంస్కృతి ఆసేతు హిమాచల పర్యంతం ప్రజలందరి సంస్కృతిగా మారింది. ఆంధ్రదేశ పరిస్థితి కూడా ఇంతే. అయితే ఆంధ్ర సంస్కృతి భారతీయ సంస్కృతికి భిన్నం కాకపోయినా కొన్ని ప్రత్యేకతలను కాలక్రమంగా నిలుపుకుంటూనే వస్తున్నది. ఆంధ్ర సంస్కృతిలోని కొన్ని ప్రత్యేకతలను వివరించడమే ఈ వ్యాసం ఉద్దేశం.

ఆంధ్ర సంస్కృతిని మనకందించిన మొట్టమొదటి సాహిత్య గ్రంథాలలో లభ్యమవుతున్నవి బృహత్కథ, గాథా సప్తశతి. శాతవాహనుల కాలంనాటి ఈ

రెండు గ్రంథాలు ప్రాకృత భాషలో వున్నాయి. ప్రాకృతం రాజభాష కావడంవల్ల అప్పటి సాహిత్యం ప్రాకృతంలో వచ్చింది. ప్రాకృత భాషకు బౌద్ధ మత వాఙ్మయానికి; సంస్కృత భాషకు వైదిక వాఙ్మయానికి అతి దగ్గర సంబంధం. శాతవాహనుల కాలంలో వైదిక సంస్కృతికి కొంత కుదురు ఏర్పడినా సంస్కృత భాషకు అంత ఆదరణ కానరాదు. 'కాతంత్ర వ్యాకరణం' లాంటి ఒకటి రెండు సంస్కృత గ్రంథాలు వెలువడినప్పటికి ఆ భాష ప్రాచుర్యం అతి తక్కువ! బృహత్కథ కొక ప్రత్యేకత వుంది. అప్పటి ప్రజలకు కథా సాహిత్యం మీదగల మక్కువ దీని ఆవిర్భావానికి కారణం. అప్పటికే రామాయణ భారతాది కథలకు ఎంతో ప్రజాదరణ వుండినా వీరరస స్ఫోరకమైన జానపద కథలకు ఎంతో ప్రజాదరణ ఇంకా ఎంతో ఆదరణ వుండేది. కథలు చెప్పడం. ఊకొడుతూ వినడం ఎప్పటినుంచో వస్తున్న అలవాటు. ఆ యలవాటు పల్లెప్రాంతాల్లో ఇప్పటికీ ఉంది. ఆంధ్ర సంస్కృతి అప్పటి కథలద్వారా వ్యక్తమవుతుంది. 'గాసట బీసటన్ చదివి గాథలు త్రవ్వు తెలుంగు వారికిన్' అనే నృసింహ పురాణంలోని ఎర్రన పద్యం తెలుగువారికి కథలపై గల మక్కువను తెలుపుతుంది. శాతవాహనుల రాజ్యకాలంలో కనిపించిన మరొక ప్రత్యేక అంశం తల్లుల గోత్ర నామాలు కొడుకుల పేర్లలో కనపడడం. గౌతమీ పుత్ర శాతకర్ణి, వాసిష్ఠీ పుత్రపులుమావి అనే పేర్లలో గౌతమి శాతకర్ణి తల్లిగోత్రం, వాసిష్ఠి పులుమావి తల్లి గోత్రం. గౌతమి. వాసిష్ఠి గౌతమ వసిష్ఠ మహర్షుల పేర్ల మీద ఏర్పడిన గోత్ర నామాలు. ఇవి బ్రాహ్మణ గోత్రాలు కావడంవల్ల శాతవాహన రాణులు ఈ గోత్రాలకు చెందినవారుగా కనపడడంచేత శాతవాహనులు బ్రాహ్మణులా అనే సందేహం వుంది. ఈ విషయం ఇక్కడ అప్రస్తుతం. ఆంధ్ర సంస్కృతిలో తల్లులను తనయుల పేర్లలో స్మరించడం శాతవాహనుల కాలం నుండి ప్రారంభమైంది. ఈ పద్ధతి సంఘంలో తల్లులకుగల గౌరవ ప్రతిపత్తులను తెలుపుతుంది. ఈ పద్ధతిని ఇక్ష్వాకులు మొదలైన అనంతర రాజవంశాల వాళ్ళు కూడా పాటించారు. ఇది మాతృస్వామ్య వ్యవస్థకు గుర్తు. ప్రస్తుతం ఈ పద్ధతి అదృశ్యమై పితృస్వామ్యక వ్యవస్థ కనిపిస్తున్నా తల్లికి ఇవ్వవలసిన గౌరవ విషయంలో ఏ మార్పు లేదు.

ఆంధ్ర సంస్కృతిలో కనిపించే మరొక ప్రత్యేకాంశం మేనరిక వివాహ వ్యవస్థ. ఇది ఇక్ష్వాకుల కాలం నుండి అంటే క్రీ. శ. 3వ శతాబ్ది నుండి ఆంధ్ర

దేశాచారంగా కనిపిస్తున్నది. ఇక్ష్వాకు రాజైన చాంతమూలునికి శాంతశ్రీ, హర్మ్యశ్రీ అనే ఇద్దరు చెల్లెళ్ళున్నారు. శాంతిశ్రీకి భట్టిదేవి అనే కూతురు హర్మ్యశ్రీకి షష్ఠిశ్రీ, బాపిశ్రీ అనే కూతుళ్ళు వున్నారు. చాంతమూలుని చెల్లెళ్ళ ముగ్గురు కుమార్తెలను ఆయన కొడుకు వీరపురుషదత్తుడు వివాహమాడాడు. ఇది అచ్చమైన మేనరికపు వివాహం. అప్పటినుండి ఆంధ్ర దేశంలో మేనరిక వివాహ వ్యవస్థ ప్రారంభమై ఇప్పటికీ కొనసాగుతున్నది. వైద్య శాస్త్రరీత్యా ఇలాంటి వివాహాలు పనికిరావని వైద్యులు చెపుతున్నా మారుమూల పల్లెప్రాంతాల్లో ఇప్పటికీ ఈ పద్ధతికి కొనసాగుతూనే వుంది. ఉమ్మడి కుటుంబ వ్యవస్థ దీనికి కారణం. తల్లి, తండ్రి; కొడుకులు, కుమార్తెలు; మనుమలు, మనుమరాండ్రు; అత్తలు, ఆడుబిడ్డలు; అవ్వలు, తాతలు అందరు కలసి వున్నదే ప్రాచీన కాలంలో కుటుంబం. ఆ కుటుంబంలోకి మరొక కొత్త వ్యక్తి రావడం వారి కిష్టం లేదు. మేనత్త మేనమామ బిడ్డలు వివాహం చేసుకోకుండా వేరే సంబంధాలు చేసుకొంటే వారి కుటుంబ వ్యవస్థ చెడిపోతుందని భావించేవారు. ఆ కాలంలో మతపరమైన సంఘపరమైన ఏ పనిచేసినా కుటుంబంలోని వ్యక్తులంతా కలిసి చేసేవాళ్ళు. బౌద్ధారామాలకు దానాలు చేసినా కుటుంబ సభ్యులందరూ దాతలుగా పేర్కొనబడిన ఉదాహరణలెన్నో వున్నాయి. ఉమ్మడి కుటుంబ వ్యవస్థ లోపభూయిష్టమైందని ఇప్పటివాళ్ళు భావిస్తున్నారు. అయినా ఇది అక్కడక్కడా ఆంధ్ర సంస్కృతికి గుర్తుగా కనిపిస్తూనే వుంది.

ఆంధ్ర దేశంలో వివాహ సంస్కృతి ప్రత్యేకంగా కనిపిస్తుంది. ఇక్కడ కృష్ణ యజుర్వేద శాఖను అధ్యయనం చేసినవారి సంఖ్య హెచ్చు. ఈ శాఖకు చెందిన గృహ్యసూత్రాలను ఆపస్తంభ ఋషి శాసించాడు. ఇతడు చెప్పిన పద్ధతి ప్రకారమే తెలుగువారి వివాహాలు జరుగుతున్నాయి. వివాహానికి చైత్ర వైశాఖ మాసాలు ప్రశస్తమైన కాలం. తాళి బొట్టు - అంటే మంగళ సూత్రధారణం ఆర్యవివాహ తంత్రంలో లేదు. ఆంధ్ర సాహిత్యంలో మొదటిసారిగా మను చరిత్రలో ఈ ప్రస్తావన వుంది. పెద్దన స్వరోచిచే మనోరమకు మంగళసూత్రం కట్టించాడు. పోతన భాగవతంలో పార్వతి తన భర్తయైన శివుని హాలాహలాన్ని మింగమని చెప్పే సందర్భంలో ఈ పద్యముంది.

"మ్రింగెడిది గరళమనియును
మ్రింగెడివాడు విభుండని మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ
మంగళ సూత్రంబు నెంత మది నమ్మినదో"

ఈ పద్యంలో సర్వమంగళ గళంలో మంగళసూత్రం ఉన్నట్లు తెలుస్తున్నది, పోతన పెద్దనవలె మంగళసూత్రం కట్టింపలేదు, రుక్మిణీ కళ్యాణ సందర్భంలో కూడా పోతన "ధ్రువ కీర్తిన్ హరిపెండ్లియాడె నిజచేతో హారిణిన్ రుక్మిణిన్" అని చెప్పాడు. ఆముక్తమాల్యదలో "గళమున గట్టెను హరి మంగళ సూత్రము పులకలతివ గాత్రము దొడువన్" అన్నట్లు రాయలు రంగనాథునిచే గోదాదేవి మెడలో మంగళసూత్రం కట్టించాడు. అప్పటినుండి ఆంధ్ర దేశంలో మాంగల్య ధారణ వుండినట్లు చెప్పవచ్చు. తాళికి తాళ శబ్దంతో సంబంధం కల్పించి తాటాకును చుట్టగా చుట్టి దానిని దారంతో బంధించి మెడలో కట్టడంవల్ల తాళిబొట్టు అనేమాట ఏర్పడిందని పండితుల అభిప్రాయం.

పచ్చని ఆకులతో పందిరి మండపం నిర్మించడం, ఆ మండపంలో నాలుగు వైపుల ఐరేని (పూజ) కుండలనుంచడం, పుణ్యాంగనలు వధూవరుల తలలపై అక్షింతలు చల్లడం మొదలైనవి వైదికేతరములైన దేశీయాచారాలు. తెర పట్టడం, తలంబ్రాలు పోయించడం తిక్కన భారతంలోని ఉత్తరాభిమన్యుల వివాహ సందర్భంలోను, రంగనాథ రామాయణంలోని సీతా వివాహ సందర్భంలోను కనిపించే దేశీయాచారాలు. జీలకర్రను బెల్లంతో కలిపి ఆముద్దను వరుని తలమీద వధువుచేత, వధువు తల మీద వరునిచేత పెట్టించడం కూడా దేశీయాచారమే. మొదటినుండి తెలుగువారిలో వివాహాలు ఒకే కులంలోనే జరగడం ఆచారం. కులాంతర వివాహాల ప్రసక్తిలేదు. పాణిగ్రహణం, సప్తపది ఆర్యులమార్గం. మంగళ సూత్రధారణ, ఐరేనికుండలు దేశీయ మార్గం.

వివాహ సందర్భాలలో 'అరణం' యివ్వడం పూర్తిగా దేశీయ పద్ధతి. ఈ పద్ధతి ఎంత ప్రాచీనమైందో తెలియదుగాని తూర్పు చాళుక్యరాజైన విమలాదిత్యుని కాలంనుండి ఉన్నట్లు చెప్పడానికి ఆధారాలున్నాయి. కుమార్తెకు వివాహమై అత్త వారింటికి వెళ్ళే సమయంలో తల్లిదండ్రులు ఆమెకిచ్చే ఆభరణాలు, ధనం మొద

లైన సంపద అరణంగా పిలువబడింది. వివాహ సమయంలో అల్లునికి ఆడుబిడ్డలకు ఇచ్చే ధనం అరణమని మరొక అభిప్రాయం. వధువు వరుని ఇంటికి తెచ్చే సంపద అరణమని అర్థం చేసుకోవాలి. తూర్పు చాళుక్యరాజులైన విమలాదిత్యుడు, రాజరాజు, కులోత్తుంగచోళుడు అరవదేశాన్ని పాలించిన చోళరాజుల కుమార్తెలను వివాహమాడి ఘనమైన సంపదను అరణంగా పొందారు. కులోత్తుంగచోళుడు అరణంగా వచ్చిన రాజ్యానికే వారసుడయ్యాడు. అప్పటి అరణమే ప్రస్తుతం కట్నం రూపంలో ప్రచారంలో వుంది. తెలుగు సాహిత్యంలో ముఖ్యంగా ప్రబంధకాలం నుండి కవులు మామలు అల్లుళ్ళకిచ్చే అరణం విషయాలను విరివిగా వర్ణించారు.

ఆంధ్రదేశంలో వీరులను పూజించడం చాల ప్రాచీనకాలం నుండి ఉంది. క్రీ. శ. ఆరు ఏడు శతాబ్దాలనుండి వీరారాధనను తెలిపే శాసనాలు రాయలసీమ ప్రాంతంలో వేయబడినాయి. ప్రజోపయోగం కోసం ఒక సాహస కార్యం చేసి దాని వలన కలిగిన పోరులో మరణించినవాడు వీరుడుగా సంఘంలో గుర్తింపు పొందాడు. అలాంటి వీరుల బొమ్మలను రాతిపలకలపై చెక్కించి బొమ్మలకింద ఆ వివరాలను తెలిపే శాసనాలను రాయించేవారు. ఇలాంటి బండలను వీరగల్లులని పిలచేవారు. వీరగల్లులను తోటలలో, పొలం గట్లపైన, కూడలి ప్రాంతాలలో నాటి పూజాదికాలు ఏర్పాటు చేసేవారు. నేటి రాయలసీమ దక్షిణ ప్రాంతాన్ని పాలించిన వైదుంబ వంశపురాజులు యుద్ధ ప్రియులు. వీరు వేయించిన తెలుగు శాసనాలు ఎక్కువ భాగం వీరారాధనకు సంబంధించినవే. మధ్యయుగంలో ఇలాంటి వీరశిలలు ఎక్కువగా వేయబడినాయి. గొప్ప కారణాల కోసం ప్రాణాలను బలి చేసిన వీరులను పూజించినట్లే ఆత్మార్పణ చేసుకొన్న స్త్రీల బొమ్మలను కూడా రాతిపలకలపై చెక్కించి 'సతిగల్లులు' అనే పేరుతో పూజలు చేసేవారు. ఇలాంటి సతిగల్లులు కూడా రాయలసీమ ప్రాంతంలో దొరికాయి. రుక్మాంగద చరిత్ర, కాశీ ఖండం వంటి తెలుగు కావ్యాలు కూడా వీరారాధనను, ఆత్మార్పణ చేసిన స్త్రీల ఔన్నత్యాన్ని ప్రస్తుతించాయి. క్రీ. శ. పదునాల్గవ శతాబ్దం నాటికి వీరారాధన ఆంధ్రదేశమంతా వ్యాపించింది.

ఆంధ్ర సంస్కృతికి పరసంస్కృతులను తనలో బాగా సమన్వయించుకొనే శక్తి వుంది. జైన, బౌద్ధ, మహమ్మదీయ, క్రైస్తవ సంస్కృతులను తనలో

కలుపుకొని తెలుగు సంస్కృతి గంభీరంగా కనిపిస్తుంది. పొరుగు దేశాలనుండి తమిళులు, కన్నడిగులు రాజకీయ కారణాలవల్ల ఆంధ్ర దేశానికి వచ్చి స్థిరపడినారు. రెండవ పులకేశి విష్ణుకుండులను ఓడించి తూర్పు చాళుక్యరాజ్యం స్థాపించిన సందర్భంలో ఎందరో కన్నడిగులు వచ్చారు. తూర్పు చాళుక్య రాజులు చోళుల ఆడపడుచులను వివాహం చేసుకున్న సందర్భంలో చోళదేశం నుండి ఎందరో తమిళులు ఆంధ్ర దేశానికి వచ్చి స్థిరపడినారు. నన్నయ ఇలా తమిళదేశం నుండి వచ్చినవాడేనని కొందరి అభిప్రాయం. ఈరకంగా కన్నడ తమిళ సంస్కృతులు ఆంధ్ర దేశంలో ప్రవేశించాయి.

ఆంధ్ర సంస్కృతిని వెలార్చే మరొక అంశం 'ఆంధ్ర నాట్యం', ప్రాచీనకాలం నుండి ఆంధ్రులకొక ప్రత్యేక నాట్యశైలి వుంది. భరతుని నాట్యశాస్త్రంలో అప్పటికి దేశీయమైన 'ఆంధ్రి' అనే నాట్యశైలి ప్రస్తావింపబడింది. మతంగుని బృహద్దేశిలోను, శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరంలోను దీనికి సంబంధించిన విశేషవివరాలున్నాయి. ఆంధ్ర దేశంలో మొదటినుండి దేవాలయ నాట్యాలలో 'పేరిణి' వంటి ఉద్ధత నాట్యాలు, రంగస్థల నాట్యాలలో భామా కలాపం వంటి సుకుమార నాట్యాలు తమదైన ఒక స్వంత బాణీని ఏర్పరచుకొన్నాయి. పేరిణి గత శతాబ్ది వరకు దేవాలయాల నాశ్రయించి బ్రతికి తరువాత మరుగున బడింది. ఇది క్లిష్టమైన నాట్యప్రక్రియ. కూచిపూడి భామాకలాపం నృత్యనాటిక. పేరిణిని ఆంధ్రనాట్యమనే పేరుతో నటరాజ రామకృష్ణ ప్రచారంలోకి తేవడానికి కృషి చేశారు. నాట్యం, సంగీతం దేవాలయాల ప్రాంగణాల్లో, రాజాస్థానాల్లో పోషింపబడినాయి. దేవాలయాల్లో దేవదాసీలు, రాజాస్థానాల్లో రాజనర్తకీగణం ఈ కళను ప్రదర్శిస్తూ వీటిని నిత్యనూతనం చేశారు.

తోలుబొమ్మలాట, హరికథ, అవధానం. ఆంధ్ర దేశంలోనే వికసించిన సాంస్కృతిక కళలు. ఈ కళలలో నిష్ణాతులైన ఆంధ్రులు దేశంలోని ఇతర ప్రాంతాలలోను, ఇతర దేశాలలోను అనేక ప్రదర్శనలిచ్చి ఆంధ్రుల సాంస్కృతిక ప్రత్యేకతలను సుస్థిరం చేశారు, చేస్తున్నారు.

# 6. రాయలసీమలో గ్రామదేవతారాధన

ప్రాచీనకాలం నుండి రాయలసీమలో గ్రామదేవతారాధన వుంది. ఈ విషయాన్ని నిరూపించే శాసనాలెన్నో వున్నాయి. శాసనాలలో గ్రామదేవతలకు కుల దేవతలనే పేరుకూడా కన్పిస్తుంది. చెట్లను, పుట్టలను, వాగులను, వంకలను గ్రామాలను రక్షించే దేవతలుగా పూజించడం ఎంతో ప్రాచీన విషయం. అయితే దేవతల బొమ్మలను శిలలపై చెక్కి పూజించడం రాయలసీమలో క్రీస్తు శకం రెండవ శతాబ్దం నుండి వుంది. కడప జిల్లా సిద్ధవటం తాలూకాకు చెందిన గంగ పేరూరు గ్రామంలో దొరికిన ఒక శిలాఫలకంపై మనిషిబొమ్మ చెక్కబడింది. ఆ బొమ్మ కింద బ్రాహ్మి లిపిలో చిన్న శాసనముంది. భారద్వాజ గోత్రానికి చెందిన 'వరి ఆచారియ' కొడుకైన 'శివదాస' అనేవాడు స్వర్గగతుడు కాగా ఛాయాఖంభాన్ని ప్రతిష్టించినట్లు శాసనంలోని విషయం. ఒక వ్యక్తి స్వర్గగతుడైన సందర్భంలో ఆ వ్యక్తి జ్ఞాపకార్థం అతని బొమ్మనే చెక్కిన ఛాయా ఖంభమిది. ఇది సుమారు క్రీ. శ. 2వ శతాబ్దానికి చెందిన విషయం. రాయలసీమలో దొరికిన మొదటి వీరగల్లు ఇదే. (కడవ జిల్లా శాసనాలు I-1). రాయలసీమలో రాతిఫలకంపై బొమ్మలను చెక్కడానికిదే ప్రారంభం. అప్పటికి ఎంతో ప్రాచీనకాలం నుండి గ్రామ దేవతా రాధన వుండినప్పటికీ గ్రామదేవతల బొమ్మలను చెక్కించడం కనిపించదు. ఈ ఛాయా ఖంభాన్ని చూచి తరువాత తరువాత గ్రామదేవతా విగ్రహాలను మానవ రూపంలో శిలలపై చెక్కి గ్రామ పొలిమేరల్లో ప్రతిష్ఠించి ప్రజలు పూజించి వుంటారు. ఇప్పటికే కొన్ని గ్రామాల్లో అంకాళమ్మ, పోలేరమ్మ, గంగాళమ్మ మొదలైన స్త్రీ గ్రామదేవతల్ని బండలరూపంలో ఆరాధించడం కనిపిస్తుంది.

ప్రాచీనకాలంలో గ్రామదేవతలకు, శివుడు విష్ణువులాంటి పురాణ దేవతలకు తేడా కనిపించదు. పురాణదేవతలను కూడా ప్రజలు గ్రామదేవతలుగానే ఆరాధించి

నట్లు శాసనాధారాలను బట్టి తెలుస్తున్నది. రెండవ హరిహర రాయల కాలంలో శ్రీకాళహస్తిలో పూర్ణగిరి శ్రీసదంగన్ చే ప్రతిష్ఠింపబడిన శ్రీ కాళహస్తినాథుని గ్రామ దేవతగా పేర్కొంటున్నది,

రాయలసీమలో గ్రామ దేవతారాధన ప్రాచీనకాలం నుండి వుండినా క్రీ. శ. 9వ శతాబ్దినుండి వెలువడిన శాసనాలలో గ్రామదేవతలకు సంబంధించిన వివరాలు కనిపిస్తాయి. కడప జిల్లా రాజంపేట తాలూకాకు చెందిన పులపత్తూరులో దొరికిన ఒక శాసనం క్రీ. శ. 9వ శతాబ్దపు జుద్గపుట్టిని పరిపాలించిన చోళమహారాజు అల్లమైయి తల్లేరి గుడికి నాలుగు గ్రామాలనుండి భూమిదానం చేసినట్లు చెపుతుంది. (కడప జిల్లా శాసనాలు I-29). క్రీ. శ. 947కు చెందిన మరొక శాసనం (బళ్లారి తాలూకా) దేకమ్మ దేవాలయానికి కురునిగోడు గ్రామ మహాజనులు 62 మరుతుర్ల మాగాణిభూమిని సమర్పించినట్లు చెపుతుంది. రాయలసీమ శాసనాలలో కనిపించే గ్రామదేవతల పేర్లు ఆరుగొండల అంకాళమ్మ, అంకాళపరమేశ్వరి. చౌడేశ్వరమ్మ, తలకంటిదేవి, అరెమాంబిక. నంద్యాలమ్మ, లక్ష్మీదేవి, నల్లజారమ్మ, చండీశ్వరి, భైరవ భగవతి, సరస్వతి, హంపిదేవి, అక్కలదేవి, ఊపలమ్మ, కవిదేవమ్మ. యక్కలిదేవమ్మ. గ్రామదేవతల పేర్లు ప్రతిష్ఠించిన వ్యక్తుల పేర్ల మీద, ప్రతిష్ఠింపబడిన గ్రామాల పేర్ల మీద ఏర్పడినట్లు గ్రహించవచ్చు.

రాయలసీమలో గ్రామదేవతారాధన మధ్యయుగంలో బాగా ప్రచారం పొంది నట్లు అనేక శాసనాలు నిరూపిస్తున్నాయి. దీనికి కారణం శైవ వైష్ణవ మత తత్వాలతో పాటు శక్తితత్వం కూడా ప్రచారం పొందడం, దీనికి తోడు గ్రామ దేవతలందరూ ఎక్కువ భాగం స్త్రీ దేవతలు కావడం, వాళ్ళంతా పార్వతి అంశకు చెందినవారు కావడం గమనింపదగిన అంశం. అంకాళపరమేశ్వరి అనే గ్రామ దేవతారాధన దీనిని నిరూపిస్తుంది. పరమేశ్వరి అంటే పార్వతీదేవి.

పురాణ దేవతారాధనతోపాటు గ్రామదేవతారాధన కూడా మధ్యయుగం నుండి జరిగినట్లు తెలిపే శాసనాలెన్నో వున్నాయి. గ్రామదేవతకు గ్రామప్రజలే గాక రాజులు, రాజోద్యోగులు. రాజపరివారం దానాలు చేసినట్లు శాసనాలు చెపుతాయి.

1. పాపినాయకన హళ్ళిలోని ఆరుగొండల అంకాళదేవత అమృతపడికి తలారి తిమ్మనాయకుని కొడుకులు 'అపినాయక పురం' అనే గ్రామాన్ని సర్వ మాన్య అగ్రహారంగా యిచ్చారు (SII. 16,99. క్రీ. శ. 1532).

2. అంకాళపరమేశ్వరి తీర్థపరుపు సిద్ధయోగాలకు పెద కోడూరుతో పాటు పరిసర గ్రామాలనుండి మహారాచ ప్రయోజన దేవతా ప్రయోజనాలవల్ల వచ్చే ఆదాయాన్ని జంగం నరసయ్య సమర్పించాడు.

—పలుగు రాళ్ళపల్లి, కడప జిల్లా, SII. 16.185, క్రీ. శ. 1552.

3. సోంపల్లి అగ్రహారంలో పసూలయ్యే అబుగురూకలు చవుడేశ్వరమ్మ పూజా నైవేద్యాలకు, పారువేట మహోత్సవాలకు మహా మండలేశ్వర జిల్లేళ్ళ కృష్ణమరాజయ్య వెంగళరాజు సమర్పించాడు.

—సోమపాలెం - మదనపల్లి తాలూకా. SII. 16.237, క్రీ. శ. 1559.

4. దానవులపాడు గ్రామానికి చెందిన పొలాలలో వచ్చే సగం ఆదాయాన్ని తలకంటిదేవికి సమర్పించవలసిందిగా ఆ దేవాలయ పూజారులైన తంబళ్ళు మొదటి దేవరాయలకు విన్నవించగా రాజు అంగీకరించి ఆ విధంగా అమలు చేయమని నాగప్ప దండనాయకునికి ఆజ్ఞ యిచ్చినట్లు ఒక శాసన ముంది.

—దేవిగుడి, జమ్మలమడుగు, SII. 16.2!, క్రీ. శ. 1406.

5. వరిగమడ్ల గ్రామంలో ఔదుంబి వంశానికి చెందిన తిరుమలేశ్వర నాయకుడు ఆరెమాంబికకు దేవాలయం, రంగమండపం కట్టించినట్లు ఎగువ రాచపల్లి (రాయచోటి తాలూకా) శాసనం చెబుతున్నది.

—కడప జిల్లా శాసనాలు II. 4, క్రీ. శ. 1445,

6. రాయసం వెంగళప్ప లక్ష్మీదేవమ్మ దేవతను ప్రతిష్ఠించి కొంత భూదానం చేసినట్లు మొయిళ్ళకాల్వ (కడప తాలూకా) శాసనం తెలియజేస్తున్నది.

—కడప జిల్లా శాసనాలు II. 139, క్రీ. శ. 1543.

పార్వతికి చెందిన వివిధ అంశలతో కనిపించే గ్రామదేవతలలో లక్ష్మీ దేవమ్మ చేరడం ప్రత్యేకంగా వుంది.

ఆంధ్ర దేశంలో 'ఆరెమాంబిక' అనే గ్రామదేవత ప్రసక్తి రాయలసీమ లోనే కనిపిస్తుంది. అరెమరాటీలు ఈ ప్రాంతానికి వలసవచ్చిన తరువాత ఇక్కడ ఈ గ్రామదేవత ఆరాధన ప్రారంభమైంది. ఇది క్రీ. శ. 13 శతాబ్ది నుండి జరిగిన సంగతి. అప్పటినుండి ఈ దేవతకు రాయలసీమలో అక్కడక్కడా చిన్న చిన్న దేవాలయాలు వెలిశాయి. ఆరెమాంబిక అప్పటినుండి గంగమ్మ, పోలేరమ్మ మొదలైన దేవతల వరుసలో చేరిపోయింది. ఇప్పుడు రాయలసీమలో ఈ గ్రామ దేవత దేవాలయాలున్న ప్రాంతాలలో అరెమరాటీలు స్థిరపడినట్లు ఊహించవచ్చు. పశ్చిమ చాళుక్యరాజ్యం అంతరించిన తరువాత అరెమరాటీలవలస ప్రారంభమైంది, వీరు కాకతీయులు కొలువులో చేరి వారిపక్షాన యుద్ధాలలో పాల్గొన్నట్లు చరిత్ర చెపుతుంది. 13వ శతాబ్దికి చెందిన ఒక శ్రీశైల శాసనంలో 'ఆరెభూమి' అనే మాట వుంది. ఆరెభూమి అనేది చరిత్రలో ఒక పాలనా విభాగంగా మారింది. ఇది శ్రీశైల పరిసర ప్రాంతాలలో వుండడానికి అవకాశముంది. ఆరెవీడు, అరవీటిపల్లి పేర్లతోగల గ్రామాలు కర్నూలు జిల్లా మార్కాపూర్ తాలూకాలోను; నెల్లూరు జిల్లా ఆత్మకూరు తాలూకాలోను; కడప జిల్లా జమ్మలమడుగు, రాయచోటి తాలూకాలలోను వుండడంవల్ల ఈ మూడు జిల్లాలలోని కొన్ని కొన్ని భాగాలను ఆరెభూమిగా పిలిచేవారని అర్థమవుతుంది.

రాయలసీమలో గ్రామ దేవతారాధనకు అనుబంధంగా 'వీరారాధన' క్రీ. శ. 7, 8 శతాబ్దాలనుండి ఉంది. కొన్ని పవిత్ర కార్యాలను సాధించడంలో ప్రాణాలు కోల్పోయిన వీరుల బొమ్మలను రాతిస్తంభాలపై చెక్కి శైవ దేవాలయాలలోను, ముఖ్యంగా గ్రామ దేవాలయాలలోను పెట్టి పూజించేవారు. ఇలాంటి బొమ్మలున్న శిలలను వీరశిలలు లేక వీరగల్లులు అని పిలిచేవారు. వీరశిలలను ప్రత్యేకంగా కూడా ప్రధాన కూడలి ప్రాంతాలలో నాటి పూజలు చేసేవారు. ఈ విషయాలను నిరూపించే శాసనాలెన్నో వున్నాయి. రాయలసీమ పశ్చిమ, దక్షిణ ప్రాంతాలను చోళులకు, చాళుక్యులకు సామంతులుగా పరిపాలించిన వైదుంబులు, బాణులు యుద్ధప్రీతి గల వారు. క్రీ. శ. 8వ శతాబ్దినుండి రాయలసీమలో కనిపించే అనేక శాసనాలలో ముఖ్యంగా వైదుంబరాజులు యుద్ధాలలో మరణించిన విషయాలు, అలా మరణించిన వారికి శిలాస్తంభాలు నాటించిన విషయాలు వున్నాయి. రాయలసీమలో మరొక పవిత్ర మతకార్యం కీల్గుంటె యుద్ధంలో మరణించిన వీరుని మృతశరీరం నేల

మీద పడడానికి ముందే ఆ వీరుని కొలిచే సేవకుడు నేలమీదపడే వీరుని శరీరాన్ని తన శరీరంమీద పడేటట్లు చేసుకొని వీరుని మృతశరీరంతో పాటు తాను కూడా కాలిపోవడం ఒక పవిత్రకార్యంగా భావించబడింది. ఈ కార్యానికి 'కీల్గుంటె' అని పేరు. కీల్గుంటె చేసిన వీరుని బొమ్మను కూడా రాతిస్థంభంపై చెక్కి దేవాలయం నిర్మించి అనేక దానాలు చేసినట్లు శాసనాలు చెపుతున్నాయి. ఇప్పటికీ శ్రీశైలం, శ్రీ కాళహస్తి దేవాలయాలలో ఇలాంటి వీరగల్లులు కనిపిస్తాయి. ఆనాటి ప్రజలు వీరగల్లులను స్థానిక గ్రామ దేవతతోపాటు పూజించేవారు. ఈ వీరారాధన రాయలసీమ నుండి పల్నాడు ప్రాంతానికి వ్యాపించింది. ఈ వీరారాధన శాసనాల నుండి సాహిత్య గ్రంథాలకెక్కింది. జక్కన విక్రమార్క చరిత్రలోని "నిరవధిక భక్తి రసాతిశయ ప్రణవోపహార సమర్పణ మహావీరవర శిలాప్రతిరూపంబుల వలనను" అనే గద్యభాగం ఈ విషయాన్ని నిరూపిస్తుంది.

రాయలసీమలో 'శక్త్యారాధన' ప్రాచీనకాలం నుండి ప్రచారంలో వున్నట్లు తెలుస్తుంది. దీనిని నిరూపించే శిలలు కడప జిల్లాలోని దేవగుడి గ్రామంలో గల తలకంటీశ్వరి దేవాలయంలో వున్నాయి. ఈ శిలలలో సప్తమాతృకల శిలలు, ఇతర స్త్రీ దేవతల శిలలు కనిపిస్తాయి.

రాయలసీమ గ్రామాల్లో సప్తమాతృకల, సప్త కన్నెకల ప్రస్తావన వినిపిస్తుంది. సప్త మాతృకలు సప్తర్షుల భార్యలుగా భావింపబడుతున్నారు. వీళ్లు కుమారస్వామికి స్తన్యమిచ్చి పోషించినట్లు జానపదుల విశ్వాసం, సప్తమాతలు కుమారస్వామిని పోషించినట్లు అన్నోదకాలిచ్చి తమను కాపాడతారని ప్రజల విశ్వాసం. అందుకే గ్రామదేవతల గుడులలో సప్తమాతృకల శిలలను పెట్టి పూజించడం ప్రారంభమైంది. ఇది ప్రాచీనమైనప్పటికీ 13వ శతాబ్ది నుండి సప్త మాతృకారాధన ఉండినట్లు తలకంటీశ్వరి దేవాలయంలోని సప్తమాతృకల విగ్రహాలను బట్టి తెలుస్తుంది. ఇప్పటికి కొన్ని శైవ దేవాలయాలలో సప్తమాతృకల విగ్రహాలు పూజలందుకొంటూ కనిపిస్తాయి.

కడప జిల్లా జమ్మలమడుగు తాలుకాలో 'కన్నెలూరు' అనే గ్రామముంది. ఈ గ్రామం సప్తకన్యకలను బట్టి ఏర్పడిందని మెకంజీ రికార్డులను బట్టి తెలుస్తుంది. దీనికి సంబంధించిన లోకనిరుక్తి ఇలా వుంది—

"పినాకినికి ఉత్తరంలో అరణ్యం వుండేది. బావిలో దివ్యోదకం ఉండేది. ప్రత్యూషంలో దేవకన్యలు కృతస్నానులు కావడానికి వచ్చేవారు. తెల్లవారేసరికి మాయమయ్యే వారు. ఆ ప్రాంతంలో అరణ్యం ఛేదించి పల్లె నిర్మాణం జరిగింది. దేవకన్యలు స్నానం చేసే బావిని కన్యల బావి అంటారు. గ్రామం పేరు కన్యలూరు."

"చెన్నారగ పూర్వమునిట, కన్నెలు వసియించు చుండ్రి
దేవకన్యల వోలెన్, అన్నారులు కలుగుటచే, అన్నా [illegible]యింత్రు
కన్నెలూరను పేరన్" (కన్నెలూరు గ్రామస్థులు చెప్పిన చాటువు)

కన్నె అంటే - కొండ ప్రాంతంలో కేవలం రాళ్లుండే ఎత్తయిన ప్రదేశం. ఈ గ్రామ నైసర్గిక స్థితికూడా దీనికనుకూలంగానే ఉంది.

నూతనంగా చెరువును నిర్మించినపుడు గాని, బావిని తవ్వినపుడు గాని గంగశిలను ప్రతిష్ఠించడం అన్ని ప్రాంతాల్లో కనిపించే విషయం. చెరువుకట్టమీద, బావికి సమీపంలో ఇప్పటికీ కొన్ని బండలు కనిపిస్తాయి. బావి తవ్వడం ప్రారంభించినపుడే ఒక బండను ప్రతిష్ఠించి గంగదేవతగా కొలుస్తారు. బావిలో త్వరగా నీళ్లు పడాలని, బావి ఎల్లప్పుడూ నీటితో సమృద్ధిగా వుండాలని మొక్కుకుంటారు. బావి తవ్వడం పూర్తి అయిన తరువాత గంగశిలను పసుపు కుంకుమాక్షతలతో పూజించి పొంగలి పెడతారు. నైవేద్యంగా పొట్టేలును బలి యిస్తారు. ఆ సందర్భంలో బావి పనిచేసిన బోయీలలో ప్రధాన బోయునికి గుడ్డలు పెట్టి సత్కరిస్తారు. అక్కడ వండిన పొంగలిని, బలిచేసిన పొట్టేలును అతనికే యిస్తారు. అతడు ఇతర కూలీలు కలసి అక్కడే విందు చేసుకొంటారు. దీనివల్ల గంగదేవత అయిన నీటిదేవతను శాంతపరచడమే కాకుండా కూలీలను కూడా తృప్తి పరచినట్లవుతుంది. చెరువులను నిర్మించినపుడు కూడా ఇలాంటి తంతు జరుగుతుంది. రాయలసీమ ప్రాంతంలో మొన్నమొన్నటివరకు ఇలాంటి విశేషాలు కనిపించేవి. ఇప్పుడు బావులు తవ్వడానికి బదులు 'బోర్‌వెల్స్' వేస్తున్నారు. ఉన్న చెరువులనే రక్షించుకోలేని పరిస్థితి ఎదురౌతున్నది. రాయలసీమలో బావుల చెరువుల పనులు చేసేవారంతా వడ్డికులస్థులు. వీళ్ళను వడ్డెబోయిలు అంటారు.

# 7. ఆంధ్రుల చరిత్ర - సాంస్కృతిక సమ్మేళనం

ఆంధ్రదేశంలో చారిత్రక దశ మౌర్యులతోనే ప్రారంభమైంది. మౌర్యుల పరిపాలనకు సంబంధించిన వివిధ అంశాలను కాలక్రమంగా పరిశీలించడానికి ఆధారాలున్నాయి. ఆంధ్ర దేశంలోనే కాక భారత దేశమంతటా మొట్టమొదట శాసనాలు వేయించినవాడు అశోకుడు. ఈ శాసనాలు ఆ కాలం నాటి మత సాంఘిక సాంస్కృతిక విషయాలను తెలుపుతాయి. ఆంధ్రదేశం అశోకుని కాలంనాటి మౌర్య సామ్రాజ్యంలో అంతర్భాగం. ఆంధ్రదేశంలో అశోకుని కాలం నుండి చరిత్రయుగం ప్రారంభమైనట్టు చారిత్రకుల అభిప్రాయం. కర్నూలు జిల్లాలోని ఎర్రగుడి వద్ద దొరికిన అశోకుని శిలాశాసనాలే దీనికి నిదర్శనం. అశోకుడు బౌద్ధ ధర్మాలను ఆచరించినవాడు. దేశ ప్రజలందరిని బౌద్ధులుగా మార్చాలని ఆయన ఉద్దేశం కాదు. ప్రజలందరూ జీవకారుణ్య సిద్ధాంతంమీద ఆధారపడిన బౌద్ధమత సూత్రాలను తెలుసుకోవాలని ఆకాంక్షించాడు. అందుకే దేశంలోని వివిధ ప్రాంతాలలో గండశిలలపై తథాగతుని బోధనలను తనకర్థమైన రీతిలో చెక్కించాడు. అప్పటినుండి ఆంధ్రదేశ చరిత్రలో జరిగిన భిన్న సంఘటనలకు అశోకుని శాసనాల కాలం ఆధారంగా కాలనిర్ణయం చేసే అవకాశం కలిగింది. దేశచరిత్రలోని భిన్నాంశాలు కాలనిర్ణీతములైనప్పుడే చారిత్రక విషయాలుగా చలామణి అవుతాయి. ఈ దృష్టిలో ఆంధ్ర దేశంలో చారిత్రకదశకు అశోకుని కాలంనుండి అంకురార్పణ జరిగినట్లు భావించాలి.

అశోకుడికి ముందు ఆంధ్రదేశానికి చరిత్ర వుంది. అయినా అదంతా చరిత్ర పూర్వయుగానికి సంబంధించినది. చరిత్ర పూర్వయుగం నాటి ఆంధ్రదేశ స్థితిగతులను తెలుసుకోడానికి కావలసిన ఆధారాలు అంతగా లేవు. అశోకుడికి ముందు ఆంధ్రదేశంలో సంస్కృత సాహిత్యం ఉందని చెప్పడానికి కూడా తగిన ఆధారాలు లేవు. అయినా వైదిక మత విశ్వాసాలున్నాయి. వైదికమతం ఋగ్వేద ఆర్యులచే

రూపొందింపబడింది. ఆర్యుల మతమే వైదిక మతం. ఆర్యుల నివాసం ఉత్తర భారతంలోని ఆర్యావర్తం. అక్కడనే వారు కర్మకాండతో కూడిన వైదిక మతాన్ని రూపొందించారు. అక్కడ నుంచి వైదిక మతం దక్షిణ భారతదేశానికి వచ్చింది. ఇదంతా బౌద్ధమతావిర్భావానికి ముందే జరిగింది. క్రీ.పూ. 6వ శతాబ్దంలో బౌద్ధం ఏర్పడినప్పటికి దేశంలోని జనసాంద్రతగల ప్రాంతాలన్నిటా వైదికమత విశ్వాసాలు పాదుకొని వున్నాయి. వైదిక మతంలోని కర్మకాండకు నిరసనగా పుట్టినది బౌద్ధం. బౌద్ధంలో జంతుబలులు స్వర్గ నరకాలు లేవు. సర్వప్రాణులు సమానమని, అహింస పరమధర్మమని బుద్ధుడు బోధించాడు. ఈ మతం కరుణా ప్రవృత్తి కలవారందరికీ నచ్చింది. క్రమక్రమంగా ఉత్తర భారతమంతా వ్యాపించింది. దక్షిణ ప్రాంతానికి తరలి వచ్చింది. ఆంధ్రదేశంలో కూడా అడుగు పెట్టింది. అప్పటినుండీ ఆంధ్రదేశ ప్రజల మత విశ్వాసాలలో మార్పులు కనిపించాయి.

అప్పటికీ సంస్కృతం పండిత భాషగా, ప్రాకృతం ప్రజల భాషగా లోక వ్యవహార భాషగా ఉండినట్లు చెప్పడానికి ఎన్నో నిదర్శనాలున్నాయి. బౌద్ధం వైదికమతంలాగా వర్ణవ్యవస్థను పాటించలేదు. ఈ కారణంచేత సంఘంలో బౌద్ధానికి ప్రచారం అధికమైంది. వర్ణనిరపేక్షంగా ప్రజలు బౌద్ధమత విశ్వాసాలపై శ్రద్ధ చూపారు. ఆ నాటి వ్యవహారభాష (ప్రాకృతం)లోనే బౌద్ధమత సిద్ధాంతాలు ప్రచారం చేయబడినాయి. తరువాత వచ్చిన బౌద్ధమత సాహిత్యమంతా ఆనాటి వ్యవహార భాషలైన పాళి, ప్రాకృతాలలో కనిపించింది. ప్రాకృతం రాజభాష అయింది. గుప్తులకాలం వరకు శాసన భాష కూడా ప్రాకృతమే. దేశంలో బౌద్ధానికి ఎనలేని ఆదరణ కలగడంతో ప్రాకృతానికి కూడా విశేషమైన ప్రాచుర్యం లభించింది. బుద్ధుని కాలంవరకు దేదీప్యమానంగా వెలిగిన వైదికమతం బౌద్ధ మతావిర్భావం తరువాత నివురుగప్పిన నిప్పువలె వ్యక్తావ్యక్తంగా వుండవలసి వచ్చింది. ఆంధ్రదేశంలో కూడా వైదికమత విశ్వాసాలు బౌద్ధమత విజృంభణతో చిక్కి శల్యమైపోయాయి. ఆంధ్రదేశానికి బౌద్ధం అశోకుని కాలంలోనే దిగుమతి అయినట్లు మొన్నమొన్నటి వరకు విశ్వసించేవారు. ఇటీవల జరిగిన పరిశోధనల ఫలితంగా బౌద్ధం అశోకుడి కంటె సుమారు వంద సంవత్సరాలకు ముందే ఆంధ్ర దేశంలో వ్యాపించినట్లు తెలుస్తున్నది.

బౌద్ధం ఆంధ్రదేశానికి రాకపూర్వం ఇక్కడ వ్యాప్తిలో వుండిన మత విశ్వాసాలను, ఆచార వ్యవహారాలను పరిశీలించవలసి వుంది. బౌద్ధం ఆంధ్రదేశ ప్రజలపై ప్రభావం చూపకముందు వారి ఆలోచనలెలా వుండేవో తెలుసుకోవడం అవసరం. ప్రాచీన సంస్కృత సాహిత్యాన్ని పరిశీలిస్తే ఆంధ్రదేశం దట్టమైన అడవులతోను, రాక్షసుల గుంపులతోను వుండినట్లు అర్థమవుతుంది. రామాయణం నాటి దండకారణ్యంలో ఆంధ్రదేశ ఉత్తర ప్రాంతమంతా వుంది. శ్రీరాముడు వధించిన ఖరదూషణాది రాక్షసుల నివాసం ఇక్కడే. జనావాసాలు అతితక్కువగా వుండేవి. ఇక్కడ వుండిన జనులంతా అసుర సంతతివారని పురాణాలు చెపుతాయి. ఈ అసురులలో నాగులు, యక్షులు మొదలైన వాళ్ళు వుండేవారు. వీళ్లను ఆనాటి సంస్కృత సాహిత్యం అనార్యులుగా పరిగణించింది. అనార్యులైనా ఇక్కడ వారికందరికీ ఒక రకమైన సంస్కృతి వుండేది. అది ఆర్య సంస్కృతికి భిన్నం. ఇక్కడ ఆర్య సంస్కృతిని ప్రవేశపెట్టిన మొదటివాడు శ్రీరాముడు. దశరథుని తనయుడైన ఇతడు సీతా లక్ష్మణులతో వనవాసార్థం ఇక్కడికి వచ్చి రాక్షసులెందరినో వధించాడు. రాక్షసుల భయం పోయిన తరువాత ఎందరో మహర్షులు ఆశ్రమవాటికలు నిర్మించుకొని తపోవృత్తి చేపట్టినారు. ఆశ్రమాలు ధర్మానికి నిలయాలుగా, విద్యాలయాలుగా వర్థిల్లినాయి. ఇది ఆర్య సంస్కృతికి రూపం. ఇక్కడి ప్రజలు తమ సహజ ప్రవృత్తితో ప్రవర్తించడంవల్ల అప్పటికి అక్కడ నివసిస్తూ వుండిన ఆర్యులకు ఎన్నో బాధలు కలిగాయి. కొంతకాలానికి ఇక్కడ ఆర్యుల అనార్యుల అభిప్రాయాలలో, విశ్వాసాలలో ఏకరూపత సిద్ధించింది. ఇక్కడి అనార్యులు కొంతకాలం తరువాత ద్రావిడులుగా పిలవబడినారు.

నేటి ఆంధ్రదేశంలో ఆర్యుల సంస్కృతి వేరుగా ద్రావిడుల సంస్కృతి వేరుగా లేదు. ఆంధ్రదేశమంతా కనిపించే సజీవ సంస్కృతి భారతీయ సంస్కృతి. భారతీయ సంస్కృతిలో ఎన్నో మతాల విశ్వాసాలు, ఎన్నో తెగల ఆచార వ్యవహారాలు కలిసి పోయాయి. చారిత్రక భిన్నకాలాల్లో భిన్న సంస్కృతులమధ్య ఏర్పడిన సామరస్య ధోరణి ప్రజల మానసాలను ఏకం చేసి వారిలో భారతీయాత్మను ఆవిష్కరించినట్లు గమనించవచ్చు. ఆంధ్రుల సంస్కృతి భారతీయ సంస్కృతిలో ఒక భాగమైనా, భిన్నం కాకపోయినా దీని ప్రత్యేకత దీనిది. ఆ ప్రత్యేకతలో భారతీయ సంస్కృతికి చెందని అంశాలేవీ లేవు. భారతీయ

సంస్కృతికి వలె ఆంధ్రుల సంస్కృతికి కూడా భారత భాగవత రామాయణాలు, భగవద్గీతోపనిషత్తులు ఆధార గ్రంథాలు. ప్రస్థానత్రయానికి ఆంధ్రదేశంలో కూడా ఎనలేని గౌరవం వుంది. ఈనాటి ఆంధ్ర సంస్కృతిలో హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ మత విశ్వాసాలు సమన్వయం పొందాయి. భిన్న మత విశ్వాసాల సమన్వయం సంస్కృతికి ఒక గొప్ప లక్షణం. ఈ లక్షణం భారతీయ సంస్కృతిలో వుంది. ఆంధ్ర సంస్కృతికి గల సహనం ఎంతో గొప్పది. సహనమే సంస్కృతి. ఆంధ్ర సంస్కృతిలో ఈ సహనశీలత ఏర్పడడానికి పునాదులుగా కొన్ని చారిత్రక దశలున్నాయి. ఈ దశలను విశ్లేషిస్తే ఆయా కాలాలనాటి ఆంధ్రుల సంస్కృతి పొందిన పరిణామ దశను గమనించవచ్చు. చారిత్రకంగా పరిశీలిస్తే ఆంధ్రదేశంలో ఆర్య అనార్యుల భావసమ్మేళనం, వైదిక బౌద్ధ మత విశ్వాసాల పరస్పర సమన్వయం, హిందూమహమ్మదీయ సంస్కృతీ సమ్మేళనం, ఆంధ్ర సంస్కృతిపై పాశ్చాత్య సంస్కృతి చూపిన ప్రభావం అనే నాలుగు దశలు ప్రధానంగా కనిపిస్తాయి. ఈ నాలుగు దశలకు సంబంధించిన చరిత్ర ఎంతో వుంది. ఆ చారిత్రక నేపథ్యం నుండి భిన్న సంస్కృతులు ఆంధ్ర సంస్కృతిపై చూపిన ప్రభావాన్ని పరిశీలించవలసి ఉంది.

**1. ఆర్య అనార్యుల భావ సమ్మేళనం :**

దక్షిణ దేశంలో ప్రాచీనకాలం నుండి నివసిస్తూ వుండిన జాతులవారందరూ ఉత్తర దేశం నుండి వచ్చినవారని పండితుల అభిప్రాయం. ఆంధ్రదేశం దక్షిణాపథంలో ఉంది. దక్షిణాపథమంతా రామాయణకాలం వరకు పెద్ద అరణ్యం. ఇదే దండకారణ్యం. శ్రీరాముడు దండకారణ్యంలోని రాక్షసులను చంపి లంకకు వెళ్ళి రావణవధ చేసిన తరువాత ఆంధ్ర ప్రాంతంలో వైదిక మతానుయాయులైన ఆర్య ఋషులు వలసలు స్థాపించుకొన్నారు. అప్పటినుండి ఆంధ్రదేశంలో వర్ణవ్యవస్థ రూపొందింది. వైదికవాఙ్మయం అభివృద్ధి పొందింది. ఉత్తరభారతం నుండి దక్షిణానికి వలసవచ్చిన కొన్ని తెగలు సంస్కృత ప్రాకృత సాహిత్య గ్రంథాల ద్వారా తెలుస్తున్నాయి. ఆంధ్రదేశంలో నివాసమేర్పరచుకొన్న అలాంటి తెగలలో అశ్మక ముళకములు ముఖ్యమైనవి. అశ్మకమునకు పోదననగరం, ముళకమునకు ప్రతిష్ఠానం రాజధానులు. అశ్మక దేశాధిపతి అంధక రాజు. అంధక పదం ఆంధ్రానికి ప్రాకృత

రూపం కావడంచేత అశ్మకం ఆంధ్రుల వలస అని చెప్పవచ్చు. ముళకం కూడా ఆంధ్రుల వలస ప్రాంతమే. ఈ రెండూ ఇరుగు పొరుగు దేశాలు. కొన్ని శతాబ్దాల తరువాత ముళకులు దక్షిణంగా కడప జిల్లా ప్రాంతానికి వచ్చి స్థిరపడడంచేత ఆ ప్రాంతానికి 'ములకనాడు' అని పేరేర్పడింది. వీరితోపాటు ఇప్పటి తెలంగాణా ప్రాంతంలో వలసలు స్థాపించుకొన్నవారు నలులు, క్షాత్రకులు. ఇలా ఇంకా కొన్ని తెగలవారు వచ్చారు. వీరిలో ఆంధ్రులు ఒక తెగవారు. మహాభారత కాలం నాటికి ఈ తెగలన్నీ వివిధ జనపదాలలో ఉండేవి. ధర్మరాజు రాజసూయ యాగం చేసిన సందర్భంలో సహదేవుడు జయించిన వారిలో ఆంధ్రులున్నారు. వీరు కురు క్షేత్ర యుద్ధంలో కౌరవపక్షాన పోరాడారు. ఈ తెగల పరిపాలకులంతా రాజులుగా చెలామణి అయ్యారు.

ఉత్తరం నుండి వచ్చిన ఆర్య జనులకంటె అప్పటికే ఇక్కడ వుండిన దేశీయుల సంఖ్య అధికంగా వుండేది. వీరికొక సంస్కృతి వుండేది. అది ఆర్య సంస్కృతికంటె అంత గొప్పది కాకపోవచ్చు. వీరిని చరిత్రకారులు ద్రావిడులని పిలిచారు. ద్రావిడులు అంటే తరమబడినవారని, పరుశరామునిచే ఓడి పారిపోయిన క్షత్రియ జాతివారే ద్రావిడులని మహాభారతంలో చెప్పబడింది. వీరు అనార్యుల నడుమ, వానరుల నడుమ నివసిస్తూ వర్ణాశ్రమ ధర్మాలను పాటించక పోవడంతో మ్లేచ్ఛులైనారని భారతం చెపుతున్నది. ఆర్యులు దక్షిణ ప్రాంతానికి వచ్చిన తరువాత ద్రావిడుల జీవన విధానంలో కొన్ని మార్పులు వచ్చాయి. ఒకే ప్రాంతంలో నివసించడం మూలాన ఆర్యులు ద్రావిడాచారాలను, ద్రావిడులు ఆర్యుల ఆచార వ్యవహారాలను అవలంభిస్తూ వచ్చారు. ఈ విధంగా ఆర్య-ద్రావిడ సభ్యత రూపొందింది. ఆర్య మతాచారాలను అవలంభిస్తూ వచ్చిన ఆర్యేతరు లందరూ ఆనాటి సంఘంలో చతుర్థవర్ణంగా ఏర్పడినారు. ఆంధ్ర దేశంలో వైదికా చారాల సంస్కృతి ప్రబలింది. వర్ణవ్యవస్థ పూర్తిగా రూపొంది స్థిరపడింది. బ్రాహ్మణులు వైదిక కర్మలనెక్కువగా చేస్తూవచ్చారు. గాంధర్వ వేదం, ధను ర్వేదం, ఆయుర్వేదం, స్థాపత్యవేదం అనే నాలుగు రకాల విద్యలకు ప్రాధాన్య మేర్పడింది. ఇవి ఉపవేదాలుగా పరిగణింపబడినాయి. ఈ విద్యలన్నీ బ్రాహ్మణుల స్వాధీనంలో ఉండేవి. వ్యవసాయ కృషిలోను, పశుపాలనలోను, పరిపాలనలోను, ఆర్యజనులు చతురులు. చేతిపనులలో దేశీయులు ఎంతో నేర్పరులు. ఉభయులు కలసి

గ్రామాలలో నివసిస్తూ వచ్చినా వివేకం, నాగరికత, పాలనానైపుణ్యం ఎక్కువ గలవారు కావడంచేత సంఘంలో ఆర్యులకే ఎక్కువ పలుకుబడి ఉండేది.

ద్రావిడుల మత విశ్వాసాలు తరువాత తరువాత వైదిక మతంలో భాగమైనప్పటికి మొదట్లో ఆర్యుల మత విషయాలకు భిన్నంగా ఉండేవి. ఋగ్వేదాది గ్రంథాలలో ఆర్యులకంటె భిన్నులైనవారు దక్కను ప్రాంతంలో ఉండినట్లు కనిపిస్తుంది. వీరు ఆర్యేతరమైన నాగరకత కలిగి బలవంతులై ఉండినట్లు ఋగ్వేదమే సాక్ష్యమిస్తున్నది. వీరికి కోటలు, సైన్యం ఉండేవి. యుద్ధ తంత్రం, వ్యూహరచన వీరికి తెలుసు. క్రీ. పూ. 3 వ శతాబ్దంలో శాతవాహనరాజులు ఆంధ్ర రాజ్యాన్ని స్థాపించేనాటికి ఇక్కడ ఒక స్థిరమైన పాలనావ్యవస్థ ఉండినట్లు బౌద్ధ సాహిత్యం చెపుతున్నది. ప్రాచీనాంధ్ర దేశంలో నివసించిన వారిలో నాగజాతివారు ముఖ్యులు. కృష్ణానదీ తీరంలో ఒక నాగరాజు రాజ్యపాలన చేసినట్లు బౌద్ధగాథలను బట్టి తెలుస్తుంది. వీరు పాములను పూజించడంచేత నాగులుగా పిలువబడినారు. అప్పటికే ప్రచారంలో ఉండిన నాగన్న, నాగయ్య, నాగమ్మ మొదలైన వ్యక్తినామాల వల్ల; నాగవరం, నాగులపాడు మొదలైన స్థలనామాల వల్ల నాగులకు ఆంధ్రదేశంతో గల సంబంధం అర్థమవుతుంది. ఇప్పటికీ మనకు కనిపించే నాగారాధన దీనికి ప్రబల సాక్ష్యం. కార్తీక శుద్ధచవితి మనకు నాగులచవితి. ఆ పండుగరోజు స్త్రీలు పాముపుట్టలో పాలు పోస్తారు. పుట్టదగ్గర దీపం పెట్టరు. నాగారాధన ఆర్య సంస్కృతిలో అప్పటికి లేదు. ఆర్య అనార్య భావ సమ్మేళనం కారణంగా బ్రాహ్మణులు నాగారాధనలో పాల్గొనడం కనిపిస్తుంది. శిలలను వృక్షాలను పూజించే పద్ధతి ఆర్యులలో ఉంది. సర్ప శిలలను. వేపచెట్లను పూజించడం అప్పటి దేశీయ సంస్కృతి. నాగజాతివారు వేపచెట్టును ఆరాధించడానికి ఆరోగ్యకరమైన కారణం కూడా ఉంది. వేప ఔషధ ప్రక్రియకు ఉపయోగపడే వృక్షం. దీని ఆకులు, ఈనెలు, బెరడు, వేళ్ళు క్రిమి సంహారకాలు. వేపచెట్టుగాలి చల్లగాను, ఆరోగ్యకరంగాను వుంటుంది. ఉగాది పండుగనాడు తెలుగువాళ్ళు వేపపూవును బెల్లంతో కలిపి తింటారు. గ్రామదేవతల పూజా విధిలో వేపకు స్థానముంది. శుభ సమయాల్లో మామిడి తోరణాలు కనిపించినట్లు వ్యాధులు చెలరేగినప్పుడు వేపమండలు ప్రత్యక్షమవుతాయి. అనంతర కాలంలో దేశీయులు ఆర్యులు ఒండొరుల ఆచారాలను కలబోసుకొని సమిష్టి సంస్కృతిని సృష్టించుకొన్నారు. ఆర్యులకు రావిచెట్టు

జమ్మిచెట్లు పవిత్రం. యజ్ఞ సమయాల్లో అగ్గిని పుట్టించడానికి వీరు అశ్వత్థ వృక్షంలో మొలిచిన జమ్మి వృక్షశాఖతో అరణులను తయారు చేసుకొనేవారు.

చరిత్రయుగంలో నాగులు ప్రముఖ పాత్ర వహించారు. మౌర్యులకు, నందులకు ముందు మగధను పాలించిన శిశు నాగవంశం వారు నాగజాతివారని కొందరి అభిప్రాయం. క్రీ. శ. 2 వ శతాబ్దిలో విదేశీయులైన కుషాణుల పరిపాలనను అంతంచేసి ఆర్య ధర్మాలను పునఃప్రతిష్ఠించిన వారు భారశివనాగులు. వీరు గంగానది ఒడ్డున పది అశ్వమేధాలు చేసిన ప్రదేశం దశాశ్వమేధ ఘట్టమని పిలవబడుతున్నది. కృష్ణానదీ తీరంలో ఆంధ్ర ప్రాంతాన్ని పాలించిన నాగరాజుపేరు నిశంభుడు. ఇతడు ఆ ప్రాంతపు ప్రజలను హింసించే దానవుడు కావడంతో సుచంద్రుని కొడుకైన ఆంధ్ర విష్ణువు ఇతనిని చంపి నిష్కంటకమైన ఆంధ్ర రాజ్యాన్ని స్థాపించినట్లు బ్రహ్మాండ పురాణంలో ఒక కథ వుంది. ఆంధ్రవిష్ణువుకు ఈ సమయంలో దేవతలు తోడ్పడినట్లు ఈ కథలో చెప్పబడింది. ఆంధ్రవిష్ణువు స్థాపించిన ఆంధ్రరాజ్యానికి నాలుగువైపులా శివుడు త్రిశూలపాణియై తన ప్రమథ గణాలతో నిలిచి రాజ్యాన్ని రక్షించినట్లు కూడా పై కథాంశమే. ఈ కథను బట్టి ఆనాటి ఆంధ్రదేశంలో నాగారాధనతో పాటు శివారాధన కూడా ఉండినట్లు తెలుస్తుంది. శివుని భావన యక్షులనుండి ఆంధ్రులలో వ్యాపించి ఉంటుంది. శివుడు ఇక్కడి ప్రజల వేలుపు. కొండజాతులవారు బరువులను మోయడానికి ఉపయోగించే వృషభం అతని వాహనం. అతని భార్య పార్వతి. ఈమె కొండప్రాంతం వారు కొలిచే కాళికారూపం. ఆర్యుల ఆరాధనలో రుద్రభావం ఉంది. రుద్రుడు ఉగ్రస్వరూపుడు. అతడు రోగాలను, అరిష్టాలను, మృత్యువును తొలగిస్తాడని నమ్మేవారు. ఆర్యులు అనార్యులు ఒక ప్రాంతంలో నివసిస్తూ కష్ట సుఖాలలో భాగస్వాములు కావడంచేత వారిలో సమన్వయం ఏర్పడింది. శివుడు, రుద్రుడు ఒకే మూర్తిగా పరిణామం చెందారు. అనంతర కాలంలో శివరుద్రులు ఒకే మూర్తిగా కలిసిపోయి మహేశ్వరుడుగా రూపొందడం జరిగింది. నాగులు కొలిచే కాళి ఈశ్వరుని భార్య అయింది. నాగులు పూజించే సర్పాలు శివుడి భూషణాలయ్యాయి. ఈ రకంగా ఆర్య మత ప్రభావం అనార్యుల మీద, అనార్యుల విశ్వాసాలు ఆర్యుల మీద ప్రసరించి భావసమ్మేళనం ఏర్పడింది. వారు పరస్పర విరోధాలు మాను కొన్నారు. ఆర్య మత భావాల సంపర్కంతో నాగులు మొదలైనవారు తమ క్రూరాచారాలను విడిచి సత్వ స్వభావులైనారు.

ఈ భావ సమ్మేళనం అశోకుడు ఆంధ్రదేశాన్ని తన సామ్రాజ్యంలో కలుపు కోడానికి ముందే ఏర్పడింది. ఆర్య అనార్యుల భావ సామ్యం అశోకుడికి బాగా ఉపయోగపడింది. అశోకుడు ఆంధ్రదేశానికి రాకపూర్వమే ఇక్కడ బౌద్ధ స్థూపాలు ఉండినట్లు, బౌద్ధం విశేషమైన ఆదరణను పొందినట్లు భట్టిప్రోలు వద్ద దొరికిన శాసనాలను బట్టి చెప్పవచ్చు. భట్టిప్రోలు శాసనాలకాలం సుమారు క్రీ. పూ. 4వ శతాబ్దం. ఈ శాసనాలలో కుబేరకుడనే ఒక రాజు ప్రస్తావన వుంది. ఈ కుబేరకుడు సింహగోష్ఠికి నాయకుడని, అతని అనుమతిపై భట్టిప్రోలు బౌద్ధ సంఘానికి కొన్ని దానాలు చేయబడి నాయని తెలుస్తున్నది. 'కుబేరక' అనే పేరు యక్షులను గుర్తు చేస్తుంది. ఇతడు యక్షులకు అధిపతియై ఉంటాడు. కుబేరకుని సింహగోష్ఠి యక్షుల గణమై ఉంటుంది. యక్షులు శివారాధకులు. వీరి ద్వారా శైవం ఆంధ్రదేశంలో వ్యాపించి వుంటుంది. ఆ తరువాత శివతత్వం, రుద్ర తత్వం కలిసి ఈశ్వర తత్వంగా రూపొంది ఉండవచ్చు. ఈ కారణంగా ఆర్య ఆర్యేతర భావాలు మిశితమై వైదిక మతానికి ప్రాధాన్యం ఏర్పడింది. అప్పటికి అక్కడ వ్యాప్తిలో ఉండిన దేశీయాచారాలు, విశ్వాసాలు వైదికమతంలో అంతర్వాహినులయ్యాయి. తరువాత ఆంధ్రదేశాన్ని పాలించిన అనేక మంది రాజులలో మత సహనాన్ని పెంపొందించ డానికి ఇది ఎంతో దోహదం చేసింది.

## 2. వైదిక బౌద్ధ మత సమ్మేళనం:

బౌద్ధం అశోకుడికంటె ముందే ఆంధ్ర దేశంలో ప్రచారం చేయబడిందని చెప్పడంలో సందేహం లేదు. ఆంధ్ర దేశంలోని బౌద్ధ కట్టడాలను పరిశీలిస్తే భట్టిప్రోలు స్థూపమే మొదటిదిగా కనిపిస్తుంది. ఇక్కడ దొరికిన పది చిన్న శాసనాలు అశోకునికి పూర్వం ఇక్కడగల బౌద్ధ మత వ్యాప్తిని నిరూపిస్తాయి. భట్టి ప్రోలులో బుద్ధుని శరీర ధాతువులను భద్రపరచిన ఒక స్ఫటికపు పెట్టె ఇటీవల జరిపిన త్రవ్వకాలలో బయట పడింది. ఈ పెట్టెను మరొక పెద్ద రాతిపెట్టెలో పెట్టి భూమిలో పాతిపెట్టడం జరిగింది. ఈ రాతిపెట్టె అడుగు భాగంలోను, మూత పైన చిన్నచిన్నవి పది శాసనాలు చెక్కబడినాయి. ఈ శాసనాల భాష ప్రాకృతం. లిపి బ్రాహ్మీ. ఈ శాసనాలలో కనిపించే లిపికి అశోకుని ఎర్రగుడి శాసనాలలోని లిపికి తేడా వుంది. అశోకుని లిపి ఆంధ్రదేశంలో తరువాత కూడా కొనసాగింది. భట్టిప్రోలు లిపి అదృశ్యమై పోయింది. దీనిని బట్టి అశోకుడి కాలం నాటికే ఆంధ్ర

దేశంలో ఒక లిపి సంప్రదాయం వుండేదని, అశోకుడు వాడిన మౌర్యలిపి ప్రభావానికి తట్టుకోలేక అది అదృశ్యమై పోయిందని ఊహించే అవకాశముంది. భట్టిప్రోలులో దొరికిన పది శాసనాలు దాతలు బౌద్ధ సంఘానికి చేసిన దాన వివరాల్లను తెలుపుతున్నాయి. కాబట్టి బౌద్ధం అశోకుడికంటె ముందే ఆంధ్రదేశానికి వచ్చినట్లు చెప్పవచ్చు. బౌద్ధం బుద్ధుని నిర్యాణానంతరం రెండుగా చీలిపోయింది. మొదటిది-థేరవాదుల సంఘం, రెండవది-మహా సాంఘికుల సంఘం. బుద్ధుని బోధనలను యథాతథంగా మార్పు లేకుండా అంగీకరించినవారు థేరవాదులు. మతంలో కాలక్రమానుగతమైన మార్పులను అంగీకరించినవారు మహా సాంఘికులు. మహా సాంఘికుల వలననే బౌద్ధం ఇతర ప్రాంతాలకు వ్యాపించింది. వీరు మతవ్యాప్తి, వ్యాపారం అనే ద్వంద్వ ప్రయోజనాలతో ఆంధ్రదేశానికి కూడా వచ్చారు. భట్టిప్రోలు శాసనాలలో కనిపించే సింహగోష్ఠి, వర్తక నిగమం మొదలైన పదాలు బౌద్ధుల వ్యాపార విషయాలను తెలుపుతాయి,

ఆంధ్రదేశం మౌర్య సామ్రాజ్యంలో విలీనం కాకముందే ఇక్కడ బౌద్ధ ధర్మం, వైదిక ధర్మం కలిసిపోయాయి. తరువాత నిర్మింపబడిన స్థూపాలలో కనిపించే శిల్పవిన్యాసంలో ఈ అంశం గోచరిస్తుంది. బౌద్ధ స్థూపాలు ఆంధ్ర దేశంలో ఎన్నో వున్నాయి. శాలిహుండం, రామతీర్థం (విశాఖపట్నం జిల్లా); అదుర్రు, కొడవలి, పిఠాపురం (తూర్పు గోదావరి జిల్లా): గుంటుపల్లి (పశ్చిమ గోదావరి జిల్లా); జగ్గయ్యపేట, నందిగామ, గుడివాడ, ఘంటసాల (కృష్ణా జిల్లా); భట్టిప్రోలు, అమరావతి, నాగార్జున కొండ, గరికపాడు, గోలి, చిన గంజాం. పెద గంజాం (గుంటూరు జిల్లా) మొదలైన ప్రదేశాలలో బౌద్ధ స్థూపాలు నిర్మింపబడినాయి. వీటన్నిటిలో అమరావతి వద్ద నిర్మించిన స్థూపం చాల పెద్దది. ఆంధ్ర దేశంలో భట్టిప్రోలు, అమరావతి, నాగార్జునకొండ స్థూపాలు బుద్ధుని ధాతువులమీద నిర్మింపబడినాయి. వీటిలో కొన్ని శాతవాహనుల కాలం నాటివి. శాతవాహన యుగం బౌద్ధ మత చరిత్రలో ఉజ్జ్వల ఘట్టం. ఈ యుగపు శిల్పకళ అంతా బౌద్ధ కళ. ఈ స్థూపాలపై చెక్కబడి కనిపించే భిక్షుక భిక్షుకీ గణం, జాతక గాథలను వివరించే బొమ్మలు అజరామరంగా నేటికీ నిలిచి ఉన్నాయి.

బుద్ధుని నిర్యాణానంతరం సుమారు మూడు నాలుగు వందల సంవత్సరాలకు ఆంధ్రదేశంలోని బౌద్ధ శిల్పాలలో యక్షులు, ఖేచరులు మొదలైన వారి బొమ్మలు

కనిపించాయి. బుద్ధుడు దేవుడుగా ఆరాధింపబడిన కాలంలో వీళ్ళంతా పరివార దేవతలైనారు. ఈ యక్షులే శైవమతాన్ని ఆంధ్రదేశంలో వ్యాపింపజేసి వుంటారు. బుద్ధుని ధాతు నిక్షేపాలపై నిర్మింపబడిన స్థూపాలు కొంతకాలం తరువాత బౌద్ధ సన్యాసులకు ఆరాధన మందిరాలయినాయి. బుద్ధుని పాలరాతి విగ్రహాలు ఈ మందిరాలలో పూజ లందుకొన్నాయి. ఈ సందర్భంలో వైదిక బౌద్ధాలకు కొంత సంబంధమేర్పడింది. వేపచెట్టును పూజించడం, వేపచెట్టు కింద నాగశిలలను ప్రతిష్ఠించడం ఆంధ్రుల ఆచారంగా ఉండి తరువాత వైదికంలో కలిసిపోయింది. బుద్ధునికి జ్ఞానోదయమైంది రావిచెట్టు కింద. అందుకే బౌద్ధంలో రావిచెట్టుకు ప్రాధాన్యత వుంది. ఒకే పాదిలో రావిచెట్టును వేపచెట్టును ఒకటిగా పెంచడం ఆనాటి ప్రజల ఆలోచనలలో ఏర్పడిన బౌద్ధ వైదిక సమ్మేళనం. నాగారాధన బౌద్ధంలోకి ప్రవేశించింది. అమరావతి స్థూప శిల్పాలలో బుద్ధుని శిల్పం వెనుక సర్పం నాలుగైదు పడగలతో బుద్ధుని శిరస్సు మీద ఉన్నట్లు కనిపించే బొమ్మ లున్నాయి. పాము మనిషి తలపై పడగవిప్పి ఉండడం గొప్ప లక్షణంగా ఆకాలపు ప్రజలు భావించేవారు. శాతవాహన, ఇక్ష్వాకుల శిల్పాల్లో రాజులకు రాణులకు ఇతర ప్రసిద్ధ వ్యక్తులకు శిరస్సు వెనుక ఒకటినుండి ఏడు వరకు ఫణములు చెక్కబడి కనిపిస్తాయి. ఇది బౌద్ధం మీద వైదిక మత ప్రభావంగా చెప్పవచ్చు.

ఆంధ్రులపై బౌద్ధం ఎనలేని ప్రభావాన్ని చూపింది. వారి స్వభావంలో కనిపించిన సాత్వికతకు బౌద్ధమే కొంతవరకు కారణం. వైదిక మతంలో విగ్రహారాధన ఏర్పడడానికి కారణం బౌద్ధమే. బుద్ధుడు దేవుడుగా – కొన్నాళ్ళకు అవతార పురుషుడుగా భావింపబడినాడు. దివ్యత్వానికి మానవాకారాన్ని కల్పించి పూజించడానికి చారిత్రక పురుషుడైన బుద్ధుని ఆరాధించడమే కారణమైంది. శాతవాహనులకు ముందు వైదిక దేవతలకు దేవాలయాలు లేవు. శాతవాహనుల కాలంలో విగ్రహారాధన, దేవాలయ నిర్మాణం మొదలైంది. వైదిక దేవాలయానికి బౌద్ధ స్థూపం, విగ్రహారాధనకు బుద్ధుని ఆరాధన ప్రేరకాలు, నమూనాలు అయినాయి. ఇక్ష్వాకుల కాలంలో కొన్ని శైవ దేవాలయాలు కనిపిస్తాయి. సర్వదేవ, పుష్పభద్ర, నోడగీశ్వర స్వాముల దేవాలయాల నమూనాలు ఇటీవల నాగార్జున కొండవద్ద జరిపిన తవ్వకాలలో బయట పడినాయి. బౌద్ధ స్థూపంలో బుద్ధుని ప్రతిష్ఠించడానికి ఒక గది, బౌద్ధ సన్యాసులు జరిపే ఆరాధన కోసం మరొక గది వుండినట్లు స్థూప

నిర్మాణాలను పరిశీలిస్తే అర్థమవుతుంది. ఇలాంటి రెండు గదుల దేవాలయాలే వైదిక దేవతలకు కూడా మొదట నిర్మింపబడినట్లు తెలుస్తుంది. బుద్ధునికి యక్షులు, ఖేచరులు మొదలైన పరివార దేవతలుండినట్లు వైదిక దేవతలకు కూడా పరివార దేవతలు ఏర్పడడంవల్ల అప్పటి దేవాలయాల నమూనాలు మారి పెద్ద దేవాలయాలు నిర్మింపబడడం మొదలైంది. ఈ రకంగా బౌద్ధం ఆలయాల నిర్మాణాలలోను, ఆరాధన విషయాలలోను వైదికానికి మార్గం చూపింది.

ఆంధ్రదేశంలో బౌద్ధం విజృంభించిన కాలంలో వైదిక మతానికి ప్రాధాన్యత తగ్గింది. రాజులు, ప్రజలు సమంగా బౌద్ధాన్ని పోషించారు. అయినా అది స్వల్ప కాలం మాత్రమే. శాతవాహనులు మొదలుకొని ఆంధ్రదేశాన్ని పాలించిన ప్రాచీన రాజవంశాలకు చెందిన రాజులందరు వైదిక మతాన్ని కూడా పోషించారు. గౌతమీ పుత్ర శాతకర్ణి అశ్వమేధ రాజసూయాది యాగాలు చేసి ప్రసిద్ధి కెక్కినవాడు. భారతదేశంలో అశ్వమేధ యాగం చేసిన మొదటి రాజితడే. అయినా ఇతడు బౌద్ధ భిక్షువులకు దానధర్మాలు చేయడమే కాక వర్షాకాలంలో బౌద్ధ ధర్మం అధ్యయనం చేసే బౌద్ధ సన్యాసులకు పర్వతాలలో గుహాలయాలను, మందిరాలను తొలిపించి యిచ్చాడు. ఇక్ష్వాకు రాజుల కాలం బౌద్ధానికి స్వర్ణయుగం. ఆ వంశపు రాజులు కూడా యాగాలు చేసి వైదిక మతాన్ని ఉద్ధరించారు. క్రీ. శ. 4 వ శతాబ్దిలో ఆంధ్ర దేశంలోని కొన్ని ప్రాంతాలను పరిపాలించిన పల్లవులు పూర్తిగా వైదిక మతాన్ని పోషించారు. సంస్కృత భాషను ఆదరించడం, వైదిక బ్రాహ్మణులకు అగ్రహారాలు దానం చేయడం వైదిక మతోద్ధరణకు చెందిన అంశాలు. పల్లవరాజైన శివస్కంధవర్మ వేయించిన మైదవోలు శాసనం ఈ విషయాలను నిరూపిస్తుంది. విష్ణుకుండి రాజులు తమ శాసనాలను సంస్కృతంలో వేయించారు. వైదిక పండితులను ఆదరించారు. దేవాలయాలను నిర్మించారు. అప్పటివరకు శాసనభాషగా కొనసాగిన ప్రాకృతం నిరాదరణకు గురి అయింది. బౌద్ధం ప్రజలను ప్రభావితం చేయడంలో కొంత వెనకబడింది. శాతవాహనుల నుండి విష్ణుకుండుల వరకుగల సుమారు నాలుగైదు శతాబ్దాల కాలంలో వైదిక మత ప్రభావం బౌద్ధం మీద విశేషంగా పడింది. విష్ణుకుండుల కాలం నుండి ఆంధ్రదేశంలో బౌద్ధం లేక పోవడానికి ఇదే కారణం.

వైదిక ధర్మాలను విపులంగా ప్రచారం చేసినవాళ్ళు విష్ణుకుండులు. ఈ వంశపురాజులు బౌద్ధాన్ని ఏమాత్రం ఆదరించలేదు. వైదిక క్రతువులతో ఆంధ్ర దేశాన్ని పునీతం చేసింది కూడా వీళ్ళే. ఈ వంశం వాడైన మొదటి మాధవవర్మ పదకొండు అశ్వమేధాలు చేశాడు. అశ్వమేధ రాజసూయాది యాగ నిర్వహణ క్షత్రధర్మంగా, సార్వభౌమాధికారానికి గుర్తుగా ఆ కాలంలో పరిగణింపబడేది. దిగ్విజయసూచకంగా కూడా ఆనాటి రాజులు యాగాలు చేసేవారు. మాధవవర్మ అశ్వమేధ యాగాలతోనే తృప్తిపడక రాజసూయం, పురుషమేధం వంటి మనుష్య పశు హింసాత్మకములైన యాగాలు కూడా చేసినట్లు విష్ణుకుండుల శాసనాలను బట్టి తెలుస్తున్నది. దీనిని బట్టి ఈ కాలంలో కారుణ్యాన్ని బోధించే బౌద్ధం అదృశ్యమై దాని స్థానంలో కర్మమార్గ ప్రేరితమైన వైదికం ప్రబలినట్లు అర్థమవుతుంది. ప్రజలు యాగాలలో పాల్గొని అవబృథ స్నానంతో పవిత్రులైనట్లు భావించేవారు. ఇది బౌద్ధం మీద ప్రజలకేర్పడిన విరక్తిని తెలుపుతుంది. వైదిక సంస్కృతి బౌద్ధ సంస్కృతిని అణచివేసింది. బౌద్ధుల పుణ్యక్షేత్రాలు వైదిక మత నిలయాలుగా మారాయి. ప్రసిద్ధ అమరావతి బౌద్ధక్షేత్రం శైవస్థానమై అమరేశ్వరాలయంగా మారింది. ఇది ఒక ఉదాహరణ మాత్రమే. ఇట్లెన్నో బౌద్ధాలయాలు శైవాలయాలయినాయి. శాతవాహనుల కాలంలోనే హీనయానం, మహాయానంగా చీలిపోయిన బౌద్ధం విష్ణుకుండుల కాలంలో పట్టు తప్పిపోయింది. శాతవాహనులు మహాయాన బౌద్ధాన్ని పోషించారు. ఆచార్య నాగార్జునుడు మహాయాన బౌద్ధానికి ఎంతో సేవ చేశాడు, అయినా ప్రజల దృష్టి వైదిక కర్మలమీద ప్రసరించడంతో వారి మనసులలో బుద్ధుని రూపం అదృశ్యమైంది.

చారిత్రకంగా పరిశీలిస్తే, బౌద్ధాన్ని పోషించిన ఏ రాజవంశమూ ఎక్కువ కాలం పరిపాలన చేసినట్లు కనపడదు. బౌద్ధాన్ని పోషించిన అశోకుడు చరిత్రలో సన్యాసిరాజుగా పేరు పొందినాడే కాని తరువాత రాజ్యానికి సమర్థులైన వారసులను తయారు చేయలేక పోయాడు. దీనికి కారణం బౌద్ధం పరిపాలకుల మనస్సులలో వైరాగ్య వాసనలను నింపడమే. సమర్థుడైన పరిపాలకుని మనస్సు రజోగుణ సంసక్తంగానే ఉండాలి. లేకుంటే అతని పరిపాలన సాగదు. మంచి వారసులను తయారు చేయలేదు. ఈ కారణంచేత కాబోలు శాతవాహనుల కాలం నుండి రాజులంతా క్షాత్రాన్ని పండించే వైదిక క్రతువులు చేశారు. మానవ స్వభావం భోగ

సాధనకు ఎప్పుడూ సుముఖంగానే వుంటుంది. అందువల్ల అహింసను బోధించే బౌద్ధం ప్రజలకు నచ్చలేదు. ఈ పరిస్థితులలో ఆంధ్రదేశంలోని బౌద్ధులకు ఆదరణ కరువై కనీస ఉనికి కోసం వెతుకులాడే స్థితి కలిగింది. వైదికాచారాలను తమ మతంలో కలుపుకొంటే కొంత అస్తిత్వం ఏర్పడగలదని బౌద్ధులు భావించారు. నాగార్జునుని మహాయానం భక్తి మార్గానికి పునాది వేసింది. బుద్ధుడొక పూజనీయుడైన దేవుడుగా వెలశాడు. ఇతనికి ఎందరో పరివార దేవతలు, వారికి భార్యలుగా స్త్రీ దేవతలు సృష్టింపబడినారు. బోధిసత్వులు వైదికంలోని మహర్షులుగా మునులుగా పరివర్తన చెందారు. బౌద్ధ దేవతలకు వైదిక దేవతలను భేదం తెలుసుకోవడం కష్టమైంది. రెండుమతాలు కలిసిపోయి బౌద్ధ మత ప్రత్యేకత నశించింది. బుద్ధుడు మన పురాణాలు తయారు చేసిన దశావతారాలలో ఒక అవతారంగా గుర్తింపబడినాడు. ఇది బౌద్ధానికి నిజమైన క్షీణదశ. కొందరు బౌద్ధ సన్యాసులు అధర్వవేదంలో చెప్పబడిన తాంత్రిక పూజలు, రహస్య క్రియా కలాపాలు, శక్తి పూజలు మొదలైన వాటిని ఆచరించారు. మద్యపానం, మాంసభక్షణం వీరికి అలవాటైంది. బౌద్ధులలో వచ్చిన ఈ మార్పులు బౌదమతాన్ని మరింత క్షీణింపజేశాయి. ఇలాంటి తాంత్రిక పూజా విధానాలతో వజ్రయానం అనే మరొక బౌద్ధశాఖ ఏర్పడింది. బౌద్ధారామాలు చెడు నడతకు నిలయాలైనాయి. బౌద్ధ సన్యాసుల నైతిక పతనం మతాన్ని త్వరగా నశింపజేసింది. ఆంధ్ర సంస్కృతిని ఎంతో ఉత్తేజపరచిన బౌద్ధం ఆంధ్ర దేశంలో నామరూపాలు లేకుండా పోయింది. బౌద్ధాలయాలు 'లంజ దిబ్బలు'గా మారాయి.

ఆంధ్ర దేశంలో ఈనాడు బౌద్ధం లేదు. అయినా అది అంతర్గతంగా మనలో ఉంది. బుద్ధుని సూక్తులు హిందూ మతంలో కలసిపోయాయి. అహింస, కరుణ మొదలైన మాటలను బౌద్ధమే మనకు నేర్పింది. గౌతమబుద్ధుని జీవితచరిత్ర ఇప్పటికీ మనకెంతో స్ఫూర్తిదాయకంగా వుంది. ఈనాటి మానవుల సత్వరజో గుణాలలో వైదిక బౌద్ధాల ప్రేరణ తప్పక వుంటుందనడం అతిశయోక్తి కాదు.

### 3. హిందూ మహమ్మదీయ సంస్కృతి సమ్మేళనం :

ఆంధ్ర దేశంలోని హిందువులకు మహమ్మదీయులతో సంసర్గం కలిగింది కాకతీయుల కాలంలో. క్రీ.శ. 1326లో కాకతీయుల చివరిరాజైన ప్రతాపరుద్రుని

ఓడించి తురుష్కులు ఓరుగల్లును ఆక్రమించుకొన్నారు. అప్పటినుండి ఆంధ్ర దేశంలో మహమ్మదీయ యుగం ప్రారంభమైంది. దీనికి కొంత చారిత్రక నేపథ్యం వుంది. భారతదేశంలో మహమ్మద్ గజనీ, మహమ్మద్ ఘోరీలతో ముస్లిం పరిపాలన ప్రారంభమైంది. హిందూ దేవాలయాలను కొల్లగొట్టి అపారమైన సంపదను దోచుకొని పోవడానికి వచ్చిన మహమ్మదీయులు ఇక్కడనే స్థిరపడి వీలైనన్ని ప్రాంతాలను పరిపాలించడం ప్రారంభించారు. మహమ్మదీయుల పరిపాలనకు ఢిల్లీ కేంద్రమైంది. అప్పటినుండి మహమ్మదీయ పాలకులు దక్షిణ దేశంలో కూడా రాజ్యాలు స్థాపించాలని, ధనరాసులను దోచుకోవాలని ప్రయత్నాలు చేశారు, ఈ ప్రయత్నాలలో భాగమే ఓరుగల్లు ముట్టడి.

మహమ్మదీయులు ఆంధ్ర దేశంలో ప్రవేశించిన తరువాత మత సాంఘిక ఆర్థిక పరిస్థితులలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఓరుగల్లు పతనానికి విజయనగర సామ్రాజ్య స్థాపనకు మధ్యగల పది సంవత్సరాలలో ఆంధ్ర నాయకులు మహమ్మదీయులను ఓడించి మరల తెలుగు సామ్రాజ్యాన్ని పునరుద్ధరించడం, నాయకుల అనైక్యత కారణంగా ఆంధ్రదేశం మరల ముక్కలు కావడం చరిత్రకు తెలిసిన సత్యాలు. ఈ కాలంలో ఆంధ్రవీరులు మహమ్మదీయులపై జరిపిన పోరాటాన్ని ప్రథమాంధ్ర స్వాతంత్ర్య సంగ్రామంగా చెప్పవచ్చు. కంపరాయల భార్య గంగాదేవి రచించిన 'మధురా విజయం' అనే సంస్కృత కావ్యం, కాటయ వేమారెడ్డి కుమార్తె అనితల్లి వేయించిన 'కలువచేరు శాసనం' ఈ కాలంనాటి ఆంధ్రుల కడగండ్లను తెలియజేస్తున్నాయి. మహమ్మదీయులు ఓరుగల్లుకు 'సుల్తాన్‌పూర్' అని పేరు పెట్టినారు. హిందువులను బలవంతంగా మహమ్మదీయులుగా మార్చారు. అధిక పన్నులతో రైతులను బాధించారు. బ్రాహ్మణులు అప్పటివరకు అనుభవిస్తూ వుండిన అగ్రహారాలను లాక్కొన్నారు. హిందువులకు పవిత్రమైన గోవులను వధించారు. స్త్రీల వృద్ధుల యెడల నిర్దాక్షిణ్యంగా క్రౌర్యం ప్రదర్శించారు. హిందువులు వారి ఆస్తులపై హక్కులను పోగొట్టుకొన్నారు. సంఘంలో వర్ణసాంకర్యం ఏర్పడింది. నూతన శాసనాలతో, ఆర్థిక విధానాలతో ప్రజలు ఎన్నో బాధలకు గురి అయినారు. కొన్నాళ్ళకు మహమ్మదీయులు ఓరుగల్లును విడిచిపెట్టి వెళ్ళిపోయారు. అయినా తెలుగుదేశంలో మహమ్మదీయుల భావాలు, ఇస్లాం మత సిద్ధాంతాలు ప్రజలపై ఎంతో ప్రభావం చూపాయి. తెలుగు

జనాభాలో మహమ్మదీయులు కూడా కనిపించడం ఈ కాలం నుండే ప్రారంభ మైంది. తురక సర్దారుల వెంట వచ్చిన మహమ్మదీయులలో కొందరు ఇక్కడనే స్థిరపడి పోయారు. తెలుగు వీరుల మత సహనాన్ని వీరు బాగా ఉపయోగించు కొన్నారు.

ఆనాటి ఆంధ్రదేశంలో తెలుగుప్రజలు, మహమ్మదీయులు కలసి జీవించడం వల్ల ఎన్నో మత విశ్వాసాలు, ఆచార వ్యవహారాలు పరస్పరం ఇచ్చి పుచ్చుకోవడం జరిగింది. ఇస్లాం హిందూమతాలు చాలవరకు ఒకదానికొకటి పోలికలేని విరుద్ధాలైన మతాలు. ఇస్లాం ఏకేశ్వరోపాసనను బోధిస్తుంది. వీళ్ళకు అల్లా ఒక్కడే దేవుడు. వీరికి విగ్రహారాధన లేదు. వీరి మతంలో అందరూ సమానులే. హిందూమతంలో వర్ణ వ్యవస్థ వుంది. ఎందరో దేవతలు, వీరికి దేవాలయాలు వున్నాయి. అయినా హిందూప్రజలు, మహమ్మదీయులు స్నేహంగా ఉన్నప్పటికీ స్వార్థపరులైన సుల్తానులు, పగ తీర్చుకోదలచిన హిందూరాజులు లాభాకాంక్షతో కలహాలు పెంచుతూ వుండేవారు. ఈ కారణంగా రెండు మతాల ప్రజలమధ్య కొంత వైమనస్యం కనిపించేది. హిందువులలో చాల మంది వ్యవసాయం పైన, మహమ్మదీయులలో ఎక్కువ మంది వర్తకం మీద ఆధారపడేవారు. ఒకరి సహకారం మరొకరికి అవసరమయ్యేది. అంతర్గతంగా భేదాలున్నా పైకిమాత్రం కలసిమెలసి ఉండేవారు. హిందువులకు చాల పండుగలున్నాయి. మహమ్మదీయులకు మొహరం, రంజాన్ ముఖ్యమైన పండుగలు. హిందువులలో ధనుర్మాస వ్రతాలు, మహమ్మదీయులలో రంజాన్ మాస ప్రార్థనలు సమాంతరంగా కనిపిస్తాయి. మొహరం పండుగనే పీర్ల పండుగ అని కూడా అంటారు. ఆంధ్ర దేశంలోని కొన్ని ప్రాంతాల్లో నేటికీ హిందువులు కూడా పీర్ల పండుగను జరుపుకోడం కనిపిస్తుంది. రాయలసీమలో పీర్ల పండుగ ఘనంగా జరుగుతుంది. ప్రస్తుతం మన జనాభాలో కనిపించే దూదేకులవారు మహమ్మదీయాచారాలను, హిందూ ఆచారాలను కూడా ఆచరిస్తున్నారు. కొన్ని ప్రాంతాలలో వీరిని తురకలని కూడా పిలవడం వుంది. పీరయ్య పీరమ్మ అనే మహమ్మదీయ సంప్రదాయపు వ్యక్తి నామాలు, వెంకటయ్య సిద్ధయ్య అనే హిందూ సంప్రదాయపు వ్యక్తి నామాలు వీరిలో కనిపిస్తాయి.

ఆంధ్రదేశానికి మహమ్మదీయులతో సంసర్గం ఏర్పడినతరువాత సయ్యద్‌లు, షేకులు అనే పేర్లతో ఇస్లాం మత సాధువులు దేశమంతా సంచారం చేస్తూ ఆంధ్ర

దేశానికి కూడా వచ్చారు. వీళ్ళు సూఫీ భక్తి తత్వాన్ని ప్రచారం చేశారు. ఇక్కడ తరువాత ఏర్పడిన భక్తి ఉద్యమానికి వీళ్ళ ప్రచారం బాగా దోహదం చేసింది. సాధువులైన ఈ మహమ్మదీయులు హిందూ మహమ్మదీయ ప్రజలకు సమానంగా తత్వబోధ చేస్తూ అవసరమైనపుడు వైద్యం చేసూ రెండు మతాలవారి గౌరవాన్ని పొందారు. సాధువుల సమాధులు 'దర్గా' అనే పేరుతో ప్రఖ్యాతమైనాయి. హిందువులకు మహమ్మదీయుల యెడల ద్వేషం పోయింది. హిందువులు దర్గాలకు కూడా వెళ్ళి ప్రార్థనలు చేయడం ప్రారంభమైంది. సిద్ధి పొందిన మహమ్మదీయ సాధువుల వార్షిక జననోత్సవాలు 'ఉరుసు'లని పిలవబడినాయి. ఇలాంటి ఉరుసులలో హిందువులలోని కడజాతుల వారు, మహమ్మదీయులు సమానంగా పాల్గొనే వారు. హిందూ మహమ్మదీయ అనుబంధం వారి భాషల్లో కూడా ప్రతిఫలించింది. మహమ్మదీయులు తెలుగు నేర్చుకోవడం తెలుగువారు ఉర్దూ నేర్చుకోవడం కనిపిస్తుంది. ఆ కాలంలో మహమ్మదీయ రాజ్యాలనుండి వచ్చిన ఫారసీ, అరబ్బీ భాషలలోని రాజకీయ పత్రాలను అనర్గళంగా చదివి అర్థం చెప్పగల తెలుగువారుండినట్లు శ్రీనాథ మహాకవి గ్రంథాల ద్వారా తెలుస్తుంది. హిందూరాజులు తమ రాజ్యాలలో ఉండిన మహమ్మదీయ్యుల కోసం మసీదులు నిర్మించారు. శ్రీకృష్ణదేవరాయల కాలం నుండి హిందూ సంస్థలలో మహమ్మదీయులకు ఉద్యోగాలివ్వబడినాయి. అళియ రామరాజు తన సైన్యంలో ఎందరో మహమ్మదీయులను సైనికులుగా చేర్చుకొన్నాడు. గోల్కొండను పాలించిన కుతుబ్‌షాహీ వంశస్థులు తాము మహమ్మదీయులమన్న మాటే మరచినట్లు ప్రవర్తించారు. తెలుగు భాషకు, తెలుగు సంస్కృతికి వీళ్లు ఎంతో సేవ చేశారు. తెలుగు భాష ఎన్నో ఉర్దూ ఫారసీ పదాలను తనలో చేర్చుకొని సుసంపన్నమైంది.

ఈ నాటి లౌకిక విధానాలతో హిందువులు, మహమ్మదీయులు సహజీవనం చేస్తున్నారు. ఇద్దరి మధ్య మతకలహాలు లేవు. వీరి మధ్య ఇప్పుడు కనిపించే సామరస్యానికి చారిత్రకంగా భిన్నకాలాల్లో హిందూ మహమ్మదీయ మతాలమధ్య ప్రజల మధ్య పొడుకొనిన సాంస్కృతిక సమ్మేళనమే కారణం. మహమ్మదీయులు ఇతర దేశాల నుండి వచ్చిన వారైనా ఇప్పుడు భారతీయులు. తెలుగుదేశంలోని మహమ్మదీయు లందరిది తెలుగు సంస్కృతే. వీళ్లకు తెలుగు భాషా సంస్కృతుల మీద అభిమానముంది.

4 ఆంధ్రాంగ్ల సంస్కృతుల సమన్వయం :

క్రీ.శ. 15వ శతాబ్దం చివరి దశకంలో పాశ్చాత్యులు భారత భూమిపై కాలు పెట్టారు. 'వాస్కోడిగామా' అనే పోర్చుగీసు నావికుడు కళ్ళికోటను చేరు కొన్నది ఈ దశకంలోనే. తరువాత డచ్చివారు, ఫ్రెంచివారు, ఆంగ్లేయులు భారత దేశానికి వచ్చారు. దక్కనులో—ముఖ్యంగా ఆంధ్రదేశంలో గోల్కొండ నవాబుల పాలనా కాలమది. ఔరంగజేబు 1687లో గోల్కొండను జయించాడు. అయినా ఆంధ్రదేశంలో జరిగిన తిరుగుబాటులను ఆపి శాంతిని నెలకొల్పలేక పోయాడు. 1707 లో ఔరంగజేబు మరణించిన తరువాత ఈ ప్రాంతానికి మొగలుల సుబేదారైన 'నిజాం ముల్‌ముల్క్ ఆసఫ్ జా' 1744 లో స్వతంత్రించి హైదరాబాదు రాజ్యాన్ని స్థాపించాడు. ఇది పూర్వపు గోల్కొండ రాజ్యానికి ప్రతిబింబమే. అప్పటికే భారతదేశానికి వ్యాపారార్థం వచ్చిన పాశ్చాత్యులు 18 వ శతాబ్ది చివరకు బలవంతులై రాజకీయాధికారాల కోసం ప్రయత్నించారు. అంతకు ముందే ఆంగ్లేయులు 1639లో చంద్రగిరి రాజులవద్ద అనుమతి పొంది మద్రాసులో కోట కట్టుకొన్నారు. ఆంగ్లేయులకు మద్రాసు, ఫ్రెంచివాళ్లకు పుదుచ్చేరి కేంద్రాలైనాయి. 1748 లో ఆసఫ్ జా మరణించాడు. హైదరాబాదు రాజ్యంలో అంతః కలహాలు చెలరేగాయి. ఈ వ్యవహారాల్లో ఫ్రెంచి గవర్నరైన 'డూప్లే' జోక్యం చేసుకొని ముజఫర్ జంగ్‌ను నిజాముగా నియమించి అతని నుండి ఉత్తర సర్కారుకు చెందిన కొన్ని ప్రాంతాలను ప్రతిఫలంగా పొందాడు. 1763 నాటికి ఇంగ్లీషు వారి చేతిలో ఫ్రెంచివారి బలం క్షీణించింది. ఆంధ్రదేశంలోని ఫ్రెంచి స్థావరాలన్నీ ఆంగ్లేయుల వశమైనాయి. అప్పటి నుండి ఆంధ్రదేశ మంతటా ఆంగ్లేయుల అధికారం కొనసాగింది. పదునెనిమిదవ శతాబ్ది భారతదేశ చరిత్రలో క్షీణదశను చూపినకాలం. ప్రజలు చేసే చేతిపనులన్నీ పాశ్చాత్యులు యంత్రాలతో నిర్వహించడంవల్ల ప్రజలకు వృత్తిపనులు పోయాయి. దేశంలోని వ్యాపార మంతా ఎక్కువగా ఆంగ్లేయుల పెత్తనంలోకి వచ్చింది. ఆంధ్రదేశంలో కూడా క్షీణ దశ తన ప్రభావాన్ని చూపింది. కళలను, కళాకారులను ఆదరించే ప్రభుత్వాలు లేకపోవటంచేత అప్పటి ఆంధ్రదేశంలో ఏర్పడిన సంస్థానాలను పాలించే జమీందారులు కవులను పండితులను పోషించి ఆంధ్ర సంస్కృతిని రక్షించారు.

ఆంగ్లేయులు మనకు పరిపాలకులై వారితో సంసర్గం కలగడంతో దేశంలో పెద్ద మార్పు వచ్చింది. పాశ్చాత్యులు మన దేశానికి వచ్చిన తరువాత ఎన్నెన్నో నూతన సంస్థలతో, నూతన దృక్పథాలతో, నూతన భావాలతో ఒక కొత్త ప్రపంచం దర్శనమిచ్చింది. అంతకు ముందు మన దేశానికి వచ్చిన మహమ్మదీయులది మనది ప్రధానంగా మత విషయకమైన సంస్కృతి. ఆంగ్ల సంస్కృతి దానికంటె భిన్నమైనది. ఎన్నో క్రైస్తవ మిషనరీలు మన దేశానికి వచ్చాయి. వాళ్ళు ఇక్కడ క్రైస్తవ మతాన్ని వ్యాప్తి చేయడానికి మన దేశ సంపదను వాళ్ల దేశానికి తరలించడానికి మాత్రమే ప్రయత్నం చేశారు. ప్రధానంగా వారి స్వభావం వర్తక స్వభావం. పైకి సంతోషం ప్రకటిస్తూనే ధన సంపాదనకు ప్రజల రక్తాన్ని జలగల వలె పీల్చడం వీరి మార్గం. ఈ కార్యాన్ని సాధించడానికి ఆంగ్లేయులు గొప్ప పాలనా యంత్రాంగాన్ని నిర్మించుకొన్నారు. దేశీయ ధర్మపీఠాలు పోయి కోర్టులు వచ్చాయి. వారి పాలనలో ఇంగ్లీషు చదువుకొన్నవారికే ఉద్యోగాలు లభించడంతో దేశీయులు కూడా ఇంగ్లీషు విద్యకు ఎగబడినారు. దేశంలో ఎన్నో ఆంగ్ల పాఠశాలలు వచ్చాయి. ఆంగ్ల విద్యావిధానం మనవారి కట్టుబొట్టులను, ఆహార నియమాలను, కడకు ఆలోచనా విధానాలను కూడా మార్చివేసింది. పొడుగాటి జుట్లు మాయమై క్రాపులు కనిపించాయి. బుష్ షర్టులు ప్యాంట్లు ధరించడం అలవాటయింది. పళ్యాలలోని భోజన పదార్థాలను కత్తులతో కత్తిరించుకొని గరిటలతో తినడమే గొప్ప సంస్కృతిగా భావింపబడింది. దేశంలోని ప్రధాన నగరాలైన కలకత్తా, బొంబాయి, మద్రాసులలో గొప్ప ఇంగ్లీషు విద్యాలయాలు స్థాపించబడినాయి. మధ్య తరగతివారు ఉద్యోగాలకోసం ఇంగ్లీషు పాఠశాలల్లో తమ బిడ్డలను చదివించడం ప్రారంభించారు. ఇంగ్లీషు రాజభాష అయింది.

పాశ్చాత్యులు రావడంతో దేశంలోకి ముద్రణా యంత్రాలొచ్చాయి. దేశిభాషలకు కూడా అచ్చు అక్షరాలు తయారైనాయి. తాటాకుల మీద రాసే పద్ధతి అదృశ్యమై పుస్తకాలు అచ్చయినాయి. ఇంగ్లీషు నేర్చుకొన్న దేశీయుల ఆలోచనలు విస్తృతమైనాయి. ఆంగ్లం ద్వారానే ప్రపంచ విజ్ఞానం పొందవచ్చునని వీరికి తెలిసింది. వార్తల ప్రసారానికి పత్రికలు స్థాపించబడినాయి. ఇవన్నీ ఇంగ్లీషు విద్య ద్వారా పొందిన సౌకర్యాలు. దేశంలో పాలనా సౌకర్యం కోసం కట్టుదిట్టమైన తంతి

తపాలాశాఖ ఏర్పాటు చేయబడింది. రైళ్ళు ప్రవేశపెట్టబడి ఒక ప్రాంతానికి మరొక ప్రాంతానికి గల దూరం తగ్గిపోయింది. 1857 లో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా జరిగిన సిపాయి కలహం ప్రభావం ఆంధ్రదేశంలో కూడా ప్రతిధ్వనించింది. ఇది ఆంధ్రులలో జాతీయభావం ఏర్పడడానికి దోహదం చేసింది. తెలుగు సాహిత్యంపై ఆంగ్ల సాహిత్య ప్రభావం ఎంతో ఉండడంవల్ల తెలుగు భాషా సాహిత్యాల అధ్యయన విషయాలలో నూతన మార్గాలు ఏర్పడినాయి. ఆంగ్లేయులు ప్రవేశపెట్టిన అచ్చుయంత్రాల ద్వారా ప్రాచీన తెలుగు గ్రంథాలెన్నో ముద్రింపబడినాయి.

ఆంగ్లేయులు మన దేశంలో ప్రవేశపెట్టిన తంతి, తపాలా, రైలుసౌకర్యాలు, అచ్చుయంత్రాలు మొదలైనవాటివల్ల దేశీయుల ఆలోచనా పరిధి పెరిగి ఇతర దేశాల సాహిత్య సంస్కృతులను అధ్యయనం చేసే అవకాశం కలిగింది. దీనివల్ల దేశంలో కొన్ని నూతన ఆదర్శాలు, ఆలోచనలు, అలవాట్లు ఏర్పడినాయి. ఆంగ్ల సంస్కృతి ప్రభావాన్ని గుర్తించిన దేశీయులలో కొందరు ఆంధ్ర సంస్కృతిలో కాలానుగుణమైన కొన్ని మార్పులను అంగీకరించాలని ప్రచారం చేశారు. అలాంటి వారిలో వంగదేశంలో రాజారామమోహనరాయ్, తెలుగుదేశంలో వీరేశలింగం పంతులు ముఖ్యులు. మతపరమైన సంస్కృతిలో మార్పులు తేవడానికి రామ మోహనరాయ్ ప్రయత్నిస్తే భాషావిజ్ఞాన సంస్కృతులలో మార్పులకోసం ప్రయత్నించినవాడు వీరేశలింగం పంతులు. ఆంగ్లభాషతోపాటు తెలుగుభాషకు కూడా ప్రాధాన్యముండాలని వీరేశలింగం పంతులు ఆంగ్లపాఠశాలల్లో విద్యార్థులు చదువవలసిన సామాన్య సాంఘిక శాస్త్రగ్రంథాలను తెలుగులోకి అనువదించాడు. ఇది అతని ముందుచూపుకు నిదర్శనం. దేశప్రాచీన సంస్కృతిని చరిత్రను సవిమర్శనయనాలతో వీక్షించడం, దేశభవిష్యత్తు ఉజ్జ్వలంగా వుండగలదనీ ఆకాంక్షించడం, అంధవిశ్వాసాలను రూపుమాపి గుణగణ వివేచనతో ముందుకు సాగడం, శాస్త్రదృష్టిని అలవరచుకోవడం, సంఘ దురాచారాలను పరిష్కరింప బూనడం, ధర్మశాస్త్ర గ్రంథాలను నూతన చక్షువులతో పరిశీలించి నీతిమత విషయాలలో ఉన్నతాదర్శాలను సాధించుకోవాలనుకోవడం వీరేశలింగం పంతుల కాలంలో ఏర్పడిన నవచైతన్య లక్షణాలు. వీరేశలింగం పంతులు నవజీవన భానుడుగా కీర్తింపబడినాడు.

ఆంగ్ల సంస్కృతిలో ఆంధ్ర సంస్కృతి కలిసిపోయిందో లేక ఆంధ్ర సంస్కృతిలో ఆంగ్ల సంస్కృతి విలీనమైందో చెప్పడం సాధ్యం కానంతగా ఈ రెండు సంస్కృతులు కలిసిపోయాయి. పదునెనిమిది పందొమ్మిది శతాబ్దాల్లో మనపైన బలవంతంగా రుద్దబడిన ఆంగ్ల సంస్కృతిని ఈనాడు తెలుగు సంస్కృతి నుండి విడదీయడం కష్టం. ఇతర ప్రాంతాల సంస్కృతులను భాషలను తనలో లయం చేసుకొని తెలుగు సంస్కృతి పరిపుష్టమైంది. ఈ లక్షణం తెలుగు సంస్కృతి సహనాన్ని విపులతను సూచిస్తుంది. తెలుగుదేశంలో ఏర్పడిన సాంస్కృతిక పునరుజ్జీవనానికి ఆంగ్ల సంస్కృతియే కారణం. ఇతర విషయాలన్నిటితోపాటు భాషా సాహిత్యాల పరిశోధన మార్గానికి ఆంగ్ల సాహిత్య స్పర్శ ఎంతగానో దోహదం చేసింది. మత విషయంలో ఆదివారం ప్రార్థనామందిరాలకు వెళ్ళే ఆంగ్లేయుల అలవాటు మనం శనివారం చేసే పూజలతో సంవదిస్తుంది. ఈనాటి ఆంధ్రదేశంలోని క్రైస్తవ మహిళలు అలంకరణ విషయంలో తెలుగు స్త్రీలను అనుకరించడం కూడా ఈ రెండు సంస్కృతుల పరస్పర వినిమయాన్ని తెలియజేస్తుంది.

**ముగింపు:**

సంస్కృతి ఒక జీవనదీ లాంటిది. అది అడ్డం వచ్చిన వస్తువులను తొలగించుకొంటూ ముందుకు సాగుతుంది మార్గమధ్యంలో ఎన్నో వాగులు వంకలు నదిలో కలిసిపోయినట్లు ఒక జీవన సంస్కృతి తనకు చుట్టుపక్కల గల ఇతర సంస్కృతులను తనలో లీనం చేసుకొని గంభీరంగా కనపడుతుంది. ఇది తెలుగు సంస్కృతి లక్షణం. ఇదే భారతీయ సంస్కృతి లక్షణం కూడా. ఈ వ్యాసంలో ప్రధానంగా ఆర్య అనార్యుల, బౌద్ధ వైదికాల, హిందూ మహమ్మదీయుల, ఆంధ్రాంగ్లేయుల సంస్కృతులు పరస్పరం ఎలా ప్రభావితమైనాయో చర్చింపబడింది. ఇతర దేశాల నుండి మన దేశానికి వచ్చిన శకులు యవనులు మొదలైన వారి ప్రభావం మన సంస్కృతిలో ఎలా కనిపించిందో చూపలేదు. వ్యాసాన్ని పరిమితం చేయడమే దీనికి కారణం. క్రీ.శ. 2వ శతాబ్దికి చెందిన బ్రాహ్మీ లిపిలో అల్లూరులో (నందిగామ తాలూకా, కృష్ణాజిల్లా) దొరికిన ఒక

శాసనంలో బౌద్ధ స్థూపానికి ఇచ్చిన దానాల వివరాలున్నాయి. భూములతో పాటు రెండు యవన దీపాలు కూడా దానం చేయబడినట్లు ఈ శాసనం తెలుపుతుంది. ఈ శాసనంలో చెప్పబడిన యవనులు గ్రీకులు. ఆంధ్రదేశంలోని కొన్ని ప్రాంతాలలో రోమను నాణాలు కూడా దొరికాయి. దీనిని బట్టి ఆ కాలంలో గ్రీకులు, రోమనులు ఆంధ్రదేశానికి వస్తూ పోతూ వుండేవారని తెలుస్తుంది. వీరి సంస్కృతి ప్రభావం కూడా తెలుగు సంస్కృతిపై వుంది.

# 8. శ్రీకృష్ణుడు - చారిత్రకత

భారతదేశంలో జన్మించిన దివ్యపురుషులలో శ్రీకృష్ణుడు ఒకరు. యమునా నదీ తీరంలోని మధురలో ఆయన జన్మించారు. ఆయన జన్మించే నాటికి ఉత్తర భారతమంతా చిన్న చిన్న తెగలతో ఒకదానితో మరొకదానికి రాజకీయ సంబంధం లేకుండా వున్నాయి. కృష్ణుడు ఒక వీరుడుగా ఒక రాజ్యం ఏర్పరచుకొన్నాడు. మౌర్య సామ్రాజ్యం స్థాపితమయ్యేవరకు (క్రీ. పూ. 321) రాజకీయ పరిస్థితి నిశ్చితంగా లేదు. ఇది చరిత్ర చెప్పే విషయం క్రీ. పూ. 4వ శతాబ్దివరకు గల చారిత్రకేతర ఆధారాలను పరిశీలిస్తే శ్రీకృష్ణునికి సంబంధించిన ఎన్నో ఆసక్తికర మైన విషయాలు తెలుస్తాయి. శ్రీకృష్ణుడు పరమాత్మగా, యోగిగా, సలహాదారుగా, వీరుడుగా కనిపిస్తాడు. ఆయన ఒక అవతార పురుషుడుగా కీర్తింపబడినాడు. శ్రీ మహావిష్ణువునకు గల దశావతారాల్లో శ్రీకృష్ణుడు ఒక అవతారంగా గుర్తింప బడినాడు. కృష్ణ శబ్దానికి శాశ్వతానందం కలిగించేవాడని (కృష్-శాశ్వతమైన, ణ-ఆనందం) అర్థ వివరణలు ఏర్పడినాయి. చారిత్రకంగా పరిశీలిస్తే వైదిక వాఙ్మయంలో కనిపించే కృష్ణతత్త్వానికి మహాభారతంలో కనిపించే కృష్ణ్వతత్త్వా నికి ఎంతో భేదం వుంది. ఈ భేదాన్ని గుర్తించేముందు శ్రీకృష్ణుడు దశావతారా ల్లోని అవతారంగా ఎప్పటినుండి కనిపిస్తున్నాడనే విషయం స్పష్టం కావాలి.

**శ్రీ కృష్ణావతారం :**

విశ్వవ్యాప్తి, అనంతమయుడు అయిన పరమాత్మకు అవతారాలేమిటంటారు కొందరు. సమస్త సృష్టి భగవదిచ్ఛాధీనంగా సృష్టింపబడింది. సృష్టికి నామరూపా లేర్పడింది ఆయన కృపావిశేషం వల్ల. సృష్టిలో ఎనభై నాలుగు కోట్ల జీవరాసు లున్నట్లు పారమార్థికుల ఆలోచన. ఈ జీవరాసులలో దేనికిలేని జ్ఞానాన్ని పరమాత్మ

మనిషి కిచ్చాడు. ధర్మబద్ధంగా జీవితాన్ని పండించుకోమని చెప్పడానికి ఆయన ప్రతి మనిషిలో చోదక శక్తిగా ప్రవేశించాడు. మానవుని ఆలోచన పెరిగింది. ప్రాపంచిక విషయాలతో జీవితం నియంత్రించబడింది. సృష్ట్యాద్యంతాలను గురించి ఆలోచించాడు. సర్వం దివ్యంగా గోచరించింది. సర్వ ప్రకృతిలో పరమాత్మ నిండి ఉన్నాడని తెలిసింది. ఆ పరమాత్మకు రూపం కల్పించాడు. మనిషిలో ఈ దశ ఎప్పుడేర్పడిందో చరిత్రకందదు. తత్ఫలితంగా దేవుడి రూపం, ఆయనకొక ఆలయం ఏర్పడ్డాయి. ఒకే పరమాత్మను మానవులు వివిధ రూపాలలో దర్శించారు. దేవుడికి వివిధ రూపాలేర్పడ్డాయి. కాలక్రమంలో ఒకే దేవుడు వివిధ జన్మలెత్తి మహాప్రయోజనాలు సాధించినట్లు మానవులు భావించారు. అందువల్ల అవతారాలేర్పడ్డాయి.

దేవుడు మనుష్యాది రూపాలతో జన్మించి తన మహిమను చూపడమే అవతారం. దేవుడి కొక లోకముంది. అది అలౌకికం. సమస్త ఐశ్వర్యాలతో దేవుడు ఆ లోకంలో వుంటాడు. ఆ లోకాన్ని నిత్యవిభూతి అంటారు. మానవ క్రియా కలాపాలతో కూడిన లౌకిక ప్రపంచం మనం నివసించే లోకం. దేవుడు ఒక ప్రయోజనాన్నాశించి మన లోకంలో పుడతాడు. అంటే నిత్యవిభూతి నుండి లీలావిభూతికి దిగుతాడు. అవతారమంటే ఇదే. భగవద్గీతలో శ్రీకృష్ణుడు "యదా యదాహి ధర్మస్య...." (నాల్గవ అధ్యాయం, 7, 8 శ్లోకాలు) అనే శ్లోకాలలో ధర్మానికి గ్లాని ఏర్పడినపుడు, దుర్మార్గులు చెలరేగినపుడు ధర్మాన్ని రక్షించడానికి, దుర్మార్గులను శిక్షించడానికి తనను తాను సృష్టించుకుంటూ ఉంటానని ప్రకటించాడు. దీనిని బట్టి భగవద్గీత కాలం నాటికి అవతార సంప్రదాయం ఏర్పడిందని సనాతనుల విశ్వాసం. మహాభారత కర్త వ్యాసుడు. శ్రీకృష్ణుని సమకాలికుడు. కృష్ణుని దివ్యత్వాన్ని వ్యాసుడు సందర్శించాడు. భక్తి భావ సంపన్నులకు దర్శింపజేశాడు. మహాభారత కథకు శ్రీకృష్ణునికి సంబంధముంది. తన కాలంలో జరిగిన కురుక్షేత్ర యుద్ధాన్నే వ్యాసుడు వర్ణించాడని కొందరి అభిప్రాయం. దీనిని బట్టి శ్రీకృష్ణుడు మహాభారత కాలంలో జీవించాడని నిర్ణయించాలి. శ్రీకృష్ణుని వృత్తాంతాన్ని ఒక క్రమంలో మనకు చూపిన మొదటి సాహిత్య గ్రంథం మహాభారతమే. మహాభారతంలో కృష్ణుని విశేషాలను గుర్తించడానికి ముందు వైదిక వాఙ్మయంలో గల విశేషాలను చూడవలసి ఉంది.

**వైదిక వాఙ్మయం:**

ఋగ్వేదంలో 'కృష్ణ' శబ్దం చాల చోట్ల కనిపిస్తుంది. ఎనిమిదవ మండలంలో కృష్ణ అంగిరసుడు సోమపానీయ కర్తయైన సోముని స్తుతించినట్లుంది. మొదటి మండలంలో విష్ణాపు తండ్రిగా కృష్ణుడు 'కృష్ణియ' అనే శబ్దం ద్వారా సూచింపబడినాడు, ఎనిమిదవ మండలంలో కృష్ణుడు వృత్రాసురునివలె ఆర్య దేవతలకు వ్యతిరేకియైన అనార్య నాయకుడుగా కనిపిస్తాడు. కౌషీతకి బ్రాహ్మణం కృష్ణ అంగిరసుని మహర్షిగా పేర్కొన్నది. (కృష్ణోహ తదఙ్గరసో బ్రాహ్మణాన్ ఛందసీయ తృతీయం సవనం దదర్శ). ఐతరేయ ఆరణ్యకం కృష్ణహారీతుని ఒక మహర్షిగా చూపింది, ఛాందోగ్యోపనిషత్తు తద్ధైవదోఘోరంగిరసః కృష్ణాయదేవకీ పుత్రాయోక్త్వా ఉవాచాపిపాస ఏవబభూవ (3-17-6) అని ఘోర అంగిరసుని శిష్యుడైన దేవకీ పుత్రుడుగా పేర్కొన్నది.

వైదిక వాఙ్మయంలో ఒక మహర్షిగా, ఒక అనార్య నాయకుడుగా పిలవబడిన కృష్ణుడు దేవకీపుత్రుడుగా పేర్కొనబడడం గమనార్హం. మహర్షిగా అనార్య నాయకుడుగా ఉండిన కృష్ణుడు వేరు. దేవకీపుత్రుడైన కృష్ణునికి వీరితో సంబంధం లేదు. ఒక రకంగా ఆలోచిస్తే ఉపనిషత్తుల కాలం నాటికి అవతార సంప్రదాయం ఏర్పడి ఉండాలి, లేక ఏర్పడుతూనైనా ఉండాలి. దీనికి ఋగ్వేదంలోనే కొంత సాక్ష్యం దొరుకుతున్నది. ఒక దేవతను భిన్నదేవతలుగా భావించడం ఋగ్వేదంలో కనిపిస్తుంది. 'అగ్నిం వరుణమిత్రం ఇంద్రం ఆర్యమాణమాహుః' అనే మంత్రం దీనికి ఉదాహరణం. ఈ ఆలోచన ఉపనిషత్తుల కాలం నాటికి (క్రీ. పూ. 7వ శ) మరికొంత మార్పుకు లోనై విశ్వతోముఖుడైన పరబ్రహ్మకు అవతారాలు కల్పింపబడి, అవతార సంప్రదాయానికి ఒక మార్గం ఏర్పడి వుండవచ్చు.

**మహాభారతం:**

శ్రీకృష్ణుడి జీవితాన్ని ఒక క్రమపద్ధతిలో విపులంగా చూపిన మొట్టమొదటి గ్రంథం మహా భారతం. మహా భారతంలో శ్రీకృష్ణుడు ఒక పాత్ర కాబట్టి మహా భారత కథ జరిగిన కాలాన్ని స్థూలంగానైనా తెలుసుకుంటే శ్రీకృష్ణుడు నివసించిన కాలాన్ని కొంతవరకు గుర్తించవచ్చు. మహా భారతకాలాన్ని ఎందరో స్వదేశీయ విదేశీయ పండితులు చర్చించి చేసిన కాలనిర్ణయంలో ఎన్నో అభిప్రాయ భేదా

ఉన్నాయి. వి. బి. లాల్ అనే పురాతత్వ శాస్త్రవేత్త ఇప్పుడు దొరుకుతున్న భారతం పర్షియన్లను, గ్రీకులను, రోమన్లను పేర్కొనడంచేత క్రీ. శ. 4వ శతాబ్దికి ముందుదిగా చెప్పడానికి వీలుగాదన్నాడు. ('మహాభారత్-మిత్ అండ్ రియాలిటీ' అనే గ్రంథంలో. 1976. పుట. 52) క్రీ. పూ. 5వ శతాబ్దానికి చెందిన పాణిని తన అష్టాధ్యాయిలో మహా భారతాన్ని పేర్కొన్నాడు. మహా భారతంలోని కొన్ని పేర్లు వేదకాలంలోనే ప్రసిద్ధికెక్కినాయి. అందువల్ల భారతం చాల ప్రాచీన కాలంలోనే రచింపబడి ఉండాలి, కురుక్షేత్ర యుద్ధం తరువాత కొంత కాలానికి వ్యాసుడు భారతాన్ని రచించి ఉండవచ్చునని కొందరి అభిప్రాయం,

రెండవ పులకేశి వేయించిన ఐహోళె శాసనంలో (క్రీ. శ. 634) భారత యుద్ధ ప్రసక్తి వుంది. ఈ శాసనకాలం నాటికి అంటే క్రీ. శ. 634 నాటికి భారత యుద్ధం జరిగి 3735 సంవత్సరాలు అయిందని ఈ శాసనం చెపుతుంది. దీనిని బట్టి భారతయుద్ధం 3735-634=3101 సంవత్సరాల క్రీస్తు పూర్వం జరిగిందని తేలుతుంది. వాకాటక రాజైన దేవసేనుడు క్రీ. శ. 5వ శతాబ్దిలో వేయించిన హిస్సే బొరాల శాసనాన్ని డా॥ కాళ్లే వివరిస్తూ ధర్మరాజు సింహాసనమెక్కింది శకమానాన్ననుసరించి 3027 లో నని చెప్పాడు. మహా భారతయుద్ధం ద్వాపర కలియుగాల సంధికాలంలో జరిగిందని విష్ణుపురాణం చెపుతున్నది. (గీతా ప్రెస్ వారి విష్ణు పురాణం పుటలు. 355-56). ఐహోళె శాసనం సూచించిన క్రీ. పూ. 3101వ సంవత్సరం నుండి కలియుగం ప్రారంభమైందని ఒక సంప్రదాయ ఆలోచన ఉంది. నిజానికి శ్రీకృష్ణుని నిర్యాణంతో కలియుగం ప్రారంభమవుతుంది. మహాభారత మౌసల పర్వంలోని—

"షట్ త్రింశేత్వథ సంప్రాప్తే వర్షే కౌరవ నన్దన
దదర్శ విపరీతాని నిమిత్తాని యుధిష్ఠరః"

అనే శ్లోకాన్ననుసరించి శ్రీకృష్ణ నిర్యాణం భారతయుద్ధం తరువాత 36 సంవత్సరాలకు జరిగింది. అందువల్ల కృష్ణ నిర్యాణం జరిగింది, కలియుగం ప్రారంభమైంది 3101+36=3137లో నని అర్థం చేసుకోవాలి.

ఈ కాలనిర్ణయాన్ని బట్టి శ్రీ కృష్ణావతారం క్రీస్తు పూర్వానికి 31 శతాబ్దాలకు ముందు ముగిసిపోయి ఉండాలనిపిస్తుంది. ఈ కాలానికి వైదిక వాఙ్మయ

దశ కూడా ప్రారంభం కాలేదేమో. ఆర్య సంస్కృతి వికసించక ముందే సింధు నాగరికత వెలసి అస్తమించింది. సింధు నాగరికత చిహ్నాలు కొన్ని వైదిక సంస్కృతిలో కనిపిస్తాయి. ఆ రకంగా కృష్ణునికి సంబంధించిన గాథలు వైదిక వాఙ్మయంలో చోటుచేసుకొని వుండాలి. ఇది ఒక ఊహ మాత్రమే. బాలగంగాధర తిలక్ ఇప్పుడు దొరుకుతున్న భగవద్గీత క్రీ. పూ. 5వ శతాబ్ది నాటిదని అభిప్రాయ పడినారు (గీతా రహస్యం. రెండవ సంపుటం. పుట. 80). గీత భారతంలోని భాగమే కాబట్టి గీత కూడా క్రీస్తు పూర్వం 31 శతాబ్దాల ముందు కాలానికి సంబంధించినదిగానే వుండాలి. ఈ కాల నిర్ణయాలను పరిశీలిస్తే అభిప్రాయ భేదాలతో గందరగోళంగా వుంటుంది.

**చారిత్రక విశేషాలు :**

జరిగిన సంఘటనలను అధికారికంగా వివరించడం చరిత్ర. భారతీయ సంస్కృతి చరిత్రలో క్రీస్తు పూర్వం రెండవ శతాబ్దానికి ఒక ప్రత్యేకత వుంది. ఈ శతాబ్దిలో 'హెలియో దోరస్' అనే గ్రీకు దేశీయుడు విదిశా నగరంలో ఒక గరుడధ్వజాన్ని ప్రతిష్ఠించినట్లు ఒక శాసనముంది. భారతీయ మత చరిత్రలోకూడా ఇది ముఖ్యమైన విషయం. ఒక గ్రీకు దేశీయుడు భాగవతుడు కావడం, భారతీయ దేవతలకు భక్తుడు కావడం అరుదైన విషయం. ఇదే శతాబ్దానికి చెందిన మరొక శాసనం సంకర్షణవాసు దేవతత్త్వాన్ని గౌరవించడానికి ఉదయపూర్‌లో ఒక కట్టడాన్ని నిర్మించినట్లు తెలుపుతుంది. (డి. సి. సర్కార్‌గారి 'సెలెక్ట్ ఇన్‌స్క్రిప్షన్స్' మొదటి సంపుటం). ఈ రెండు శాసనాలు వైష్ణవంలోని భక్తి శాఖ ప్రాధాన్యాన్ని వివరిస్తున్నాయి. ఈ కాలంలోనే లేక కొంచెం ముందో ఛాందోగ్యోపనిషత్తు కూర్చబడింది. ఈ ఉపనిషత్తు భాగవత తత్త్వానికి లేక పాంచరాత్ర విధానానికి చెందినది. ఈ విషయాలను బట్టి ఆలోచిస్తే కృష్ణ కథ క్రీ. పూ. రెండవ శతాబ్దం నాటికి బాగా ప్రచారంలో వుండినట్లు అర్థమవుతుంది.

భారతీయ శిల్పకళలో కూడా శ్రీకృష్ణుని బొమ్మ క్రీ. పూ. రెండవ శతాబ్ది నుండి కనిపిస్తుంది. శ్రీకృష్ణుని బొమ్మ మొదటిసారిగా క్రీ. పూ. రెండవ శతాబ్దానికి చెందిన అగతక్లీస్ విడుదల చేసిన నాణాలపై కనిపిస్తుంది. ఇదే శతాబ్దికి చెందిన కాల్చిన పెంకులపై శ్రీకృష్ణుడు సాందీపుని దగ్గర బ్రాహ్మీ అక్షరమాల నేర్చుకుంటూ ఉండినట్లు చిత్రించబడింది. ఈ పెంకు హర్యానా రాష్ట్రంలోని సగ్

ప్రాంతంలో దొరికింది. (పి. బెనర్జీగారి 'కృష్ణ ఇన్ ఇండియన్ ఆర్ట్' లో) కుషాణ శిల్పాలలో శ్రీకృష్ణుని బొమ్మ విస్తారంగా భారతంలోని ఇతర బొమ్మలతో పాటు కనిపిస్తుంది. దీనికి కారణం శ్రీకృష్ణుని క్రీ. పూ. ఒకటి రెండు శతాబ్దాలలో దివ్యుడుగా భావించడమే. ఇలా శిల్పాలలో కృష్ణుడు కనిపించడానికి ప్రేరణ భారతం. మహాభారతంలో శ్రీకృష్ణుడు యోగిగా, రాజుగా, దివ్యుడుగా ఆనాటి ప్రజలపై ఎంతో ప్రభావం చూపడం కూడా దీనిని బలపరుస్తుంది. పైగా ఈ బొమ్మలన్నీ మధుర ప్రాంతంలో అంటే శ్రీకృష్ణుని జన్మస్థలంలో దొరకడం విశేషం.

**పురాణాలు :**

పురాణాలన్నీ వ్యాసభారతం తరువాతనే వెలశాయని చారిత్రకుల నమ్మకం. పురాణాలలో శ్రీ కృష్ణావతారం అన్ని హంగులతో పూర్ణతమావతారంగా తీర్చబడింది. "యస్తు నారాయణో నామదేవ దేవః తస్యాంశో మానుషేష్వా సీద్వాసుదేవః ప్రతాపవాన్" అని భారతం పిచెతే, భాగవత పురాణం "మత్స్యాశ్వకచ్ఛప నృసింహ వరాహహంస రాజన్య విప్రవిబుధేషు కృతావతారః" అని శ్రీకృష్ణుడే అవతారాలన్నింటిని ధరించినట్లు చెప్పింది. పురాణాలలో శ్రీకృష్ణుని బాల్య క్రీడలు, రాసక్రీడలు విపులంగా వర్ణింపబడినాయి, రాధాకృష్ణుల ప్రణయ వృత్తాంతం పురాణాలనుండే బయటకు వచ్చింది. ఒక రకంగా పురాణ కాలం వరకు ఉత్తర భారతదేశంలోనే ప్రచలితంగా ఉండిన కృష్ణకథ క్రమంగా దక్షిణ భారతానికి వ్యాపించింది. ఈ వ్యాప్తిలో భాగవత పురాణపాత్ర గొప్పది. బౌద్ధ సాహిత్యం కూడా కృష్ణ కథను ప్రచారం చేసింది. ఘట జాతకం పూర్తిగా కృష్ణ కథనే వివరిస్తుంది.

**పాశ్చాత్య పండితుల ఊహలు :**

బాలగంగాధర తిలక్ భగవద్గీత క్రీ. పూ. 500 సంవత్సరాల నాటిదని నిర్ణయించారు. ఈ ఊహనే పాశ్చాత్యులు అంగీకరిస్తున్నారు. డబ్లు. డి. హిల్ అనే పండితుడు అవతార ప్రస్తావన భగవద్గీత కాలం నుండి కనిపిస్తున్నదని, అది పూర్తిగా తయారై స్థిరపడి ఇతర ప్రాంతాలకు వ్యాపించింది క్రీ. పూ. రెండవ శతాబ్దినుండి వుండవచ్చునని అభిప్రాయపడినాడు. (ఆషాగోస్వామి గారి 'కృష్ణకథ

అండ్ అల్లైడ్ మ్యాటర్స్' అనే గ్రంథం నుండి, 1984, పుట 183). ప్రాచీన కాలంలో భారత దేశంలో రాముడు, కృష్ణుడు మొదలైన గొప్ప గొప్ప వీరులు వర్ధిల్లినారు. వీళ్ళు దివ్యపురుషులుగా భావింపబడి ఆరాధింపబడినారు. దివ్యత్వమనే సూత్రం వీరినందరిని ఒకరి తరువాత ఒకరిని కూర్చింది. కాలాలు మారుతున్నకొద్దీ - ఒక కాలంలో వర్ధిల్లిన దివ్యపురుషుడు మరొక కాలంలో పుడుతున్నాడనే విశ్వాసం ప్రజల్లో ఏర్పడింది. ఈ విశ్వాసమే అవతారాలకు హేతువని పాశ్చాత్య పండితుల ఆలోచన.

## నాలుగు వ్యూహాలు :

వ్యూహాలు వేరు. అవతారాలు వేరు. దశావతారాలలో అందరికీ వ్యూహాలు ఉండవు. శ్రీ కృష్ణునికి మాత్రం నాలుగు వ్యూహాలు ఉన్నట్లు మహాభారతం పేర్కొన్నది. ఒకే అవతారంలో భిన్న కార్యాలు నిర్వర్తించడానికి భిన్నరూపాలు ధరించడం వ్యూహాల ప్రయోజనం. శ్రీ కృష్ణునికి వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ వ్యూహాలు ప్రసిద్ధం. భీష్మపర్వం (42-344) ఈ వ్యూహాలను వేదాంత పరంగా పురుషుడు, జీవుడు, బుద్ధి, అహంకారాలకు ప్రతీకలుగా పేర్కొన్నది. ఈ పర్వమే మరొక సందర్భంలో నర, నారాయణ, హరి కృష్ణులను నాలుగు వ్యూహాలుగా పేర్కొన్నది. ఈ విషయాలను క్రీ. పూ. రెండవ శతాబ్దిలో హెలియోడోరస్ ప్రతిష్ఠించిన గరుడ స్తంభ వృత్తాంతంతో పోల్చి చూస్తే మహాభారతకాలం నుండి అంకురించి వికసించిన భాగవత సంప్రదాయం క్రీ. పూ. రెండవ శతాబ్దికి బాగా ప్రచారం పొందినట్లు బోధ పడుతుంది. ఆర్యసంస్కృతిలో మొదటి దశలో పశుపాలన వ్యవసాయం ప్రధాన వృత్తులుగా కనిపిస్తాయి. వాసుదేవ సంకర్షణ వ్యూహాలు ఈ రెండు వృత్తులకు ప్రతీకలుగా కొందరు భావిస్తారు. తరువాత తరువాత ఈ రెండు వ్యూహాలకు కథలు కల్పింపబడి ఉండవచ్చు.

## మహాభారతం వాస్తవమా ? :

మహాభారతం అంతా కాకున్నా కొంతవరకు వాస్తవ సంఘటనలనే వర్ణించిందని చాల మంది విశ్వసిస్తారు. మహాభారత చారిత్రకత పైననే శ్రీ కృష్ణుని చారిత్రకత ఆధారపడుతుంది. వి. సి. పాండే అనే పండితుడు మహాభారత

సంఘటనలు కొంతవరకు వాస్తవమైనవేనని అంగీకరిస్తున్నారు. (మహాభారత మిథ్ అండ్ రియాలిటీ గ్రంథంలో పుట. 183) మహాభారత పాత్రలు వైదిక వాఙ్మయంలో కనిపించడం ఆయన చూపే సాక్ష్యం. మహాభారత కాలంనాటి ఎన్నో యాత్రాస్థలాలు ఇప్పటికీ వున్నాయి. శ్రీకృష్ణ భీమార్జునులు జరాసంధుని నగరానికి వెళుతూ మార్గమధ్యంలో చూచిన పద్మసరస్సు కురుక్షేత్రానికి (హర్యానా రాష్ట్రంలో ఉంది) 182 కిలో మీటర్ల దూరంలో ఇప్పటికీ వుంది. 'అమీన్' అనే పేరుతో ఒక ప్రాంతం కురుక్షేత్రానికి 9 కిలో మీటర్ల దూరంలో వుంది. ఇది అభిమన్యుని పేరు మీద ఏర్పడిందని అక్కడి ప్రజల విశ్వాసం. 'సపిదన్' అనే మరొక స్థల నామం జనమేజయుని సర్పదమన యజ్ఞాన్ని గుర్తు చేస్తున్నది. మహాభారత యుద్ధం జరిగినట్లు బ్రాహ్మణ మతమే కాక బౌద్ధ జైన మతాలు కూడా అంగీకరిస్తున్నాయి. మహాభారత కాలం నాటివిగా చెప్పబడే కొన్ని ప్రాంతాలను పురాతత్త్వ శాస్త్రవేత్తలు తవ్వి ప్రాచీన అవశేషాలను బయటికి తీశారు. ఈ సాక్ష్యాలను బట్టి భారత కథకు చారిత్రకత ఉందని విశ్వసించవచ్చు.

పురాతత్త్వ శాస్త్రవేత్తలు అనాటి హస్తినాపురమని పిలవబడిన నేటి ఢిల్లీ-మీరట్ ప్రాంతాల సమీపంలో జరిపిన తవ్వకాలనుండి బయటపడిన రంగులు అద్దిన కుండపెంకులను ఆధారంగా చేసుకొని భారతంలో వర్ణింపబడిన సంస్కృతి క్రీ. పూ. 1100 సంవత్సరాల నాటిదని అంచనా వేశారు. మహా పద్మనందుడికి పరీక్షిత్తుకు మధ్య 1000 నుండి 1500 సంవత్సరాల వ్యత్యాసం వుందని పురాణాలు పేర్కొంటున్నాయి. ఇలా పౌరాణిక చారిత్రక వాస్తవాలను పరిశీలిస్తే మహాభారత యుద్ధం ఐహోళె శాసనం పేర్కొన్నట్లు క్రీ. పూ. 3101 కాకుండా యింకా ముందుకు వస్తుంది. మహాభారత యుద్ధం సుమారు క్రీ. పూ. 1200 సంవత్సరాల నాటిదని విశ్వసిస్తే శ్రీకృష్ణుడు కూడా అప్పటివాడేనని నిర్ణయించాలి. అంటే శ్రీకృష్ణుడు భారతదేశంలో 3200 సంవత్సరాలకు ముందు ఒక దివ్యపురుషుడుగా జీవించాడని అర్థం.

**ఉప సంహారం :**

భారత సంఘటనలు జరుగుతూ వుండిన కాలంలోనే వ్యాసునిచే రచితమైన భారతం మనకీనాడు దొరకదు. ఇప్పుడు దొరికే భారతం వ్యాసభారతానికి ఎంత దూరంలో ఉందో కూడా తెలియదు. పురాణాల సంగతి కూడా ఇంతే. కొందరు

చరిత్రకారులు భావించినట్లు ఇప్పుడు లభ్యమవుతున్న భారతం క్రీస్తు శకారంభంలో తయారైంది. ఇది భారత కథను, పాత్రలను సంబంధించిన వివిధాంశాలను విపులంగా చెప్పగలుగుతుందే కాని దివ్యభావానికి మానవులు రూపం ఎప్పుడు కల్పించారో వివరించలేదు. శ్రీకృష్ణుని పరమాత్మకు ప్రతినిధిగా ఎప్పటినుండి భావించారో తెలిసే ఆధారాలు లేవు. దివ్యత్వం ఆధారసహితంగా నిరూపింపబడదు. భారతదేశంలో ఎప్పుడో తయారైన కృష్ణకథ ఆ తరువాత ఎప్పుడో రచింపబడిన భారతానికి ఎక్కింది. భారత రచనా కాలం, కృష్ణుని కాలం ఒకటి కావేమో, అయితే భారతంలో కృష్ణకథ ఒక క్రమాన్ని అనుసరించి ఉండడం, ఈ క్రమాన్ని తరువాత వచ్చిన సాహిత్యం ఇంకా విపులతరం చేసి అవతార ప్రయోజనాన్ని వివరించడం మనకు తెలిసిన సంగతి.

భారతమే శ్రీకృష్ణుని విష్ణ్వవతారంగా వర్ణించి అందులో ప్రధాన పాత్రగా చేసింది. భారతయుద్ధం క్రీ. పూ. 3101 నుండి క్రీ. పూ. 1200 సంవత్సరాలమధ్య జరిగినట్లు చారిత్రకాధారాలు నిరూపిస్తున్నాయి. ఈ మధ్యకాలంలోనే శ్రీకృష్ణుని జీవితం వుంది అయితే క్రీ. పూ. రెండవ శతాబ్దినుండి శ్రీకృష్ణ కథ విపుల ప్రచారం పొందింది. వివిధ సాహిత్య ప్రక్రియల కెక్కింది. శ్రీకృష్ణుని జీవితం క్రీ. పూ. 3101 నుండి క్రీ. పూ. 1200 సంవత్సరాల మధ్య ఎక్కడో ఉండి వుండాలి. దీన్ని ఇంతకు మించి ఖచ్చితంగా నిరూపించడం కష్టం. శ్రీకృష్ణుడు దేవుడు, అవతారపురుషుడు అనే విషయంలో సందేహం లేదు. భారతదేశంలో ఆయన జీవించి నిర్యాణం పొందిన తరువాత ఎన్నో సంవత్సరాలకు కాని ఆయన కథ గ్రంథస్థం కాలేదు. ఆ కథను మొదట గ్రంథస్థం చేసింది భారతమే కాబట్టి శ్రీకృష్ణుడు భారతకాలం వాడేనన్న విశ్వాసం ఏర్పడింది. కాని ఇది వాస్తవం కాదు.

ఈనాడు మనకు దొరుకుతున్న ప్రాచీన సాహిత్య గ్రంథాలలో ముఖ్యంగా భారతం, కొన్ని పురాణాలు ఎన్నో సార్లు మరల మరల రచింపబడినాయి. మౌర్య సామ్రాజ్య స్థాపన కాలంలోను, దానికి ముందూ వెనుక మనదేశంపై ఇతరదేశాల దాడులు జరిగాయి. ఆ దాడులలో ఎంతో సాహిత్యం నష్టమైంది. అలా నష్టమైన సాహిత్యాన్ని తరువాత తరువాత అరకొరగా లభిస్తూ వుండిన ఆధారాలననుసరించి, మౌఖిక సంప్రదాయాన్ననుసరించి తిరిగి రాసుకోవలసిన అవసరం ఏర్పడింది,

సమకాలాల విశేషాలు సాహిత్యంలో ప్రవేశించాయి. ఈ కారణాలవల్ల ప్రాచీన సాహిత్యంలోని పాత్రల మనస్తత్వాలలో కొంత అర్వాచీనత చోటు చేసుకోవడం సహజం. ఇప్పుడు లభిస్తున్న మహాభారతం క్రీస్తు శకారంభ కాలం నాటిదని పండితులు భావించడంవల్ల శ్రీకృష్ణుడు కూడా అదే కాలానికి చెందినట్లు భావించవలసి వస్తున్నది. ఇది సరైన ఆలోచన కాదు. శ్రీకృష్ణుడు క్రీ. పూ. 3101 నుండి క్రీ. పూ. 1200 సంవత్సరాల మధ్యకాలంలో వర్ధిల్లినాడని చెప్పడానికే ఎక్కువ ఆధారాలున్నాయి. అయినా మానవుని సృష్టించిన దేవుని కాలాన్ని నిర్ణయించడం సాధ్యమవుతుందా? వివిధకాలాలలో వ్యక్తమైన శ్రీకృష్ణ తత్త్వాన్ని చారిత్రకంగా పరిశీలించడమే మనం చేయగలిగింది.

# 9. అడవి బాపిరాజు చారిత్రక నవలలు

అడవి బాపిరాజు కవి, కథకుడు, చిత్రకారుడు, నవలాకారుడు. నవలా కారుడుగానే ఆయనకు గుర్తింపు, గౌరవం. ఆయన నవలలు రాసిన కాలం నాటికి తెలుగు సాహిత్యంలో నవల ఒక ప్రక్రియగా వికాస దశలో ఉంది. భావకవిత్వ దశలో రచనలు చేసిన బాపిరాజు తెలుగు దేశానికి భావకవిత్వమిచ్చిన బంగారు పంట. తన కవితల ద్వారా భావకవితా ఉద్యమాన్ని కూడా ఆయన ప్రదీప్తం చేశాడు. ఆయన కథలలో వాస్తవిక చిత్రణతో పాటు కళాత్మక విలువలు గుభా ళిస్తాయి. ఆయన గీసిన చిత్రాలలో జీవత్వం, అపురూప సౌందర్యం గోచరిస్తాయి. తరువాత వచ్చిన చిత్రకారుల కెందరికో ఆయన మార్గదర్శి. ఆయన నెరపిన పత్రికా సంపాదకత్వం ప్రత్యేకతను సంతరించుకొన్నది, ఆయన సాంఘిక నవలలు, చారిత్రక నవలలు రచించాడు. ఈ నవలలు వాస్తవ సమాజ చిత్రణతో పాటు కళాత్మక విలువలను, మానవత్వంలోని ఆదర్శ భావాలను ప్రతిపాదిస్తాయి. తన రచనలలో ఆయన సృష్టించిన పాత్రలు కుంచెను వివిధ రంగులలో ముంచి చిత్రించిన బొమ్మలు. హావభావాది జీవలక్షణాలలో ఇవి ప్రతిపాదిత భావాల కనుగుణంగా విన్యసిస్తూ మనముందు నిలబడతాయి.

బాపిరాజు నవలలను పరిశీలించే ముందు ఆయన నవలలు రాసిన కాలపు సాహితీ నేపథ్యాన్ని కొంత అర్థం చేసుకోవలసి వుంటుంది. ఆయన రచనలన్నీ 1920 నుండి 1947 మధ్యకాలంలోనే రూపు దాల్చాయి. ఈ 27 సంవత్సరాల కాలం ఆంధ్ర సాహిత్య చరిత్రలో చాలా ముఖ్యమైంది. సుమారు 1920 నుండి 40 వరకు భావకవితా ఉద్యమం విస్తరిల్లింది. అప్పటినుండి అభ్యుదయ కవితా ఉద్యమం ప్రారంభమైంది. భావకవిత్వం రాసిన కవులలో కొందరు అభ్యుదయ

కవులైనారు. అభ్యుదయాన్ని కాంక్షించిన కవులలో కొందరు మళ్ళీ సంప్రదాయ సాహిత్యాన్ని సృష్టించడంలో అభిరుచి చూపారు. అభ్యుదయ కవిత్వాన్ని మార్క్సి సిద్ధాంతాల ప్రాతిపదికలో నిర్మించడానికి కొందరు ప్రయత్నిస్తే, మరికొందరు సంప్రదాయాన్ని పునరుద్ధరించడంలోనే అభ్యుదయముందని నమ్మి తదనుగుణమైన రచనలు చేశారు. మొదటి వర్గానికి శ్రీశ్రీ, రెండవ వర్గానికి విశ్వనాథ ఆద్యులు. సంప్రదాయమనే మాట ప్రాచీన సాహిత్యానికి వర్తిస్తుంది. ఆధునిక సాహిత్యంలో ప్రాచీన సాహిత్య విలువలను పునరుద్ధరిస్తూ చేసిన రచనలు నవ్య సంప్రదాయ రచనలు. పౌరాణిక ఇతివృత్తాలను, చారిత్రక ఇతివృత్తాలను గ్రహించి కావ్యాలుగా రాసి వాటి ద్వారా ప్రాచీన సంప్రదాయమే మంచిదని ప్రతిపాదించే రచనలు ఈ ఈ నవ్య సంప్రదాయానికి చెందుతాయి. భావకవిత్వంతో సంబంధముండిన విశ్వనాథాదులు ఈ రకమైన ప్రవృత్తితో రచనలు చేశారు. ఇది ఒక ఉద్యమంగా కాకపోయినా అభ్యుదయ కవితా మార్గానికి సమాంతరంగా వికాసం పొందిన ఒక ప్రవృత్తిగా కనిపిస్తుంది. ఈ నేపథ్యంలో స్వాతంత్ర్యోద్యమం ఆ కాలపు కవులకు, రచయితలకు, చిత్రకారులకు ఎంతో స్ఫూర్తినిచ్చింది. జాతీయోద్యమ స్ఫూర్తితో దేశభక్తి ప్రబోధితాలైన రచనలు వచ్చాయి. దేశభక్తి, ఆత్మ త్యాగం, ధర్మ దీక్ష మొదలైన లక్షణాలు ఈ రచనలలో కనిపిస్తాయి. ఇతిహాస పురాణా ల్లోని ఈ రకమైన లక్షణాలతో సమన్వయపరచి చూపడం నవ్య సంప్రదాయంలో భాగమైంది. దేశభక్తిని స్ఫురింపజేయడానికి కొందరు ఆంధ్రదేశ చరిత్రలోని ఘట్టాలను కవితాబద్ధం చేశాడు. తరతరాల ఆంధ్రుల చరిత్రను వస్తువుగా తీసికొని మరికొందరు నవలలుగా మలిచారు. ఇది బాపిరాజు నవలలను పరిశీలించడానికి కావలసిన నేపథ్యం.

బాపిరాజు నవలలు :

నారాయణరావు [రచన 1932-ప్రచురణ 1940], తుఫాను [రచన 1944-ప్రచురణ 1944], కోనంగి [రచన 1946-ప్రచురణ-1946. నరుడు [రచన 1946-ప్రచురణ 1947], జాజిమల్లి [రచన 1951-ప్రచురణ 1951] బాపిరాజు సాంఘిక నవలలు. ఈ నవలలలో సమకాలీనమైన కథలున్నా నవ్య సంప్రదాయ లక్షణాలు కొట్టొచ్చినట్లు కనబడతాయి.- నాటి సాంఘిక పరిస్థితులు, రాజకీయోద్యమాలు దేశ స్థితిగతులలో వస్తున్న మార్పులు, ప్రణయ భావ సంఘర్షణలు మొదలైన అంశాలే

గాక కవిత్వానికి, కళలకు సంబంధించిన అంశాలు కూడా ఈ నవలలో చోటు చేసుకున్నాయి. మానసిక వికాసం కళాత్మక చైతన్యంతోనే కలుగుతుందని, దానితో జీవిత గమనంలో ఏర్పడే సమస్యలు విడిపోతాయని బాపిరాజు నమ్మకం. ఇదే ఈ నవలలో ప్రతిపాదితమైంది. మానసిక సంఘర్షణ ఏర్పడినప్పుడు మనిషి ప్రవలో భాలకు లోనుకాకుండా ఆత్మోద్ధరణ ద్వారానే జీవిత గమ్యాన్ని చేరుకోగలడనే అంశం ఈ సాంఘిక నవలలో కనిపించే సాధారణ విషయం. నారాయణరావు నవలలో సాంఘిక అంతస్థుల కారణంగా నారాయణరావుకు ఆయన భార్య శారదకు మధ్య ఏర్పడిన అగాధం శారద నారాయణరావు హృదయ సంస్కారాన్ని, ఔన్నత్యాన్ని గుర్తించి ఆత్మార్పణ చేసుకోవడంతో తొలగిపోతుంది. శ్రీనాథమూర్తి భార్య శకుంతల చనిపోవడం కారణంగా చెలరేగిన పెనుతుఫాను తుఫాను నవల ఇతివృత్తం. ఇతడు తన భార్య చెల్లెలిని పెండ్లాడడంతో కథ ముగుస్తుంది. శకుంతల మరణానికి, ఆమె చెల్లెలుతో శ్రీనాథమూర్తి వివాహానికి మధ్య శ్రీనాథమూర్తి పాత్ర పొందిన మానసిక పరిణామం సంప్రదాయ వివాహ మహత్వాన్ని సూచిస్తుంది. వర్ణాంతర వివాహాల ఆవశ్యకతను తెలపడానికి రాసిన నవల కోణంగి. ఎంతటి విషాదాన్నయినా హాస్యపూరితంగా, అలవోకగా తీసుకొంచే జీవితం తేలికగా ఉంటుందని చెప్పడం ఈ నవల ఉద్దేశం. బాపిరాజు అనాటి ఉద్యమాలను తన నవలలకు భూమికలుగా చేసుకున్నారు. స్త్రీ జనాభ్యుదయానికి చదువులూ, కళలూ ఎంత ముఖ్యమో చెప్పడానికి 'జాజిమల్లి' నవల రచించాడు. ఇందులో చేపలలో పుట్టి చేపలలో పెరిగిన పద్మావతి పంకజం లాగా సంగీత సరస్వతియై తన గాన మాధుర్యంతో దేశాన్ని ఉర్రూతలూగించడం విషయం. ఈ పాత్రకు దుర్గాభాయి దేశ్‌ముఖ్ స్థాపించిన ఆంధ్ర మహిళా సభ స్ఫూర్తి. నరుడు నవలలో బాపిరాజు ప్రేమకు కట్టుబాట్లు, హద్దులు ఉండవని చెబుతూ ఒక అట్టడుగు కులస్థునికి [చర్మకారుడైన ఎల్లమంద] ఒక ఆంగ్ల యువతితో ఏర్పడిన ప్రణయ భావాన్ని రసవత్తరంగా చిత్రించాడు.

**చారిత్రక నవలలు :**

వాస్తవికత, కాల్పనికత, ఊహాకల్పనా చమత్కారం, సమాహార స్వభావం నవలకు తప్పకుండా ఉండవలసిన మౌలిక లక్షణాలు. వీటిలో వాస్తవికత ప్రధానం గాను, మిగిలినవి దానికనుబంధంగాను వుంటాయి. ఈ లక్షణాలన్నీ వస్తువుకు సంబంధించినవే. ఊహాకల్పనా చమత్కారం, సమాహార స్వభావం అనే లక్షణాలు

రచయిత రచనా సామర్థ్యంపై ఆధారపడతాయి. ఇవి కొంతవరకు కథన విధానానికి చెందినవిగా కూడా ఉంటాయి. వాస్తవికత, కాల్పనికత అనేవి కావ్యాలలోలాగ నవలలలో కూడా ముఖ్యమైనవి. నవల ఆధునిక ప్రక్రియ కాబట్టి వాస్తవికతను ప్రతిబింబించాలి. వస్తువును యథాతథంగా గ్రహించడానికి వీలుకాదు కాబట్టి కాల్పనికత అవసరం. ఇవన్నీ సాంఘిక నవలలకు పట్టే లక్షణాలు, ఈ లక్షణాలు చారిత్రక నవలలకు కూడా పడతాయి. చారిత్రక నవలలో వాస్తవికతకు బదులు చారిత్రక సత్య నిబద్ధత ఉండాలి. చరిత్రలోని సంఘటనలు కథావస్తువులైనప్పటికీ కల్పన లేకుంటే కేవలం చరిత్ర అవుతుందేగాని చారిత్రక నవలత్వం సిద్ధించదు. చరిత్ర గతానికి సంబంధించినది. గతానికి చెందిన వస్తువును నవలగా రాస్తున్న రచయిత గమనించవలసిన లక్షణాలు చాలా ఉన్నాయి. చారిత్రక నవలలో చరిత్ర, కావ్యత్వం లేదా కాల్పనికత ఉంటాయి. చరిత్రకు వాస్తవం ప్రమాణమైతే చారిత్రక నవలకు కళాపారీణత్వం ప్రమాణంగా ఉండాలి. చరిత్ర గత జీవితాన్ని చిత్రిస్తే చారిత్రక నవల గత జీవితాన్ని వర్తమానానికి అనువుగా వ్యాఖ్యానిస్తుంది. ఈ సాధనలో నవలాకారుని ప్రతిభ కనపడుతుంది. నవలాకారుడికి చరిత్ర కరతలామలకంలా ఉండాలి. చరిత్రలోని పరిణామక్రమం బాగా తెలిసి ఉండాలి. చరిత్ర వర్తమాన సమాజంలో ఎలా ప్రతిఫలిస్తున్నదో సమాజంలోని ఏయే అంశాలను చరిత్రకాంశాలతో పోల్చడానికి వీలవుతుందో తెలియాలి. మత, సాహిత్య, సాంస్కృతిక విషయాల పరిణామక్రమంతోపాటు ఆర్థిక, సాంఘిక, నైతిక, ధార్మిక విషయాలతో గాఢమైన పరిచయం ఉండాలి. చరిత్రలో మానవుని ఆలోచనలను పరిణామక్రమంలో నియంత్రిస్తూ వచ్చిన తాత్త్విక విషయాలు బాగా తెలియాలి. వీటన్నిటితోపాటు వివిధ కళలలో నిష్ణాతులుగా ఉండాలి. లేదా కనీసం కళలతో మంచి పరిచయమైనా ఉండాలి. ఇన్ని లక్షణాలుంటే తప్ప నవలాకారుడు చారిత్రక నవలను రచించి మెప్పించలేడు. బాపిరాజులో ఈ లక్షణాలన్నీ పుష్కలంగా వున్నాయని ఆయన చారిత్రక నవలలు సాక్ష్యమిస్తాయి.

ప్రాచీన సంప్రదాయాలను నేటి సమాజాలకనుకూలంగా పునరుద్ధరించుకోవాలనే ప్రవృత్తి ఏర్పడిన కాలంలో చారిత్రక కావ్యాలు, చారిత్రక నాటకాలు, చారిత్రక నవలను పుట్టాయి. చారిత్రక కావ్య నాటక కర్తలకు చరిత్రలోని ఘట్టాలను కళామయంగా మలచాలనే దృక్పథం కంటె ఆ వస్తువుల ద్వారా జాతికి ఒక వినూత్న సందేశాన్ని అందించాలనే ఆకాంక్ష బలంగా ఉంటుంది. దేశాభిమానం,

దేశ సమైక్యత ఈ సందేశంలో భాగాలు. చారిత్రక నవలాకారులకు కూడా ఇలాంటి అభిప్రాయం వుంటుంది. దీనితోపాటు పాత్రల స్వభావాలను, నేటి సమాజంలోని వ్యక్తుల మనస్తత్వాలను ప్రతిబింబాలుగా మలిచి చరిత్రలోని వ్యక్తుల వ్యక్తిత్వాలు పాఠకుల నాకర్షించేటట్లు చేయడం చారిత్రక నవలాకారుని బాధ్యత. ఈ బాధ్యత సరిగా నెరవేర్చలేకపోతే నవలలోని పాత్రలు సమాజానికి దూరంగానే వుండిపోతాయి. చరిత్రలోని ఘట్టాలను 'నవలలోని కథా కథనానికి అనుకూలంగా మలుచుకోవడం ఒక పెద్ద ప్రయత్నమైతే, చారిత్రకాంశాలను ఔచిత్యవంతంగా మార్చి కల్పించుకోవడం ఆ ప్రయత్నంలో మరొక భాగం. చరిత్రలో లేని కళానుభవం, రసానుభవం చారిత్రక నవలలో ఉండాలి. చరిత్ర ఘట్టాలను అతికే ఒక తాత్త్విక సూత్రం, ఒక సామాజిక ప్రయోజనం వుండాలి. ఈ లక్షణాలన్నీ వుంటే చారిత్రక నవల పఠితలను ఆకట్టుకొంటుంది.

బాపిరాజు కేవలం నవలాకారుడు కాదు. ఆయనలోని ఇతర కళాంశాలు నవలా రచనలో ఆయనకు ఉపకరించాయి. చరిత్ర ఆయనకు అభిమాన విషయం. ఆంధ్రుల చరిత్ర అంటే మరీ అభిమానం. ఆంధ్రదేశాన్ని పాలించిన వివిధ రాజ వంశాల చరిత్రను ఆయన దీక్షతో అధ్యయనం చేశాడు. ఈనాడు ఆంధ్రుల చరిత్రకు సంబంధించిన వివరాలన్నీ దొరుకుతున్నాయి. బాపిరాజు నవలలు రాస్తుండిన కాలంలో తెలిసిన ఆంధ్రుల చరిత్రలోని కొన్ని అంశాలు తరువాత తరువాత ఎన్నో ఆధారాలనుండి నూతనంగా లభించిన వస్తుసామగ్రి ఫలితంగా మారిపోయాయి. అందువల్ల ఆయన రచించిన చారిత్రక నవలలను అప్పటికి తెలిసిన ఆంధ్రుల చరిత్ర ప్రాతిపదికతో పరిశీలించవలసి ఉంటుంది.

హిమబిందు [రచన 1945 - ప్రచురణ 1946], అడవి శాంతిశ్రీ [రచన 1947-ప్రచురణ 1958], అంశుమతి [రచన 1950-ప్రచురణ 1950], గోన గన్నారెడ్డి [రచన 1943-ప్రచురణ 1943], కైలాసేశ్వరుడు, శిలారథం, మధురవాణి [రచన 1947] అనే ఏడు బాపిరాజు రచించిన చారిత్రక నవలలు. వీటిలో అంశుమతి నవలిక. మధురవాణి, శిలారథం, కైలాసేశ్వరుడు అసంపూర్ణ నవలలు. హిమబిందులోని కథ శాతవాహన వంశానికి సంబంధించినది. అడవి శాంతిశ్రీ ఇక్ష్వాకుల కాలానికి చెందిన కథను ప్రతిపాదిస్తుంది. అంశుమతిలోని కథ తూర్పు చాళుక్యులది. గోనగన్నారెడ్డి కాకతీయుల కాలంనాటి కథను చిత్రి

స్తుంది. మధురవాణి తంజావూరు రఘునాథ నాయకుని కాలానికి చెందిన నవల. విజయనగర సామ్రాజ్య చరిత్రకు చెందిన ఒక ఘట్టాన్ని చిత్రించిన నవల శిలారథం. కళ్యాణి చాళుక్యుల పాలనకు చెందిన అంశాలను వివరించే నవల కైలాసేశ్వరుడు. ఆంధ్ర దేశాన్ని పాలించిన ప్రధాన రాజవంశాల చరిత్రలను బాపిరాజు నవలలుగా రాశాడు. ఎందుకో రెడ్ల చరిత్ర ఆయన దృష్టిలో పడలేదు. బాపిరాజు చారిత్రకాంశాలకు కొన్ని కల్పనలు జోడించి ఔచితీవంతంగా ఈ నవలలను సృష్టించాడు. కొన్నిటిలో చారిత్రకాంశాలను యథాతథంగా తీసుకొన్నాడు. కొన్నిటిలో కల్పనలకు ఎక్కువ చోటిచ్చాడు. ఎలా చేసినా రసవంతంచేసి పాఠకులను ఆకట్టుకున్నాడు. ఇప్పుడు కూడా బాపిరాజు చారిత్రక నవలలను చదివే పాఠకులుండడానికి కారణం ఆయన ఆనాటి చరిత్రను ఇప్పటిదా అనే స్ఫురణతో మనముందు ప్రదర్శింప జేయడం. బాపిరాజు చారిత్రక నవలలను పరిశీలించే ముందు ఆ నవలల్లోని కథాంశాలను స్థూలంగానైనా తెలుసుకోవడం అవసరం.

## కథాంశాలు :

### A. హిమబిందు :

ఈ నవలలోని కథ శాతవాహనులకు సంబంధించినది. శ్రీముఖ శాతవాహనుడు ధాన్యకటకం రాజధానిగా ఆంధ్ర సామ్రాజ్యాన్ని పాలించాడు. ఇతడు పాటలీపుత్రాన్ని జయించి జంబూ ద్వీప చక్రవర్తి కావడం ఇందులోని కథ. శ్రీముఖుని జన్మదినం సందర్భంగా జరిగిన ఉత్సవాల్లో ఎద్దులబండ్ల పోటీలు జరిగాయి. ఈ పోటీలలో మహాశిల్పి ధర్మనందుని కుమారుడు సువర్ణశ్రీ గెలుస్తాడు. సంపన్నుడైన చారుగుప్తుని తనయ హిమబిందు సువర్ణశ్రీని, ప్రేమిస్తుంది. వారిద్దరూ అనురాగ బద్ధులౌతారు. శ్రీముఖునికి కృష్ణశాతవాహనుడు మంజుశ్రీ అనే ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు ఉన్నారు. శ్రీముఖుడు బౌద్ధుడైనా అన్ని మతాలను సమానంగానే ఆదరించాడు. అయినా వైదికమత సంప్రదాయం అడుగంటిపోవడం సహించని స్థాలతిష్య మహర్షి తన మనుమరాలైన చంద్రబాలను విషకన్యగా మార్చి రాజైన కృష్ణశాతవాహనునిపై ప్రయోగించి అతనిని చంపించి ఆర్ష ధర్మాన్ని పునరుద్ధరించాలనుకుంటాడు. ఈ కారణంగా మంజుశ్రీని అపహరించి దాచిపెడతాడు.

దేశంలో యుద్ధం ప్రారంభమవుతుంది. మాళవులు, పుళిందులు భోజులు మొదలైన వారు ఉజ్జయినిని ముట్టడిస్తారు. చారుదత్తుడు యుద్ధానికి కావలసిన ధనాన్ని భరించి చక్రవర్తికి సహాయంచేసి తద్వారా హిమబిందును కృష్ణశాతవాహనుని కిచ్చి వివాహం చేయాలనుకుంటాడు. ఈ విషయం తెలిసిన సువర్ణశ్రీ హిమబిందు మీద ఆశ వదలుకొని ఆమెను మహారాజ్ఞిగా భావిస్తాడు. దొంగలు హిమబిందును ఆమె అవ్వను అపహరించుకొని పోగా సువర్ణశ్రీ కాపాడతాడు. స్థౌలతిష్యుడు అపహరించిన మంజుశ్రీ కూడా సువర్ణశ్రీకి దొరుకుతాడు. యుద్ధంలో పాల్గొని సువర్ణశ్రీ చక్రవర్తికి విజయాన్ని చేకూర్చుతాడు. తనపై ప్రయోగింపబడిన విషకన్యను కృష్ణశాతవాహనుడు ప్రేమించి ఆమెను అమృతకన్యగా మార్చుకుంటాడు. ఈ విషయం చక్రవర్తికి చారుగుప్తునికి తెలుస్తుంది. చంద్రబాలతో కృష్ణశాతవాహనుని వివాహానికి చక్రవర్తి ఒప్పుకోగా హిమబిందుతో సువర్ణశ్రీ వివాహానికి చారుగుప్తుడు ఒప్పుకుంటాడు. ఈ కథలో మరొక జంట నాగబంధునికా-సమవర్తి. ఈ జంటల వివాహంతో కథ సుఖాంతమవుతుంది.

**B. అడవి శాంతిశ్రీ :**

ఇక్ష్వాకురాజు శాంతిమూలుడు యజ్ఞశ్రీ శాతకర్ణి సర్వ సైన్యాధ్యక్షుడే గాక ఆయన కుమార్తె కుసుమలతాదేవిని పెండ్లాడిన అల్లుడు కూడా. శాంతిమూలుడు తన ధైర్య సాహసాలతో శాతవాహన రాజ్యాన్ని రక్షిస్తుంటాడు. ఇతనికి మరొక భార్య సారసికాదేవి ద్వారా వీరపురుషదత్తుడనే కొడుకు, శాంతిశ్రీ అనే కూతురు కలిగారు. శాంతిశ్రీ ఆనందార్హతులకడ బౌద్ధ ధర్మాన్ని అధ్యయనం చేసి బౌద్ధ యోగినిగా మారింది. శాంతమూలుడు తన దండనాయకుని కుమారుడైన బ్రహ్మదత్తుని శాంతిశ్రీకి ఆర్ష ధర్మాన్ని బోధించడానికి నియమిస్తాడు. బ్రహ్మదత్తుడు శాంతిశ్రీని ప్రేమిస్తాడు. కాని ఆమె ప్రేమకతీతంగా ఆర్ష ధర్మాన్ని అధ్యయనం చేస్తుంది. క్రమంగా ఆమెలో ప్రేమభావం కలిగి బ్రహ్మదత్తుని ప్రేమిస్తుంది. యజ్ఞశ్రీ శాతకర్ణి మరణించిన తరువాత అతని పుత్రుడైన విజయశ్రీ చక్రవర్తి అవుతాడు. చక్రవర్తి రెండవ పుత్రుని మనుమడైన పులోమావి యజ్ఞశ్రీ మరణం తరువాత తానే చక్రవర్తినని ప్రకటించుకొని ప్రతిష్ఠానపుర ప్రతినిధి అయిన చంద్రశ్రీని అపహరించబోగా చంద్రశ్రీ మాయమౌతాడు.

బ్రహ్మదత్తుడు కారణాంతరాలవల్ల మరొక ప్రాంతంలో వుండి పదిరోజుల తరువాత నగరానికి వస్తాడు. ఈ పదిరోజుల కాలంలో శాంతిశ్రీ బ్రహ్మదత్తుని యెడల అనురాగం ఎందుకు కలిగిందో తన మనసేమిటో తెలుసుకొంటుంది. పులోమావిని ఓడించడానికి వెళ్ళిన బ్రహ్మదత్తుని పులోమావి బంధిస్తాడు. శాంతిశ్రీ అపరకాళిలా విజృంభించి పులోమావిని బంధీని చేసి బ్రహ్మదత్తుని విడిపిస్తుంది. చంద్రశ్రీ చక్రవర్తి అవుతాడు. శాంతిమూలుడు చేసిన అగ్నిష్టోమ యాగ సందర్భంలో శత్రువులు దొంగచాటుగా వేసిన బాణంవల్ల చంద్రశ్రీ మరణిస్తాడు. ఖైదు నుండి తప్పించుకున్న పులోమావిని పూంగిమ శాంతిశ్రీ స్త్రీ సైన్యంతో వెళ్ళి బంధించే ప్రయత్నం చేయగా పులోమావి వాతం కమ్మి చనిపోతాడు. దీనితో శాతవాహన వంశం అంతరిస్తుంది. ఆచార్య నాగార్జునుడు శాంతిమూలుని చక్రవర్తిని చేస్తాడు. వీరపురుష దత్తునికి రుద్రభట్టారికతో వివాహమవుతుంది. తరువాత విజయపురికి రాజు అవుతాడు. శాంతిశ్రీ బ్రహ్మదత్తుల వివాహం జరుగుతుంది. ఇక్ష్వాకు శాంతిశ్రీ అడవి శాంతిశ్రీ అవుతుంది.

C. అంశుమతి :

అంశుమతి వేంగీ నగరాన్ని పాలించే విష్ణుకుండిన మంచన భట్టారకుని ఏకైక పుత్రిక. ఈమె జాతకదోషం వల్ల రాజ్యానికి ఆపద కలుగుతుందని, గ్రహశాంతి చేయడంవల్ల ఉపద్రవం తొలగుతుందని రాజగురువు చెప్పడంతో ఈమె నియమంతో గురువు సలహాను పాటిస్తూ ఉంటుంది. కుబ్జ విష్ణువర్ధనుడు వాతాపి నగర చక్రవర్తికి తమ్ముడు. చాళుక్యులందరిలో పొట్టివాడు. అన్న ఆజ్ఞతో తూర్పు తీర రాజులను ఓడించడానికి వెళ్ళిన కుబ్జ విష్ణువర్ధనుడు పిష్ఠపురాన్ని వశం చేసుకుంటాడు. కళింగులచేత బంధీలైన అంశుమతిని, ఆమె చెలికత్తెను విడిపిస్తాడు. అంశుమతి విష్ణువర్ధనుడు ప్రేమించుకుంటారు. విష్ణువర్ధనుడు వేంగీ పురాన్ని స్థావరంగా చేసుకొని ఇతర సామంత రాజ్యాలను జయిస్తూ వుంటాడు. వేంగీ పురోద్యానవనంలో అంశుమతిని కలుసుకొని ఆమె మంచన భట్టారకుని కుమార్తెగా తెలుసుకుంటాడు. మరొక రోజు అదే ఉద్యానవనంలో అంశుమతిని అపహరించడానికి వచ్చిన కుంభమిత్రుని జయనంది సహాయంతో విష్ణువర్ధనుడు సంహరిస్తాడు. అంశుమతి విష్ణువర్ధనుల వివాహం జరుగుతుంది. విష్ణువర్ధనుడు చాళుక్య సామ్రాజ్యాన్ని స్థాపించి పట్టాభిషిక్తుడవుతాడు.

D. గోన గన్నారెడ్డి :

రుద్రమదేవి పట్టాభిషిక్తురాలైన తరువాత కలిగిన రాజకీయ సంచలనం, రుద్రమదేవికి కుడిభుజమైన గోన గన్నారెడ్డి చేసిన యుద్ధాలు, గన్నారెడ్డి వివాహం, రుద్రమదేవి వివాహం - ఇతివృత్తంగా కలిగినదీ నవల.

గణపతిదేవుడు తన కుమార్తెను తన వారసురాలుగా పట్టాభిషిక్తురాలను చేస్తాడు. వర్ధమానపుర పాలకుడైన లకుమయ్యా రెడ్డికి రుద్రమదేవి పురుష వేషంతో సింహాసనమెక్కడం యిష్టం లేదు. ఆదవోనిని పాలించే కోటారెడ్డి కుమార్తె అన్నమాంబికను తన కుమారుడైన వరదా రెడ్డికిచ్చి వివాహం చేసి రెండు రాజ్యాలు ఏకమై రుద్రమదేవిని ఓడించాలనుకుంటాడు. వివాహం నిశ్చయ మౌతుంది. వివాహాన్ని ఆపడానికి గన్నారెడ్డి వరదారెడ్డిని ఎత్తుకుపోయి వారం తరువాత పంపుతాడు. సామంతులంతా రుద్రమదేవిని గద్దె దింపడానికి కుట్ర పన్నుతారు. హరిహర దేవుడు, మురారిదేవుడు కాకతీయ సింహాసనానికి వారసుల మంటారు. లకుమారెడ్డి వారికి సహాయం చేస్తానంటాడు.

శివదేవయ్యా దేశికుల సలహామీద రుద్రమదేవి చిన్నతనం నుండి పురుషుని వలె పెంచబడింది. జాయపసేనాని కూతురు ముమ్మడాంబికతో వివాహం కూడా జరిగింది. వేట సందర్భంలో రుద్రమ నిడుదవోలు చాళుక్య వీరభద్రుని చూసింది. అప్పటినుండి ఆమెలో స్త్రీత్వం స్పందించింది. లకుమారెడ్డి తన కుమారునికి మళ్ళీ వివాహ ప్రయత్నం చేస్తాడు. అన్నమాంబిక ఈ వివాహానికి ఒప్పుకోదు. గన్నారెడ్డి ఆమెను తప్పించి బుద్ధపురంలో తన సోదరి కుప్పాంబ ఆశ్రమంలో వుంచుతాడు. అన్నాంబిక గన్నారెడ్డి వీర విక్రమాలకు పరవశించి అతనిని ప్రేమి స్తుంది. ఆపదలనుండి తప్పించడానికి గన్నారెడ్డి ఆమెను రుద్రమదేవి దగ్గరకు పంపుతాడు. రుద్రమదేవి, అన్నాంబిక సన్నిహితులౌతారు.

లకుమారెడ్డి గన్నారెడ్డిని పట్టుకోవాలని ప్రయత్నించినపుడు గన్నారెడ్డి లకుమారెడ్డిని బంధించి ఓరుగల్లు ఖైదులో పెట్టిస్తాడు. లకుమారెడ్డి, హరిహర మురారిదేవులు, మంత్రి రుద్రమ కలిసి రాజకీయ కుట్ర పన్నుతారు. రుద్రమదేవి జైత్రయాత్ర ప్రారంభిస్తుంది. అన్నాంబిక ఆమెకు కుడిభుజమై అనుసరిస్తుంది. గణపతిదేవుడు మరణించగానే యాదవులు, మహారాష్ట్రులు ఒక్కుమ్మడిగా ఓరుగల్లు

మీద దాడి చేశారు. గోనగన్నారెడ్డి ధాటికి తాళలేక వెనుదిరుగుతారు. రుద్రమదేవి చాళుక్య వీరభద్రుని, ముమ్మడాంబిక చాళుక్య మహాదేవుని వరిస్తారు. రుద్రమదేవి ఆదేశంతో కోటారెడ్డి అన్నాంబికను గన్నారెడ్డికిచ్చి వివాహం చేస్తాడు. ప్రేయసీ ప్రియులైన అన్నాంబికా గోన గన్నారెడ్డిల సమాగమంతో కథ ముగుస్తుంది.

## E కైలాసేశ్వరుడు :

బాపిరాజు దీనిని 'చాళుక్య చారిత్రాత్మక నవల' అని తన నోట్సులో రాసుకున్నారు. విశ్వబ్రాహ్మణ వంశస్థుడైన ఒక బాల శిల్పి వంశ వర్ణనతో నవల ప్రారంభమవుతుంది. ఆ బాల శిల్పి పేరు లోకేశ్వరాచార్యులు. అతని తండ్రి నాగమాచార్యుడు, ఇతడు చాళుక్య మహారాజుకు రాజ శిల్పి. ఇతని తండ్రి వాసుదేవాచార్యులు. పశ్చిమ చాళుక్య చక్రవర్తి చేత ఆహ్వానితుడై కళ్యాణి నగరం చేరి రాజాశ్రయం పొందాడు.

బాలుడైన లోకేశ్వరాచార్యులు విశ్వకర్మ సూత్రం చదువుతూ అపర్ణాదేవి విగ్రహం చేయాలని సంకల్పించాడు. అందుకు తగిన ధ్యాన శ్లోకాల్ని మనస్సులో స్మరించుకుంటూ మైనంతో ఆ దేవి విగ్రహాన్ని విన్యసించడానికి ప్రయత్నిస్తాడు. మాన్య ఖేటకానికి చెందిన రాష్ట్రకూట కృష్ణమహారాజు గొప్ప వీరుడు. సర్వ దక్షిణాపథానికి రాష్ట్రకూటులు చక్రవర్తులు కావాలని అతని ఆశయం.

ఒక మాఘ శుద్ధ పూర్ణిమ పర్వదినం చాళుక్య రాజ్యరమ కల్యాణీపురం, దానికి మూడు వందల యోజనాల దూరంలోని వేంగీపురం అతని మదిలో మెదిలాయి. ఆ రెండు రాజ్యాలు ఒకరితో ఒకరు సంబంధ బాంధవ్యాలు పెంపొందించుకుంటున్నారు. ఈ రెండూ కలసి ఒకే రాజ్యంగా వుంటే బలపూర్ణమై ఉంటుందని కృష్ణమహారాజు ఆలోచిస్తాడు. ఇక్కడ నవల అసంపూర్ణంగా ఆగిపోయింది.

## F. శిలా రథం :

ఇది అసంపూర్ణ నవల. బాపిరాజు రాసుకున్న కథా సంగ్రహాన్ని బట్టి, ఆయన కుమార్తె రాధావసంతగారు చెప్పిన కథనాన్ని బట్టి ఈ నవలలోని కథ ఇలా వుంటుంది. కథానాయకుడైన చెన్నకేశవ నాయకుడు పరిమళ రంగనాయకుని కుమారుడు. పరిమళ రంగనాయకుడు బళ్లారి నగర ప్రభువు. విజయనగర చక్రవర్తి శ్రీ కృష్ణదేవరాయల సామంతుడు. అతడు యుద్ధాలకు కూడా కొడుకుని తీసుకొని

వెళుతుంటాడు. ఒకరోజు సర్వాలంకృతుడైన చెన్నకేశవ నాయకుడు తండ్రితో కలిసి బజారు వీధుల్లో పోతున్నాడు. అంగరక్షకుల సమూహం వెంట నడుస్తుం టుంది. ఆ సందడి గమనించడానికి వచ్చిన ఒక బాలిక ఒక రాహుత్తుని అశ్వం కింద పడింది. ఆ బాలికను పక్క ఇంటిలోనికి తీసుకెళ్ళి సేద దీరుస్తాడు. ఆ చిన్ననాటి విషయం చెన్నకేశవ నాయకునికి పెన్నెలలో తన హృదయం ఉత్తేజిత మౌతుండగా గుర్తుకు వస్తుంది.

చెన్నకేశవ నాయకుని హృదయంలో ప్రేమ లేదు. అతడు క్రోధ సంతప్త హృదయుడు. ఉమ్మత్తూరు యుద్ధంలో రాయలకు అంగరక్షకుడైన పరిమళ రంగ నాయకుని చాటుగా చంపిన ఇమ్మడి చొక్కనాయక ఉడయర్‌ను ధర్మ యుద్ధంలో హత మార్చాలని ప్రతిజ్ఞ చేస్తాడు. విఠల దేవాలయంలో శిలారథం వద్ద ఈ ప్రతిజ్ఞ చేయడంవల్ల అతని ప్రతిజ్ఞ శిలారథం వంటిదయింది.

పెన్నెలలో తుంగభద్రా నదీ తీరాన వెళుతున్న చెన్నకేశవ నాయకుడు 'రక్షించండి' అన్న ఆర్తనాదం విని ముందుకు పోతాడు. బలవంతంగా పెళ్ళిచేయ సంకల్పించిన దేవదాసి బారినుండి రక్షించమని ఒక అబల కోరుతుంది. ఆ పరిస్థితిలో ఏమీ ఆలోచించకుండా ఆమెను వివాహమాడతాడు. తరువాత ఆమెతో ఎలాంటి సంబంధం పెట్టుకోడు. ఆమె ఇతనిని భర్తగానే భావిస్తుంది. తరువాత కొన్నాళ్ళకు రాయలతో కలసి యుద్ధానికి వెళ్ళినపుడు ఆమె మారువేషంలో వెళ్ళి అతనికి సహాయ పడుతుంది. చెన్నకేశవ నాయకుడు చొక్కనాథ ఉడయర్‌ను చంపి తన ప్రతిజ్ఞ నెరవేర్చుకుంటాడు. రాయలు ఆమెను చెన్నకేశవ నాయకునికి సమర్పిస్తాడు. ఆమె పరవశించి పోతుంది. భర్తలోని చైతన్య శక్తిని ఉద్దీపింప జేస్తుంది.

**G. మధురవాణి :**

యువరాజైన రఘునాథ నాయకుని ఊరేగింపుతో నవల ప్రారంభమవు తుంది. యువరాజు అధిష్ఠించిన ఏనుగు గోవింద దీక్షితుల ఇంటి ముందు ఆగు తుంది. ఆ సమయంలో నీరాజనమిచ్చే పళ్ళెం పట్టుకున్న బాలికల్లో మధ్య ఉండిన చెంచులక్ష్మిని యువరాజు చూస్తాడు. ఆమె సౌందర్యానికి ముగ్ధుడవుతాడు. చెంచులక్ష్మి అంతకుముందే యువరాజున్ను చూచింది. ఆయనకు మనస్సు అర్పిం

చింది. చెంచులక్ష్మి వేశ్యకుల సంజాత. ఆమె తల్లి మరకతవల్లి. రఘునాథ నాయకుని మేనమామ మూర్తెప్పనాయుని ప్రియురాలు. వారిరువురికి కలిగిన కూతురు చెంచులక్ష్మి.

చెంచులక్ష్మి గోవింద దీక్షితుల శిష్యురాలు. ఆయన దగ్గర సర్వ శాస్త్రాలు సంగీతం, నాట్యం నేర్చుకుంటూ వుంటుంది. ఒక రోజు పాఠం చెప్పించు కుంటున్న సమయంలో రఘునాథ నాయకుడు అక్కడికి వస్తాడు, రఘునాథుడు తురుష్కులను ఓడించిన విధానాన్ని యజ్ఞనారాయణుడు తన తండ్రియైన గోవింద దీక్షితులకు చెపుతాడు. రఘునాథుని వీరత్వాన్ని తెలిపే శ్లోకం కూడా చదువుతాడు. గురువుగారు చెంచులక్ష్మిని రఘునాథునికి పరిచయం చేస్తారు. యువరాజు ఆమె సంస్కృత భాషా పాండిత్యాన్ని మెచ్చుకొని ఆమెకు ముత్యాల హారం బహూక రిస్తాడు. చెంచులక్ష్మిలోని భావస్పందనను చూచి గోవింద దీక్షితులు ఆమె రఘునాథుని ప్రేమించిందని భావిస్తాడు.

మరొక రోజు రఘునాథుడు గురువుగారింట్లో చెంచులక్ష్మి సంగీత నాట్య కౌశలాన్ని పరీక్షించి మెచ్చుకొని స్వర్ణపేటికను బహూకరిస్తాడు, తరువాత కొన్నాళ్ళకు తన దేవేరి రామభద్రాంబతో తనకు చెంచులక్ష్మిపై గల అనురక్తిని వ్యక్తపరుస్తాడు. ఆమె రఘునాథుని దక్షిణ నాయకత్వాన్ని ఆమోదిస్తుంది.

చేమకూర లక్ష్మణామాత్యునికి వేశ్యవలన పుట్టిన కొడుకు చేమకూర వేంకటకవి. బాల్యం నుండి నిశితమైన మేధస్సు కలవాడు. తండ్రి మరణానంతరం కుటుంబ బాధ్యత వెంకటకవి మీద పడుతుంది. స్వస్థలం నిడుదవోలులో అతనికి రాజపోషణ లభించదు. చంద్రగిరి రాజును సందర్శించాలని దక్షిణాభిముఖంగా యాత్రకు వస్తాడు. తిరుమలలో ఒక దివ్యభావం అతని మదిలో మెదిలి తంజావూరు వెళ్ళేటట్లు చేస్తుంది. అక్కడ ముందు గోవింద దీక్షితులను ఆశ్రయిస్తాడు. రాజగురువు మరునాడు వెంకటకవికి రాజదర్శనం చేయిస్తాననంటాడు. ఇక్కడ నవల అసంపూర్ణంగా ఆగిపోయింది.

### వాస్తవాలు - కల్పితాలు :

చరిత్ర, కాల్పనికతల సమ్మేళనం చారిత్రక నవల. రచయిత దృక్పథాన్ని బట్టి చారిత్రక నవలల్లో చరిత్ర అధికంగాను కల్పన స్వల్పంగాను ఉండవచ్చు,

మరికొన్నింటిలో కల్పన అధికంగా చరిత్ర స్వల్పంగా వుండవచ్చు. బాపిరాజు చారిత్రక నవలలను శుద్ధ చారిత్రకాలుగా, కల్పనా సమ్మిశ్రితాలుగా విడదీయవచ్చు. అడవిశాంతశ్రీ, గోనగన్నారెడ్డి, మధురవాణి శుద్ధచారిత్రక నవలలు. హిమబిందు, అంశుమతి కల్పనా సమ్మిశ్రితాలు.

హిమబిందు నవలలో నూటికి తొంబది పాళ్ళు కల్పనలే. శ్రీముఖ శాతవాహనుడు జైత్రయాత్రలు చేసి జంబూ ద్వీపానికి పట్టాభిషిక్తుడు కావడం అనే చారిత్రక సత్యాన్ని గ్రహించి బాపిరాజు ఈ నవల రచించాడని పరిశోధకుల అభిప్రాయం. కాని శ్రీముఖ శాతవాహనుడు జంబూ ద్వీపాన్ని పాలించినట్లు చెప్పడం చారిత్రక అసత్యం. చరిత్ర ప్రకారం ఇతనిపేరు సిముఖుడు. క్రీ. పూ. 221 నుండి క్రీ.శ. 198 వరకు పాలించిన శాతవాహనులలో మొదటి రాజు. ఇతడు ఆంధ్ర దేశాన్ని కూడా పూర్తిగా పరిపాలించలేదు. ఆంధ్ర దేశంలోని కొంత భాగాన్ని మహారాష్ట్రలోని కొంత భాగాన్ని ఒక రాజ్యంగా చేసి పరిపాలించాడు. నానేఘాట్ శాసనం ఈ విషయాన్ని ఋజువు చేస్తుంది. శ్రీముఖుని తమ్ముడు కృష్ణశాతవాహనుడు అని చరిత్ర చెపుతుంటే బాపిరాజు వీరిద్దరిని తండ్రీ - కొడుకులుగా మార్చాడు. శ్రీముఖుని మరొక కుమారుడు మంజుశ్రీ. శాతవాహన రాజుల పట్టికలలో మంజుశ్రీ పేరే కనపడదు. శ్రీముఖుడు బౌద్ధ ధర్మాన్ని ప్రచారం చేస్తుంటే సహించని స్థౌలతిష్యుడు విషకన్యను ప్రయోగించి కృష్ణశాత వాహనుని చంపించి అతని తమ్ముడైన మంజుశ్రీని రాజును చేసి అతని ద్వారా ఆర్ష ధర్మాలను ఉద్ధరించాలనుకుంటాడు. బౌద్ధ ఆర్ష ధర్మాల మధ్య ఏర్పడిన సంఘర్షణ ఈ నవలలో ప్రధాన విషయం. ఇందులోని పాత్రలు, సంఘటనలు అన్నీ కల్పితాలే. అయితే బాపిరాజు తన అసమాన ప్రతిభతో ఆనాటి రాజకీయ మత సంస్కృతులను వాస్తవికంగా చిత్రించి పఠితలను శాతవాహన యుగానికి కొని పోయి తన్మయీ భావం కలిగించడం గొప్ప విషయం.

అడవి శాంతిశ్రీ నవలలో రాజుల, సామంతుల, దండనాయకుల పేర్లు కొన్ని సంఘటనలు తప్ప మిగిలినదంతా కల్పితం. ఆచార్య నాగార్జునుడు ఇక్ష్వాకు శాంతిమూలుని శాతవాహనుల అనంతరం సర్వ దక్షిణాపథానికి చక్రవర్తిని చేయడమనే ఈ నవలలోని ప్రధాన విషయం అసత్యం. శాంతమూలుని కాలం నాటికి నాగార్జునుడు లేడు. ఇక్ష్వాకు రాజవంశం నాగార్జున కొండ ప్రాంతాన్ని సుమారు

50 సంవత్సరాలు విజయపురి రాజధానిగా పరిపాలించింది. ఇప్పటివరకు దొరికిన ఆధారాలననుసరించి ఈ రాజవంశంలోని రాజులు నలుగురు. కళింగ మాఠరులతో, వూంగీయులతో, ఉజ్జయిని శక్తులతో వీరికి వైవాహిక సంబంధాలున్నాయి. ఈ వంశపు స్త్రీలంతా బౌద్ధాన్ని పోషిస్తే పురుషులంతా బౌద్ధాన్ని, వైదికాన్ని సమంగా పోషించారు. ఈ వంశపు రాజులు యాగాలు చేశారు. చారిత్రికంగా ఈ వంశానికి చెందిన అంశాలివి. వేంగి శాలంకాయనులు శాంతిమూలునికి కప్పం కట్టినట్లు బాపిరాజు కల్పించాడు. నిజానికి శాలంకాయనులకు ఇక్ష్వాకులకు సుమారు 150 సంవత్సరాల తేడా ఉంది. శాంతిమూలుని వైదిక ధర్మావలంబిగా చెప్పడానికి బాపిరాజు ధాన్యకటక మాహేశ్వరాలయంలో శాంతమూలుడు అర్చనలు చేశాడని రాశాడు. అప్పటికి ధాన్యకటకం బౌద్ధ కేంద్రమే. శాంతిమూలుని మహాదాంధ్ర సామ్రాజ్యానికి ఏలికగా చెప్పడం అవాస్తవికమే. అప్పటికి మహదాంధ్ర అనేది లేదు. ఆంధ్ర దేశం ముక్కలు ముక్కలుగా ఉండేది. సమకాలికులు కాని రాజులందరిని శాంతమూలుని సభలో ప్రవేశపెట్టి వాళ్ళంతా శాంతమూలునికి లోబడి ఉండేవారని చెప్పడం కూడా వాస్తవం కాదు. వూంగీయ వంశంవాడైన స్కంధ విశాఖనాగుని బాపిరాజు బ్రహ్మదత్త ప్రభువుగా మార్చాడు. దండనాథుని ప్రభువుగా చెప్పడం ఔచిత్యవంతంగా లేదు. బౌద్ధ ధర్మం ఆర్ష ధర్మంలో విలీనం చేయడానికి బ్రహ్మదత్తుడు జన్మించాడని నాగార్జును డంటాడు. ఇది నవలలోగల కీలకాంశం. బౌద్ధ ధర్మావలంబిని అయిన శాంతిశ్రీ అర్ష ధర్మపరాయణుడైన బ్రహ్మదత్తుని వివాహమాడడంతో రెండు మతాలు సమన్వయమై పోయాయి.

అంశుమతి నవలలో కుబ్జ విష్ణువర్ధనుడు సాగరతీరాంధ్ర రాజులను జయించి చాళుక్యరాజ్యం స్థాపించాడనడం చారిత్రకం కాదు. సాగరతీర ప్రాంతాన్ని జయించి చాళుక్య రాజ్యంగా మార్చింది రెండవ పులకేశి. ఐహోళె శాసనం ఈ వివరాలనిస్తుంది. ఈ విషయం తప్ప మిగిలిన అంశాలు కొంతవరకు వాస్తవాలే. గోన గన్నారెడ్డి నవలలో బాపిరాజు చారిత్రకంగా కనిపించే పాత్రలనే స్వీకరించి కథను నడిపాడు. గన్నారెడ్డి రుద్రమకు దండయాత్రలలో సహాయం చేసింది కూడా వాస్తవం. గన్నారెడ్డి కుమారుడైన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణ కర్త అని బాపిరాజు రాశాడు. ఇది కూడా వాస్తవం. రుద్రమదేవి పురుషుడేనని ప్రజలలో నమ్మకం కలిగించడానికి ఆమెకు ముమ్మడాంబికతో వివాహం జరపడం,

రుద్రమదేవికి ముందే గణపతిదేవుడు లింగైక్యం పొందినట్లు చెప్పడం వాస్తవాలు కావు.

రాష్ట్రకూటులు, కళ్యాణీ చాళుక్యులు, వేంగి చాళుక్యులు సమకాలికులు కావడం, రాష్ట్రకూటరాజు కృష్ణుడు కళ్యాణి చాళుక్యులను, వేంగి చాళుక్యులను జయించాలనుకోవడం చారిత్రక సత్యాలు. ఈ మూడు రాజవంశాలమధ్య ఎన్నో యుద్ధాలు జరిగినట్లు చరిత్ర చెబుతుంది. ఈ విషయాలతో పాటు ఒక శిల్పాచార్యుని కుటుంబ ప్రస్తావన కూడా కైలాసేశ్వరుడు నవలలో ఉంది. బాపిరాజు శిల్పి కూడా కావడంవల్ల తన అభిరుచి ననుసరించి శిల్ప శాస్త్ర విషయాలు ప్రతిపాదించడానికి ఈ ప్రస్తావనను కల్పించి ఉండవచ్చు. శ్రీ కృష్ణదేవరాయలు జరిపిన దండయాత్రలలో ఎందరో సామంతులు, దండనాయకులు పాల్గొనడం చారిత్రక సత్యం. శిలారథం నవలలో బళ్ళారి నగర ప్రభువైన పరిమళ రంగ నాయకుడు, అతని కుమారుడు చెన్నకేశవ నాయకుడు రాయల సామంత వర్గానికి చెందినవారు కావచ్చు. కథాకథనం కోసం కొన్ని సంఘటనలు కల్పింపబడినా ఈ నవలలో చారిత్రకాంశాలే ఎక్కువగా ఉన్నాయి. మధురవాణి రఘునాథ నాయకుని ఆస్థాన విదుషీమణి. ఈమె సంస్కృతంలో రామాయణం రాసింది. 'మధురైక ధురంధరాంధ్ర కవితా నిర్మాణ సమ్మాన్వయ' అని ఆమె చెప్పుకోవడాన్ని బట్టి తెలుగు కావ్యాలు కూడా రచించి ఉండవచ్చు! కాని ఆమె రచించిన తెలుగు కావ్యా లేవీ దొరకడం లేదు. ఈమెను రఘునాథ నాయకుని ప్రియురాలిగా కూడా చెప్పడం ఉంది. చేమకూర వేంకటకవి రఘునాథ నాయకుని ఆస్థాన కవి. ఇవన్నీ చారిత్రక సత్యాలు. బాపిరాజు రచించిన మధురవాణి నవలలో ఆమె పేరును చెంచులక్ష్మిగా మార్చి భోగకాంత అని పేర్కొన్నాడు. చెంచులక్ష్మి తన సంగీత నాట్య సాహిత్య ప్రావీణ్యంతో రఘునాథుని ఆకర్షించడం, ఆయన ఈమెకు సన్మానాలు చేయడం, చివరకు అంతఃపుర కాంతగా మార్చుకోవడం బాపిరాజు చేసిన కల్పనలు.

తన చారిత్రక నవలల్లో బాపిరాజు చేసిన కల్పనలు ఔచిత్యంకోసం చేసినవే కాని చరిత్రను తారుమారు చేయడానికి చేసినవి కావు. ఈ నవలకు విషయాన్ని సేకరించే సమయంలో ఆయన మల్లంపల్లి సోమశేఖర శర్మగారితోను, కురుగంటి సీతారామ భట్టాచార్యులతోను చారిత్రక విషయాల నెన్నిటినో చర్చించి చారిత్రక సంఘటనలను నిర్ణయించుకొన్నట్లు పరిశోధకులు చెపుతున్నారు. ఆయన కల్పనలు చరిత్రతో కొంతకు కొంత సామీప్యాన్ని పొందినవేనని కూడా చెపుతారు. బాపిరాజు

కూడా చరిత్రను పూర్తిగా వక్రీకరించాలని అనుకొని వుండడు. అయినా హిమ బిందు, అడవి శాంతిశ్రీ నవలలో చేసిన కల్పనలు కొన్ని చారిత్రక సంఘటనలను మార్చేవిగా ఉన్నాయి. శ్రీకృష్ణ శాతవాహనుని శ్రీముఖుని కుమారుడుగా చెప్పడం, ఆచార్య నాగార్జునుని ఇక్ష్వాకుల కాలంనాటి వ్యక్తిగా చెప్పడం చరిత్రను వక్రీక రించే అంశాలు.

**ఔచిత్యా నౌచిత్యాలు :**

ఏ నవలాకారుడు అనౌచిత్య విషయాలను చెప్పాలనుకోడు. బాపిరాజు ప్రసిద్ధి పొందిన నవలాకారుడు కాబట్టి ఆయన రచనలలో అనౌచిత్యాలు దొర్లాయంటే నమ్మలేము. ఆయనకు దేశాభిమానం ఎక్కువ. ఆంధ్ర రాజన్యులంటే గౌరవం. ఆంధ్రుల చరిత్ర అంటే ప్రాణం. ఒక చిన్న రాజును సార్వభౌముడుగా చెప్పడం పాఠకులకు అనౌచిత్యమనిపిస్తుంది. కాని బాపిరాజుకు అనిపించదు. ఆంధ్రరాజులు వీరాధి వీరులైన సార్వభౌములని ఆయన భావన. ఇలాంటి విషయాలు పఠితలకు చారిత్రక అభినివేశాన్ని కూర్చేవిగా, తమ జాతి చరిత్రలోని గొప్పతనాన్ని చాటేవిగా వుంటాయని ఆయన భావించాడు. అందుకే కొన్నికొన్ని సందర్భాలలో ఆయన చరిత్రకు చాల దూరంగా కూడా వెళ్ళాడు.

ఔచిత్యం రచనకు ప్రాణం. రెండు చారిత్రక ఘట్టాలకు మధ్య జరిగిన చరిత్ర తెలియనప్పుడు బాపిరాజు ఆనాటి రాజకీయ వాతావరణాన్ని దృష్టిలో పెట్టుకొని రెండు ఘట్టాలను కలపడానికి కొంత చరిత్రను ఊహించి కల్పిస్తాడు. ఈ కల్పన నిజమైన చరిత్రగా భాసిస్తుంది. సందర్భానికి ఔచిత్య స్ఫూర్తినిస్తుంది. రుద్రమదేవి బాల్యం నుండీ పురుషుడుగా పెంచబడింది. ప్రజల, సామంతుల, రాజబంధువుల దృష్టిలో ఆమె పురుషుడే. ఆమెను చక్రవర్తిని చేసేంతవరకు గుట్టు బయట పడ కూడదు. పట్టాభిషిక్తురాలైన తర్వాత ఆమె స్త్రీయని తెలియడంతో గగ్గోలు పుట్టింది. ఆమె నిజంగా పురుషుడే ననడానికి బాపిరాజు ఆమెకు మరొక స్త్రీతో వివాహం జరిపించాడు. ఇది కల్పన. అయినా సందర్భానికి తగినట్లుగా ఉంది. పాఠకుడు కూడా నిజమేనేమో ననుకుంటాడు. ఇలాంటి ఔచితీవంతమైన కల్పనల నెన్నింటినో బాపిరాజు చేశాడు. ఆయన చారిత్రక నవలలో కొన్ని అనౌచిత్యాలు కూడా లేకపోలేదు. అడవి శాంతిశ్రీ నవలలో బ్రహ్మదత్తుడు శాంతిమూలుని సహోదరి శాంతిశ్రీకి ఆర్ష ధర్మాన్ని గురించి బోధిస్తాడు, శిష్యురాలైనప్పటికి శాంతిశ్రీ అందానికి, మానసిక సంస్కారానికి ముగ్ధుడై ఆమెను ప్రేమించి వివాహం

చేసుకోవాలనుకుంటాడు. ఆమెను ప్రేయసి భావంతోనే చూస్తుంటాడు, ఒకరోజు భగవద్గీతలోని స్థితప్రజ్ఞత్వ లక్షణాలను ఆమెకు బోధిస్తుండిన సందర్భంలో 'భగవంతుడు తానూ ఒకటిగా భావించేవాడా స్థితప్రజ్ఞుడు' అని ఆమె ప్రశ్నిస్తే 'అవునమ్మా' అంటాడు. ఈ సంబోధన ఆమెయెడల అతని ప్రేమభావాన్ని వ్యక్త పరిచేదిగా లేదు. శాంతిశ్రీ పరివారంలోని యశోద తారానికలు స్నేహితురాండ్రు, పైగా బంధువులు కాబోయేవారు. ఒక సందర్భంలో ప్రణయ భావంలో మునిగిన వీరిద్దరు ఒకే మంచంపై పడుకొని కబుర్లు చెప్పుకున్నారు. ఆ సందర్భంలో బాపిరాజు చేసిన చిత్రణ ఇది. "మంచం మీద దొర్లుతూ ఒకరితో నొకరు మల్ల యుద్ధం నెరపుతున్నట్లు నటించారు. ఆ వెనుక ఇద్దరు లేచి చీరెలు సవరించుకొని, వల్లె వస్త్రములు వయారించుకొని, సడలిన స్తన దుకూలాలు బిగించుకొని రత్న కంబళులపై కూరుచుండి తలకట్లు దువ్వుకుంటూ మాటలాడుకొన ప్రారంభించారు" ఈ వర్ణన సంయోగ శృంగారాన్ని స్ఫురింపజేస్తూ వుండడంవల్ల అంత ఔచిత్యంగా లేదు. ఇలాంటి చిన్నచిన్న అనౌచిత్యాలున్నప్పటికి బిగువుగా సాగే కథాకథనంలో మునిగిపోయి పఠితల ఆలోచనలకంతగా ఎక్కవు.

## చారిత్రక నవలాకారుడుగా బాపిరాజు కృతకృత్యత :

ఆ కాలంలోని మిగిలిన చారిత్రక నవలాకారులలో బాపిరాజుకొక ప్రత్యేకత వుంది. ఆయన నవలను ఒక కావ్యంగా భావించాడు. కావ్యానుభవం అందించే నవలను నవలాకావ్యం అనవచ్చునని విమర్శకుల అభిప్రాయం. నవలలు గద్య కావ్యాలు. బాపిరాజు తరంలో చారిత్రక నవలలు రాసి పేరు గడించిన వారిలో విశ్వనాథ సత్యనారాయణ, నోరి నరసింహశాస్త్రి ముఖ్యులు. ఈ ముగ్గురిని చారిత్రక నవలాకారులత్రయంగా గుర్తిస్తారు. చారిత్రక నవల వీళ్ళ చేతుల్లో విచిత్ర పోకడలు పోయింది. విశ్వనాథ "Ekaveera is artistically my Perfectest work in Prose" అన్నారు. (విమర్శిని. 2. (1977) పు. 76) రొమాంటిక్ సంప్రదాయాన్ని పూర్తిగా పుణికి పుచ్చుకున్న నవల "ఏక వీర" అన్నది విమర్శకులు అంగీకరించిన మాట (ఆర్. ఎస్. సుదర్శనం. 'సాహిత్యంలో దృక్పథాలు' పుట.48) నవలలో రొమాంటిక్ సంప్రదాయముందంటే అందులో ప్రణయ తాత్త్వికభావాలతో కూడిన ఉత్తమ కవిత్వముంటుంది. బాపిరాజు చారిత్రక నవలలో ఈ లక్షణముంది. నవలను కావ్యంగా తీర్చి దిద్దడం ఉత్తమ శిల్పం. ఆ

శిల్ప విశేషంవల్ల ఆ ప్రక్రియ అపూర్వంగా రాణిస్తుంది. బాపిరాజు భావకవి పైగా చిత్రకారుడు. ఒక పాత్ర మానసిక సంఘర్షణకు లోనైనపుడు ఎలా ఆలోచిస్తుందో ఆయనకు బాగా తెలుసు. భావ శబలతను వర్ణించవలసిన చోట్ల ఆయన గేయాలు రాసి ఆ గేయాలలో ఆ పాత్ర పొందిన భావ తీవ్రతను రూపు కట్టిస్తాడు.

చారిత్రక నవలలను చారిత్రక వస్తు నవలలు, చారిత్రక రస నవలలు, చారిత్రక తత్త్వ నవలలు అని మూడుగా విభజిస్తే బాపిరాజు నవలన్నీ చారిత్రక తత్త్వ నవలలుగా కనిపిస్తాయి. చరిత్రలోని ఘట్టాలను వరుసగా కూర్చడం చారిత్రక వస్తునవల చేసే పని. చరిత్రలోని ఒక సంఘటనతో సంబంధంగల ఒకే నాయకుని ఇతివృత్తం వర్ణిస్తూ రసరంజితం చేయడం చారిత్రక రసనవల పని. చారిత్రక తత్త్వ నవలలో చారిత్రక సన్నివేశంతో పాటు రచయిత దర్శించిన ఒక తాత్త్విక సిద్ధాంతం ఉంటుంది. కథ, పాత్రలు ఒక తత్త్వానికి వ్యాఖ్యగా నిబంధింపబడతాయి. తన నవలలో బాపిరాజు దర్శించిన తత్త్వం భారతీయ సంప్రదాయం. మతైక్యత, శాశ్వతప్రేమ, జాతీయత, ఆత్మోన్నతి, కళారాధన, సౌందర్య దృష్టి భారతీయ సంప్రదాయంలో ఆయన దర్శించిన తత్త్వాలు. ఇవన్నీ వేరువేరు కావు. అన్నీ కలసి ఉత్తమ మానవ స్వభావాన్ని సిద్ధింపజేస్తాయని చెప్పడమే బాపిరాజు ఉద్దేశం.

బౌద్ధ, వైదిక ధర్మాల సమన్వయ సాధనకు పుట్టినవి హిమబిందు, అడవి శాంతిశ్రీ నవలలు. హిమబిందులోని స్థాంతిష్యుని పాత్ర ఆర్ష మతానికి సంకేతం. అమృతపాదార్యాతుల పాత్ర బౌద్ధ మతానికి సంకేతం. వీళ్ళిద్దరూ తండ్రీకొడుకులు. ప్రమాదవశాన తండ్రినుండి కుమారుడు విడిపోయి కొంతకాలం వేరే చోట పెంచబడి బౌద్ధ మత సిద్ధాంతాలను జీర్ణించుకొని తండ్రిని చేరుకుంటాడు. ఆర్ష బౌద్ధాలకు సంఘర్షణ జరుగుతుంది. ఈ సంఘర్షణ ఈ రెండు మతాలకు జన్య జనక భావాన్ని కలిగిస్తుంది. కారణాంతరాలవల్ల ఆర్ష మతం నుండి బౌద్ధ మతం వేరైనా రెంటి తత్త్వం ఒకటేనని బాపిరాజు ఉద్దేశం. చక్రవర్తి మతాలనన్నిటిని సమంగా ఆదరించడం చరిత్ర చెప్పిన పాఠం. మత సామరస్యం ఆర్ష బౌద్ధాలు ఒకే తత్త్వ మననానికి బాగా దోహదం చేసింది. అడవి శాంతిశ్రీలో నాయకుడైన బ్రహ్మదత్తుని ఆర్ష ధర్మ నిరతుడుగాను, నాయిక శాంతిశ్రీని బౌద్ధ మతాభి నిరతగాను చిత్రించి సమన్వయాన్ని సాధించాడు బాపిరాజు. రాజ్యైకత తాత్త్విక భూమికగా

రచితమైన నవలలు గోన గన్నారెడ్డి, కైలాసేశ్వరుడు, శిలారథం. ప్రేమ భౌతిక రూపాల కతీతంగా ఉంటుందనే భావం ఆధారంగా అంశుమతి నిర్మితమైంది. మధురవాణి నవలకు కూడా ప్రేమే పునాది.

బాపిరాజులో గల భావకవిత్వ ప్రధాన లక్షణమైన అంతర్ముఖత్వం నవలా రచనలో ఆయనకు బాగా ఉపయోగ పడింది. ఒక పాత్రను చిత్రిస్తూ ఆ పాత్రలో పరకాయ ప్రవేశం చేసి ఆ పాత్ర ద్వారా తాను చెప్పదలచిన విషయాలన్నిటిని చెప్పడం ఆయనకు అలవాటు. బ్రహ్మదత్తుని పాత్రద్వారా సనాతన ఆర్ష ధర్మాన్ని విపులంగా ప్రకటించడం దీనికి ఉదాహరణ. సమయం వచ్చినప్పుడు పాత్రలను పక్కకు నెట్టి తాను పాత్రగా మారి కళల ప్రయోజనాలను, సౌందర్య తత్త్వాన్ని గూర్చి ఉపన్యసిస్తాడు. ఆయన ప్రతి పాత్ర కళాత్మకంగా చలిస్తుంది. కళాత్మకంగా ఆలోచిస్తుంది. పవిత్రత, సత్యం, శాంతి, సర్వకాలాత్మక జాగృతి, మానవ పురోభివృద్ధి, రసానందం మొదలైన లక్షణాలను అవశ్యంగా పెట్టుకోని కళ కళ కాదని ఆయన అభిప్రాయం. అడవి శాంతిశ్రీలో నాట్యావిర్భావాన్ని, గోన గన్నారెడ్డిలో వివిధ నాట్య సంప్రదాయాలను, మధురవాణిలో నాట్య పద్ధతులను వివరించాడు. ప్రేమను గురించి చెప్పేటప్పుడు ఆయన దృష్టిలో భూమ్యాకాశాలు ఏకమైపోతాయి. స్త్రీలోని ప్రేమ భావానికి ఆయన వ్యాఖ్యానం చాల లోతుగా గంభీరంగా వుంటుంది. "స్త్రీకి ఉండే పౌరుషాలు, అహంభావాలు, ఓర్వలేనితనము ఎవరు వర్ణించగలరు ? స్త్రీ హృదయం స్త్రీకే తెలియదు. స్త్రీ మాయ అవడంచేత ఆమెలో ఎన్ని విచిత్రాలున్నాయో ఎవరికి తెలుసు ? ఆమె ప్రేమిస్తున్నానని చెప్పినా ఒక్కొక్కప్పుడు ప్రియుడు నమ్మలేడు. ఈ దినం తన సర్వస్వమూ ప్రియుని పాదాలకాడ పూజా పుష్పాలుగా చేసిన యువతియే రేపు ఆ ప్రియుని సర్వస్వమూ తన పాదాలకాడ పూజా కుసుమాలయినా ఆ పూవులను నిర్దాక్షిణ్యంగా నలిపి వేయగలదు" అని అడవి శాంతిశ్రీ నవలలో వివరిస్తాడు. ఇలా ఆయన సృష్టించిన ప్రతి పాత్రలోను అంతర్లీనంగా ఆయన దాక్కొన్నట్లుంటుంది.

బాపిరాజు చేసిన ప్రకృతి వర్ణనలు సజీవంగా వుంటాయి. కంటికింపైన రంగులతో కాన్వాసుపై చిత్రించినట్లు ప్రకృతి చైతన్యవంతంగా మన కండ్ల ముందు కదులుతుంది. "హిమబిందు నవలలో, ఆయన చేసిన యుద్ధ వర్ణనలు ఆనాటి యుద్ధ విశేషాలను మనకు పరిచయం చేస్తాయి. ఆంధ్ర సైన్య విభజనను

సంబంధించిన వివరాలెన్నో ఆయన సేకరించి ఈ నవలలో చూపించాడు. ఒక సేన అంటే ఏమిటో కింది పట్టిక చూస్తే తెలుస్తుంది.

ఒక దళము అంటే ఒక ఏనుగు, ఒక రథం, మూడు గుర్రాలు ఐదుగురు బంట్లు.

| | | |
|---|---|---|
| ఇలాంటి మూడు దళాలు | = | ఒక ముఖం |
| 10 ముఖాలు | = | ఒక గణం |
| 3 గణాలు | = | ఒక వాహిని |
| 3 వాహినులు | = | ఒక చమువు |
| 4 చమువులు | = | ఒక సేన |

ఈ వివరాలు హిమబిందు నవలలోనివి. ఇలాంటి విషయాల సేకరణకు ఆయన ఎంత కష్టపడ్డాడో తెలియదు. ఆయన చారిత్రక నవలల్లో గత వైభవచిత్రణ ఎక్కువగా వుంటుంది. ప్రాచీన ఆంధ్ర జాతి పౌరుషాన్ని. వైభవాన్ని, ధైర్య సాహసాలను, లలితకళల ప్రాశస్త్యాన్ని అడుగడుగునా స్మరించి పరవశించి పోతాడు. ఆయన సృష్టించిన నాయకులు సాహస ప్రియులు. నాయికలు వీరికే మాత్రం తీసిపోరు.

చారిత్రక నవల బాపిరాజు చేతిలో సర్వాంగీణ వికాసం పొందింది. ఒక వచనకావ్యంగా రూపు దిద్దుకొన్నది. ఎన్నో కళాత్మక విషయాలతో పాటు ప్రేమ, సౌందర్యం, మానవత్వం మొదలైన అంశాలను కూడా కథావాహినిలో చేర్చి విశదీకరించడంవల్ల, ఆయన నవలలన్నీ మానవ జీవిత వ్యాఖ్యానాలుగానే కనిపిస్తాయి. ఈ రకంగా బాపిరాజు నవలాకారుడుగా కృతకృత్యుడయ్యాడు.

**బాపిరాజు నవలల ప్రయోజనం :**

నవల వాస్తవాన్ని చిత్రిస్తుంది కాబట్టి అది మానవ జీవితంలోని భిన్న కోణాలను వ్యాఖ్యానిస్తుంది. ఈ వ్యాఖ్యానంలో మనిషి నేర్చుకోవలసినవి, ఆచరించవలసినవి ఎన్నో వుంటాయి. బాపిరాజు సాంఘిక నవలలన్నీ ఈ ప్రయోజనాన్ని సాధించాయి. ఈ దృష్టితో చూస్తే చారిత్రక నవలలు సాధించే ప్రయోజనం ఇంకా ఎక్కువే. ప్రాచీన చరిత్రకు సంబంధించిన పాత్రల మంచి చెడ్డలను నవలలు వివరిస్తాయి కాబట్టి ఆ పాత్రల మనస్తత్వ చిత్రణలద్వారా చరిత్ర పాఠాలు

అర్థమవుతాయి. చరిత్ర కోసం చరిత్ర పాఠాలు చదవని వాళ్ళకు నవలల ద్వారా చరిత్ర తెలుస్తుంది. కొంతవరకు చరిత్ర తెలిసిన వాళ్ళకు చారిత్రక నవలలు తప్పక కావ్యానందాన్ని కలిగిస్తాయి. ప్రాచీన సంస్కృతికి చెందిన ఎన్నో విశేషాలు చారిత్రక నవలల ద్వారా వ్యక్తమవుతాయి. మనకు తెలియని కాలాలకు చెందిన పాత్రల జీవితాదర్శాలు మనలను తప్పక ప్రభావితం చేస్తాయి.

మానవతా దృక్పధాన్ని, ఆదర్శోన్ముఖ జీవితాన్ని, కళోపాసనను తన నవలలో ప్రతిపాదించాడు బాపిరాజు. ప్రయోజనంతో నిమిత్తం లేని సౌందర్యోపాసన ఆయన ధ్యేయం. నవలలన్నిటా ఆయన భావించిన సౌందర్యం గోచరిస్తుంది. ఉపయోగంలో సౌందర్యాన్ని రంగరించినప్పుడు కలిగే ఆనందం అనిర్వచనీయమైనదని ఆయన అభిప్రాయం. హిమబిందు, అడవి శాంతిశ్రీల మానసిక చిత్రణలో ఈ అంశం లీలగా గోచరిస్తుంది. మనిషి మహోన్నతుడు కావాలన్నది ఆయన ధ్యేయం. ప్రాంతీయాభిమానాలు, కులమత వ్యవస్థలు, దేశకాల పరిస్థితులు, ఆచార వ్యవహారాలు మొదలైన వాటిని అధిగమించి మనిషి మనీషిగా ఎదగాలి. అలాంటి సర్వమానవ సౌభ్రాతృత్వం, సమానత్వం సాధ్యపడాలంటే మనిషిలో కళోపాసన విరబూయడమే మార్గమని బాపిరాజు నమ్మకం. ఈ నమ్మకంతోనే ఆయన నవలలలో ముఖ్యంగా చారిత్రక నవలలో కళలకు సంబంధించిన విషయాలనెన్నిటినో వివరించాడు. ప్రాచీన చరిత్రలో నిక్షిప్తమైన కళాంశాలను వెలికితీసి మనకు చూపించాడు. ఆయన నవలలలో కనిపించే మరొక విశిష్టత కళల సమ్యగ్ దృష్టి. ఆయన దృష్టిలో కళలన్నీ సమానం. నవలలలో ఈ విషయాన్ని ఆయన ఋజువు చేశాడు.

# 10. చలం - సౌందర్య దృష్టి

చలం కాల్పనికవాది, భావుకుడు. భావకవుల సౌందర్య దృష్టి చలానికీ వుంది. ఊహాప్రేయసిలో ప్రకృతి అందాన్ని చూచి పరవశించినవారు భావకవులు. భావకవుల సౌందర్య తత్వంలో ప్రేమభావం వుంది. ప్రేమ అంటే రెండు ఆత్మల కలయికగా వారు భావించారు. ఈ కలయిక శారీరక స్థితి నుండి ఆత్మిక స్థితికి ఎదిగింది వారి రచనలలో. శారీరక స్థితికి ఆత్మిక స్థితికి మధ్య స్త్రీల కచకుచాది వర్ణనలున్నాయి. ఇవి పురుషునికి ఆకర్షకాలు. వీటి ద్వారావ్యక్తి మనోమాలిన్యాలను పోగొట్టుకొని ఆత్మిక స్థితినుండి ఆధ్యాత్మిక స్థితివైపు పయనిస్తాడు. అప్పుడతనికి ఆనందంతో పాటు అలౌకిక సౌందర్యం సృష్టి నిండా కనిపిస్తుంది. మానవుని మనస్సులో విశ్వసౌందర్య దృష్టి ఏర్పడాలంటే వ్యక్తిగత సౌందర్యాల ఆవరణలు దాటుకోవాలి. దీనికోసం కవులు, రచయితలు స్త్రీ సౌందర్యం వైపు పురుషుని, పురుషుని అందం వైపు స్త్రీని ఆకర్షితులను చేసి వారిలో ఆ మార్పు కలిగిస్తారు.

మనిషిలో ఆకర్షణ, వికర్షణ రెండు ప్రధాన భావాలు. వీటిలో మొదటిది ప్రేమకు, రెండవది ద్వేషానికి కారణాలు. ప్రేమ భావ వ్యక్తీకరణ ప్రకృతి. ప్రకృతిలోని ప్రతి కదలికలో ప్రేమభావం ద్యోతకమవుతుంది. కవిత్వంలో ప్రకృతిని వర్ణించడానికి, ప్రేయసిని వర్ణించడానికి భేదం లేదు. ప్రేయసి అందమంతా ప్రకృతిలో వుంది. ప్రకృతి అందమంతా ప్రేయసిలో వుంది ప్రకృతిలో భగవంతుని అందం ప్రపంచితమై ఉంది. ఈ అందాన్ని అనుభవించాలంటే దానిని ముందు ప్రేమించగలిగాలి. ప్రేమ మొదట భౌతిక స్పర్శతో కూడి ఉంటుంది. ఈ భౌతిక స్పర్శలో కామం ఉంది; శృంగారం ఉంది; ఇంద్రియాలను తృప్తి పరచే గుణముంది. ఇది శారీరకం. ఈ స్థితిలో స్త్రీ శారీరక సౌందర్యం పురుషునికి

అధోగతి కలిగిస్తుందని, అందువల్ల శారీరక ప్రేమ తుచ్ఛమని ప్లేటో ప్రతిపాదించాడు. ప్లేటో ప్రతిపాదించిన ఈ ప్రేమ విషయం పునరుజ్జీవ యుగంలో కొన్ని మార్పులకు లోనైంది. కొందరు జ్ఞానులు ఇంద్రియ తర్పణం చేసే సౌందర్యం నుండి ఆత్మిక సౌందర్యం వైపు, దానినుండి ఆధ్యాత్మిక సౌందర్యం వైపు మనిషిని నడిపించే మహత్తర శక్తి ప్లేటో ప్రతిపాదించిన ప్రేమ అని అభిప్రాయపడినారు. ఉత్తమ ప్రేమికుడు తన ప్రేయసితో తాదాత్మ్యం చెందాలని, అది ముద్దు ద్వారా సాధ్యమవుతుందని కూడా అభిప్రాయ పడినారు.

> "For the kiss is .... rather union of soul than of body since it has power to draw the soul to itself and seperate it from the body." (J, B. Fletcher, 'The Religion of Beauty in Woman').

స్వార్థంతో బొత్తిగా సంబంధం లేని ఆత్మైక్యం సాధ్యం కాదనీ వీళ్ళ అభిప్రాయం. దాంటే, స్పెన్సర్ మొదలైన కవుల రచనల్లో ఇంద్రియ గతమైన ప్రేమ మానసిక ప్రేమగా మారుతుందని చూపబడింది. ప్రేమ ఇద్దరిమధ్య జీవిస్తుంది, వాళ్ళిద్దరూ ప్రేయసీ ప్రియులైనప్పుడు ఆ ప్రేమ శృంగార స్పర్శను పొందడంలో తప్పు లేదు అయితే ఇది నైతిక వర్తనకు కట్టుబడాలి. ఈ ప్రేమలోని శృంగారం కొన్నాళ్ళకు స్నేహంగా మారుతుందని భావకవుల అభిప్రాయం. భావకవులు ఊహలలో జీవించి సమాజాన్ని నిర్లక్ష్యం చేశారని విమర్శ ఉంది, అయినా అందాన్ని తమవలె అందరూ ఆరాధించాలని, తద్వారా ఆధ్యాత్మిక సౌందర్యంవైపు సాగాలని వారు ఆశించారు.

### కామం సౌందర్య భావమే :

శారీరక ఆనందం ద్వారా ఆధ్యాత్మిక సౌందర్యాన్ని దర్శించడం సాహిత్యంలో కొత్త విషయం కాదు. ఎందరో కవులు ఈ సిద్ధాంతాన్ని నిరూపించారు. చలం సౌందర్య దృష్టి దీనికి భిన్నమేమీ కాదు. ఆయన ఆలోచనలన్నీ స్త్రీ చుట్టూ తిరిగాయి. ఆమె శరీర తత్వాన్ని లోతుగా పరిశీలించాయి. కామం లేని ప్రేమను చలం ఆలోచించలేదు. ప్రేమ ఒక సౌందర్య భావమైతే కామం కూడా ఆయనకు సౌందర్య భావంగానే అనిపించింది. 'సౌందర్యానుభూతిపరమైన, ఆరోగ్యవంతమైన, స్వేచ్ఛాయుతమైన సెక్స్ జీవితం స్త్రీ పురుషుల మధ్య వుండాలన్నది

ఆయన ఆలోచన. లైంగిక సంపర్కంలో చలం దర్శించిన సౌందర్యం ప్రకృతి సౌందర్యం. ప్రకృతిలోని ప్రకంపనాలను స్త్రీ పురుషుల మధ్య ఊహించాడు చలం. మైదానం నవలల్లో అమీర్ 'అరేబియాలో రాత్రి వీచే ఈదురుగాలి నీజుట్టు రూపం దాల్చింది' అంటాడు తన్మయత్వంలో ఉన్న రాజేశ్వరితో. అమీర్, రాజేశ్వరి చేసిన వెన్నెల స్నానాలు చలం సౌందర్య దృష్టికి సంకేతాలు. ఇదే నవలలో 'మాకు వెన్నెల వచ్చినా సంతోషమే—చీకటిగా ఉన్నా సంతోషమే. మబ్బు పట్టినా సరే. అన్నిటిలో ఆనందం కనపడేది' అనే రాజేశ్వరి మాటల్లో చలం అనుభూతి కనిపిస్తుంది. మనసులోని సౌందర్య భావన పైకి రావాలంటే ఒక కారణం వుండాలి. ఒక అనుభవం వుండాలి. ఈ అనుభవంతో సౌందర్యపు లోతును చూడాలన్నది చలం అభిప్రాయం. మైదానం నవల్లోని ఈ పంక్తులు పరిశీలింపదగినవి. "ఆవేళ మధ్యాహ్నం రెండింటికి వాకిట్లో నుంచొని వున్నాడు. ఆ రోడ్లలో ఉద్యానవన విహారానికై వచ్చిన వాడివలె నడుస్తున్నాడు. ఎక్కడెక్కడ నా వస్త్రాల్లోంచి నా శరీరం కనబడుతుందో అన్నట్లు వెదికి ఒళ్ళంతా సిగ్గు పరిచాయి అతని చూపులు." అమీర్ చూపులు రాజేశ్వరి శరీరంపై ప్రసరించడం. తద్వారా ఆమె మనస్సులో నిగూఢంగా ఉన్న సౌందర్య దృష్టి బయటకు వచ్చి అమీర్ అందాన్ని ఆస్వాదించడం కనిపిస్తుంది.

చలం సౌందర్య ప్రపంచంలో స్త్రీ, మందరమైన జీవితం, సృష్టి సౌందర్యం ఇమిడి వున్నాయి. స్త్రీ సౌందర్యం గురించి చలం ఎన్నో అభిప్రాయాలు ప్రకటించాడు. "ఠాగూరు వర్ణనలవలె, వుడ్‌హౌస్ చక్కిలిగింతలవలె, మైకేల్ ఆర్లేన్ ఉపమానాలవలె, జపాన్ దేశపు రేడియో సంగీతంవలె నరాల్ని అందంగా లాగి బాధిస్తాయి కొందరి స్త్రీల సౌందర్యాలు" (చలం మ్యూజింగ్స్, 1976. పుట-43) అనడంలో చలం ఊహించిన స్త్రీల అందం మనకు కనిపిస్తుంది. "ఏ విధమైన అందమూ లేని జుట్టు, ఏ ఉపమానానికి సరిపోని కళ్ళు, ఏ సన్నదనమూ లేని నడుములు, ఏ మెరుగూ లేని రంగు, ఏదో రహస్యమైన ఆకర్షణలవల్ల ఏ నడకో, ఏ మాట మాధుర్యమో, ఏ కామ విస్ఫురణో రసికుల్ని దాసుల్ని చేసుకుంటాయి" (పుట-43) అనడంలో ఏ పోలికలకూ అందని ఈ స్వభావం ఆత్మకు సంబంధించినదనే భావం వ్యక్తమవుతుంది.

భావాలు ఆత్మికం కావాలంటే సౌందర్యపు అనుభూతి కావాలి. సౌందర్యం ఒక దశలో చలితం - మరో దశలో నిశ్చలం. చలిత సౌందర్యాన్ని ఆరాధించే

వాడి మనస్సు కూడా చలితమవుతుంది. చలితమవడంలోనే అతనికి ఆనందం. అరుణ నవల్లో "ఎందుకివన్నీ వెన్నెట్లో కూచొని, చంద్రుడు అస్తమిస్తాడే - నిన్న ఉదయించలేదే అని ఏడ్చే నిర్భాగ్యుణ్ణి నిన్ను చూశాను గాని, స్త్రీ వాళ్ళో ఎన్నాళ్లు కూచుంటుంది? చంద్రుడెంత సేపు వెలుగుతాడు? వెలిగితే నిద్ర పోతావు. అట్లానే నిలిస్తే ఈ సౌందర్యం భరించగలవా?" అన్న అరుణ పలుకులు సౌందర్యం ఆద్యంతాలు కలదని చెపుతున్నాయి. అందాన్ని అందంగా అంది నప్పుడే అనుభవించాలి. తాజాగా ఉన్న రోజాను నిర్లక్ష్యం చేసి వాడిపోయిన తరువాత చూడడంలో ప్రయోజనం లేదన్నది చలం భావం. ఇలాంటి ఉదాహరణలు చలం సాహిత్యంలో ఎన్నైనా దొరుకుతాయి, ఇవన్నీ అతని సౌందర్యానుభూతిని పట్టి చూపుతాయి. ఇలాంటి సౌందర్య తత్వం చలం తొలి దశకు చెందిన రచనలలోనే కనిపిస్తున్నది. ఆధ్యాత్మిక వాసన అలముకొన్న మలి దశలో ఆయన దర్శించిన సౌందర్యం నిశ్చలం - అవ్యక్తం. మనసు పొరలలో గిరికీలు కొట్టుకొంటూ అవ్యక్తమైన అనుభూతుల పండించిన సౌందర్యమది.

## ప్రకృతి - స్త్రీ :

ప్రకృతి సౌందర్యంలో స్త్రీ సౌందర్యాన్ని చూడడం అందరు కవులలోవలె చలంలోనూ కనిపిస్తుంది. అయితే ఆయన ఊహలలో సహజత్వం లేక నగ్నత్వం మనముందు ప్రత్యక్షమవుతుంది. చూచిన అందాన్ని అలాగే చెప్పడం ఆయన కిష్టం. కవిత్వపు రంగు పులిమి చెప్పడం ఆయనకు అలవాటు లేదు. ప్రకృతిలో తాను దర్శించిన ప్రేయసి రూపాన్ని ఉద్వేగభరితంగా ఎలా చెపుతాడో చూడండి. "ఈ ప్రపంచమే నా ప్రియురాలు. ఘోరరాత్రి ఆమె శిరోజం. ఈ కిరణాలే ఆమె హస్తాలు. ఈ ఊగే అలలే ఆమె వక్షం. ఈ ఇసికే ఆమె తొడలు" (పుట-60). ప్రేయసి అందాలను ప్రకృతిలో చూడడం కాల్పనిక కవుల లక్షణం. "సృష్టి సౌందర్యంలో మాత్రం వాంఛ లేదా? మబ్బుల మీద పడుకోవాలని, నీళ్ళ మీద తేలాలని, పువ్వుల్ని కోసుకోవాలని, గడ్డిలో కూచోవాలని, కొండల్ని కౌగలించు కోవాలని కోర్కె కలగడం లేదా?" అనడం ఆయన సౌందర్య దృష్టిని ప్రస్ఫుటం చేస్తుంది.

స్త్రీ శక్తి స్వరూపిణి. పురుషుని అహంకారాన్ని ద్రవింపజేసే గుణం ఆమె కుంది. అందుకే చలం ఆమెల్లో ఉన్నతిని చూశాడు. ఆమెకు స్వేచ్ఛ కావా

అన్నాడు. ఎప్పుడూ స్త్రీ చరిత్రనే వ్రాస్తావే అని అడిగిన వాళ్ళకు 'సృష్టి స్త్రీ స్వరూపం కనుక' అని సమాధానమిచ్చాడు. ఆమె తన అపరదేవతని, మంగళ మూర్తియని, ఆమెనే ప్రేమిస్తానని, ఆరాధిస్తానని అన్నాడు. "ఆమెను ఆధారం చేసుకొనే సౌందర్య శక్తిని అందుకొని సృష్టి రహస్యాన్ని సాధించి యోగినౌతాను" (ప్రేమలేఖలు) అని కూడా అన్నాడు. ఈ వాక్యాలలో చలం సౌందర్య దృష్టి బహిర్గతమవుతుంది. తరువాత అరుణాచల యోగం పొందడానికి పనికి వచ్చిన సౌందర్య యోగమిది. సౌందర్య భావం సత్యం - శివం - సుందరం. ఈ మూడు తత్త్వాలు ప్రకృతి తత్త్వంలో వున్నాయి. ప్రకృతి పరమేశ్వర తత్త్వం కూడా. పరమేశ్వర తత్త్వావిష్కరణకు ప్రకృతి తత్త్వానికి చెందిన స్త్రీత్వం సోపానమవు తుందని ఆయన భావించినట్లు అనుకోవలసి వుంది. "నా మనసు పొంగి చల్లారిన కొద్దీ నాకు తెలియకుండానే నిర్మల శాశ్వత శాంతి క్రమంగా సాగుతోంది నాపై" అని రాసుకోవడంలో సౌందర్య తత్త్వం వైపు ఆయన సాగిపోయిన వైనం అర్థమవుతుంది.

## సౌందర్యం - చలం వ్యక్తిత్వంలోని భాగం:

చలానిది అనుభవాలకు ప్రాధాన్యతనిచ్చే వ్యక్తిత్వం. ఈ అనుభవాలు స్త్రీ నుండి ఈశ్వరుడిదాకా వివిధ పరిణామ దశలకు వ్యాపించి ఉన్నాయి. ప్రశాంతత కన్నా సుందరమైనదేదీ లేదని చలం అభిప్రాయం. ఈ స్థితినే ఆయన మొదటి నుండి కోరుకొన్నది. ఇలాంటి స్థితిని వెదకుతుంటే బయట పడిన భాగం సామాజి కాంశం. మొదటి దశలోని ఆయన రచనలన్నీ సామాజికాలైనట్లు కనిపించినా ఆయన వ్యక్తిత్వమే అన్నిటా ప్రధానం. ఆయన అభిలషించిన అందాన్నే ఆ రచనలలో చూపాడు. అందం మనిషి అనుభవంలోకి రావాలన్నది ఆయన అభి ప్రాయం. కవితావేశం ఉన్నవాడు గావడంచేత, సున్నిత మనస్కుడు గావడంచేత తన రచనలలో ఆనంద పారవశ్యానికి, తద్వారా సంయోగ యోగానికి ప్రాధాన్య మిచ్చాడు. ఆయన దృష్టిలో "సంయోగంలో యోగముంది. కళ లన్నిటిలో ఉన్నతం రతి కళ. దాని ద్వారా ఆధ్యాత్మికానందం కలుగుతుంది." ఈ సిద్ధాంతం కోసం ఆత్మికమైన అంశాలకే ప్రాధాన్యమిచ్చాడు. ప్రకృతిని అనుభవం కలిగించ డానికి ఉపయోగపడే వస్తువుగానే భావించాడు. స్త్రీ అందం పురుషుని ఆకర్షించి లోబరచుకొంటుందని తన రచనలలో నిరూపించాడు. అలాగే పురుషుడు కూడా

స్త్రీ లోని సౌందర్య బిందువును తన ఆకర్షణ ప్రకంపనాలతో కదిలించాలంటాడు. బ్రాహ్మణీకంలో "ఎప్పుడో తప్ప సాధారణంగా పురుషుడు వచ్చి తన చూపులతో మేల్కొలిపితే గాని మొదటిసారి స్త్రీత్వం నిద్ర లేవదు" అన్న వాక్యం దీనిని నిరూపిస్తుంది. సౌందర్యభావన చైతన్య లక్షణం. బండగా బతికే వాళ్ళకిది అర్థం కాదు. జీవితంలో ఏర్పడిన సంఘర్షణ సౌందర్య తత్త్వంలో కరిగి పోతుంది. మనిషికి ఈశ్వరుని మీద భావం లేనంతవరకు భౌతిక సౌందర్యమే సౌందర్యం. పురుషుడికి స్త్రీలో, స్త్రీకి పురుషుడిలో ఇది కనిపిస్తుంది. ఈ సౌందర్యారాధనలో మనసుల కలయికతో పాటు శరీరాల కలయిక కూడా అవసరమంటాడు చలం. ఈశ్వరుని మీద భావం ఏర్పడిన తరువాత సౌందర్యానికి భౌతికాది ఇతర ఆవరణ లుంటాయని అనిపించదు. ఇది ఆధ్యాత్మిక సౌందర్యం.

**మైదానం, అరుణ నవలలు—**

**చలం సౌందర్య పరిణామం :**

మైదానం 1927 లోను అరుణ 1939 లోను వెలువడిన నవలలు. మైదానం రచననాటి చలం వ్యక్తిత్వానికి అరుణ రచననాటి ఆయన వ్యక్తిత్వానికి భేదముంది. సంప్రదాయ వివాహ వ్యవస్థ పనికిరాదని, స్త్రీకి లైంగిక స్వేచ్ఛ కావాలని, నచ్చిన వ్యక్తితో ప్రేమగా ఉండవచ్చునని ఆయన చెప్పిన విషయాలు 'మైదానం'లో స్ఫుటత్వం దాల్చినాయి. 'అరుణ' చలం దర్శించిన స్త్రీత్వానికి పరిణామాత్మక ప్రతీక. "అరుణ చచ్చిపోలేదు. నాకు తెలుసు. ఇంకా మబ్బుల్లో. చిన్నబిడ్డల లేత మడమలమీద, కందిన ప్రియురాలి పెదవిమీద, రోజాపువ్వు రేకుల్లో, పద్మాల రేకుల నడుమ, తాగిన మా కళ్ళ కొలుకుల్లో ఎరుపుజీరల్లో నశించలేదు. జీవితంలో ఈ దేహానికి నా శృంగారభావాలకీ యెట్లా స్వర్గద్వారాలు తెరిచిందో. అట్లానే నా ఆత్మకీ నా ఆధ్యాత్మిక సందేహాలకీ ఎప్పుడో ఏ ఆశ్రమం నుంచో స్వర్గ ద్వారాలు తెరుస్తుందని నా నమ్మకం" ఇవి అరుణ నవల ముగింపు వాక్యాలు. ఈ వాక్యాలలో చలం సౌందర్యభావం మనకు కనిపిస్తుంది స్త్రీత్వంలోని సౌందర్యం ఆధ్యాత్మిక సౌందర్యంగా పరిణమిస్తుందన్న ధ్వని ఇందులో వుంది. శారీరక సౌందర్యం ఆత్మిక సౌందర్యంగా మారి తరువాత ఆధ్యాత్మిక సౌందర్యంగా మారుతుందని, ఇది వ్యక్తి మానసిక పరిణామంమీద ఆధారపడిన విషయమని

ఈ మాటల ద్వారా అర్థమవుతుంది. సౌందర్యం అఖండం. భిన్నప్రకృతులలో భాసించిన సౌందర్యం ఏకత్వాన్ని పొందుతుంది. అరుణ—ఆకర్షణలో, స్త్రీత్వంలో పురుషుణ్ణి కవ్వించే అర్థంకాని తత్వం; పురుషుడు పొందే దివ్యానుభూతిని అభివ్యక్తం చేసే మహాప్రతీక. ఆ యనుభూతి శారీరకమా, మానసికమా, ఆధ్యాత్మికమా అని నవలలో జిజ్ఞాస. ఆ జిజ్ఞాస, దాని తాలూకు మధురస్వప్నం ఒక వైపు—సంఘం స్త్రీకి ఏర్పరచిన కట్టుబాట్లు మరోవైపు—ఈ రెంటి మధ్య నలిగే స్త్రీత్వం నిరాశ్రయమై అదృశ్యమౌతుంది. అయినా ప్రకృతి సౌందర్య భావన కలిగించే ప్రతి అంశంలోను ఆ స్త్రీత్వం—అరుణ ఎప్పుడూ జీవించే వుంటుంది, అంటే సౌందర్యభావనలో శారీరకానుభూతి దివ్యానుభూతిగా, శారీరక సౌందర్యం దివ్యసౌందర్యంగా మారతాయి. చలం నవలల్లో, కథల్లో వర్ణించిన అందానికి సంబంధించిన అంశాలు నిజమైన సౌందర్య తత్త్వంలో పుట్టి పొటమరించి అందులోనే లయించాయి. ఇవన్నీ వికృతులు. సౌందర్య తత్వం శాశ్వతం. చలం సౌందర్య దృష్టి ఇంత నిగూఢంగా వుంటుంది.

సౌందర్యానికి మానసిక ప్రయోజనంతోపాటు శారీరక ప్రయోజనం కూడా వుండాలని చలం భావించినట్లు నా కనిపిస్తున్నది. ఆయన భావించిన శారీరక సౌందర్య దృష్టిని, ఆధ్యాత్మిక సౌందర్య దృష్టిని విడివిడిగా చూపడం కూడా కొంత కష్టమే. అరుణాచలానికి వెళ్ళిన తరువాత చేసిన రచనలలో ఆధ్యాత్మిక సౌందర్యదృష్టి వేరుగా కనిపించినా అంతకు ముందు చేసిన రచనలలో భేదం లేనట్లే కనిపిస్తుంది. 'మైదానం'లోని అమీర్ చూపులకు రమణ మహర్షి చూపులకు చాల పోలికలున్నాయి. రెండింటిలోను స్వార్థప్రయోజన ముంది. ఆ రెండు చూపులకు భేదం లేదనడంలో చలం దర్శించిన సౌందర్యం వ్యక్తమవుతుంది. అమీర్ చూపులు రాజేశ్వరి జీవితంలో తుఫాను రేపి అలజడి సృష్టించి కొత్త జీవితానికి నాంది పలికాయి. రమణ మహర్షి చూపులు చలాన్ని జీవితాంతం కట్టేసి ఆనందాన్ని సంపూర్ణతను ఇచ్చాయి. అమీర్ రమణ మహర్షిగా రాజేశ్వరే చలంగా కలపిస్తారు. ఈ పోలికలో శారీరక సౌందర్యం ఆధ్యాత్మిక సౌందర్యంగా రూపు దిద్దుకోవడం కనిపిస్తుంది. రాజేశ్వరి అమీర్‌తో జీవితాన్ని తృప్తిగా అనుభవించింది. రమణాశ్రమంలో చలం తన జీవితానికి సార్థకత పొందినాడు ఈ రెండు ప్రయోజనాలు రెండు సౌందర్యాల అంచుల నుండి పుట్టినవే.

అనంతమైన సౌందర్యం నుండి ఒక కణంగా విడివడి సుఖదుఃఖాల ననుభవించి మళ్ళీ అనంతంలో కలిసిపోయే జీవికి ప్రాపంచికమైన ఆలోచనలు, ఆకర్షణలు, అందాలు మొదట అనుభవంలోకి వస్తాయి. ఆ అందాల అనుభవంలో జీవితం పండి సార్థకత పొందుతుంది. ఇది చలం రాసిన 'ఓ పూవు పూసింది' అనే కథలో స్పష్టమవుతుంది. సమస్త సౌందర్యాన్ని స్వాధీనం చేసుకొని వికసించిన పుష్పం కొంత కాలానికి మరొక దశను పొందుతుంది. ఈ దశలో పుష్పం లోని రేకులు, రంగులు నడలి ముడతలుపడిపోతాయి, అప్పుడు దాని చూపు లోపలికి, తన చుట్టూ జరిగే సృష్టి ఉత్సవంలో తానొక ముఖ్య పాత్రధారిగా అనిపిస్తుంది. పై ఆకర్షణల పొంగు తగ్గి శాశ్వత సత్యమైన సౌందర్యతత్వం దానికి అర్థమవుతుంది, చలం జీవితంలోనూ ఇదే జరిగింది. లోకపు రొష్టులో పడి భౌతిక సౌందర్యం పర్యాప్తం కాగా శాశ్వత శాంతి అనే సౌందర్యం వైపు పయనించడం చలం జీవితంలో ఒక మలుపు. ఈ మలుపులో అతనికి చూపు ప్రసరించినంతవరకు సౌందర్యం గంభీరంగా దర్శన మిచ్చింది. అదే దివ్య దర్శనం. అదే దివ్యానుభూతి. ఈ అనుభవంలో శాశ్వత సౌందర్యం రేకులు విచ్చుకుంది. యౌవన బలం, సంతోషం, ప్రేమ, కాంక్ష మొదలైన భావాలను సంపుటీకరించుకొన్న సౌందర్యం భగవానుని ముందు అర్పితమైంది. జీవితంలో ఆనందమంటే ఏమిటో, అనుభవమంటే ఏమిటో తెలిపింది. ఈ సౌందర్య దర్శనంలో కాంక్ష లేదు. అనుభవాల జ్ఞాపకాలనుండి అనుభవిస్తూ వుండే నిరంతరాయంలోకి, కల్లోలం నుండి ప్రశాంతిలోకి, అవరోధాలను ఛేదించడం నుండి అవరోధ అతీతత్వంలోకి, చంచలత్వం నుండి నిశ్చలత్వంలోకి చేసిన ప్రయాణమే గుడిపాటి వెంకటచలత్వమని డా॥ వావిలాల సుబ్బారావుగారు చెప్పడం ('ఉదయం' దిన పత్రిక, 17-5-1993) సమంజసంగా ఉంది.

### సౌందర్యం ఒక ఆధ్యాత్మిక భావన :

భోగాలను ఆధ్యాత్మిక పరంగా అర్థం చేసుకోవడంలో సౌందర్యం ద్యోతకమవుతుంది. వస్తుగత సౌందర్యం ఒకరికి కనిపించినట్లు మరొకరికి కనిపించదు. సౌందర్యారాధన దివ్య లక్షణం. ఈ లక్షణాన్ని ప్రకృతిలోను స్త్రీలోను చూడాలంటాడు చలం. సృష్టి సౌందర్యానికి స్త్రీ సౌందర్యానికి భేదం లేదని, రెండిటిలోను వాంఛను కలిగించే గుణముందని, ఈ సౌందర్యం వెనక వున్నదంతా ఒకటే శక్తి

స్వరూపమని అతని అభిప్రాయం. ఆయన మాటలు చూడండి. "అది మన పెదిమలకే అందదు. అధికారాలకీ లోబడదు. ఊరికే హృదయాన్ని పిలిచి పిలిచి అందుకోవాలని నడిచినకొద్దీ ప్రతిధ్వనివలె దూరంగా పోయి నవ్వుతుంది. అదే ఎండమావులు, అదే ఆకాశం, అదే వెన్నెల చుట్టూ ఉంది. చిక్కదు. అదే స్త్రీ ముఖం మీద చిరునవ్వు. పిల్లల ఒంటిమీద కొత్త వెలుగు" (పుట-170). సౌందర్యం వాంఛను కలిగిస్తుందనడంలో అది అనుభవించే వస్తువని చలం భావించాడనుకోవాలి. సృష్టి సౌందర్యంలో స్త్రీ సౌందర్యముంది. అనుభవించాలనే కొద్దీ అది దూరానికి జరిగిపోతుంది. వ్యక్తి సంస్కారాన్ననుసరించి ఎంత ప్రాప్తమో అంత అనుభవంలోకి వస్తుంది. దానికి మించి గ్రహించాలన్నా సాధ్యం కాదు. దీనివి బట్టి సౌందర్యం అఖండ సచ్చిదానంద స్వరూపమని అనుభవంలోకి తెచ్చుకోవాలని ప్రయత్నించే కొద్దీ దాని పరిధి పెరుగుతుందని అది మనిషిపై చూపే ప్రభావం అధికమవుతుందని అర్థమవుతుంది.

సౌందర్య దర్శనం సాధన ద్వారా సాధ్యమవుతుందంటాడు చలం. సాధకుడు ప్రారంభ దశల్లో భౌతిక వస్తు గతమైన అందాన్నే ఆస్వాదించగలడని, సాధన పరిపక్వమైన తరువాత ప్రకృతి ద్రవ్యాలలో అవ్యక్తమైన ఆధ్యాత్మిక సౌందర్యాన్ని పొందడం సాధ్యమవుతుందని ఆయన అభిప్రాయం. ఇది ఆచరణ యోగ్యంగానే వుంది. అనంతమైన సౌందర్య తత్వం నుండి విడివడి కనిపించే సౌందర్యం స్త్రీలలో ఉందని చలం భావించాడు. అందుకే స్త్రీ శృంగారం ఆయనకు సౌందర్య స్ఫోరకంగా కనిపించింది. పురూరవ నాటకంలో ఊర్వశి అన్న మాటలు చూస్తే ఈ విషయం ఇంకా స్పష్టమవుతుంది. "సౌందర్యానికీ ఆ కలయికకీ సంబంధమేమిటి? అదికామ బలం. సృష్టి శక్తి. చేతుల్లోకి తీసుకొని అదిమి తాగి కళ్ళు ఆవేశంతో రక్త విజృంభణతో మనస్సు పొరలు గప్పి - ఆ నిముషాన సౌందర్యంతో ప్రసక్తి ఏముంది? సౌందర్యాన్నే అనుభవించడం నేర్చుకొన్న వాడు స్వర్గమే నీ కరతలామలకం. ఆలింగనంలోకి అపురూప దేహలావణ్యాన్నే గాదు, గొప్ప సంస్కారాన్ని విశాల విజ్ఞానాన్ని ఆధ్యాత్మిక శక్తిని తీసుకొంటు న్నావు." లౌకిక స్థితి నుండి అలౌకిక స్థితికి తీసుకొనిపోయే మాటలివి. మనిషి ఒకేసారి ఆధ్యాత్మిక సౌందర్యాన్ని చూడలేడు. ప్రకృతిలో వ్యక్తిగా చూడదగిన అందం దీనికి పునాది. ఈ పునాది శారీరకం. సౌందర్యాన్ని చేతిల్లోకి తీసుక్కోగల్గి

దానితో ఏకత్వం పొందినపుడు భౌతిక సౌందర్య దశ నుండి ఆధ్యాత్మిక సౌందర్య దశకు చేరే అవకాశం కలుగుతుంది. ఇది సాధన ద్వారా సాధ్యమవుతుంది. దీనికి మనో నిశ్చలత్వం, ఏకాగ్రత అవసరం. వ్యక్తిగతమైన సౌందర్యాన్ని విశ్వ వ్యాప్తంగా చూడడం చలం సౌందర్య దృష్టి. ఇదే సౌందర్య దర్శనంలో చలం చెప్పిన ఆధ్యాత్మిక దశ. ఈ దశను చూడగలిగిన వ్యక్తికి సౌందర్య స్థితికి సంబంధించిన ఒకే దశ కనిపిస్తుంది. అదే సత్యం - శివం - సుందరం అని చెప్పదగిన అవ్యక్త స్థితి. ఇదే చలం ఊహించిన జీవితాదర్శనం.

## ప్రేమ, శృంగారం, సౌందర్య భావం నుండి పుట్టినవే:

అందాన్ని చూచి మెచ్చుకొనే గుణం ప్రేమకు మొదటి మెట్టు. ప్రేమ వ్యక్తులమధ్య కలుగుతుంది కాబట్టి స్త్రీ పురుషులు దీనికి ప్రధానం. పురుషుడు ప్రేమించేది స్త్రీ శరీరాన్నా లేక ఆమెలోని ఆత్మనా అనే ప్రశ్న ఏర్పడినపుడు చలం శరీరం లేకుండా ఆత్మ లేదు కాబట్టి మొదట శరీరాన్నే ప్రేమించాలంటాడు. శరీరం ద్వారా శృంగార భావానికి సార్థకత కలుగుతున్నది. చలం అభిప్రాయంలో శృంగారం సౌందర్య భావమే. అందుకే ఆయన సౌందర్య దృష్టి స్త్రీల లావణ్యంపై ఎక్కువగా కేంద్రీకృతమైంది. కళ్ళలో నడకలో మాటలో చిరునవ్వులో చేతి వేళ్ళలో అందాన్ని చూచినప్పుడల్లా అది అక్కడతో ఆగక వాంఛగా మారి తనను బాధిస్తుందంటాడు చలం. "అనాదినుంచి పుట్టి చచ్చిన సౌందర్యవతులు, కవులు భావించిన స్వరూపాలు. పుట్టబొయ్యేవారు అందరూ వేధిస్తారు. ఇప్పుడు చిన్నగా ఉన్నవారిని చూచి బాధ కలుగుతుంది. వాళ్ళు ఎదిగేటప్పటికి నేను ఎక్కడోనని" అన్న ఆయన మాటలు సౌందర్యం శారీరకమేనన్నట్లు ధ్వనిస్తాయి. లైంగిక చర్య శారీరక సౌందర్యానికి ఫలితం. ఇది అందరిమధ్యా సౌందర్య స్ఫోరకంగాను ఆనందదాయకంగాను ఉండకపోవచ్చు. మానసిక సంస్కారాలు కలిసిన వాళ్ళలోనే దీనికి అస్తిత్వం. స్త్రీ సౌందర్యాన్ని ఆరాధించడమంటే లైంగిక చర్య లేకుండా అని కాదు. చలం భావించిన స్త్రీ సౌందర్యంలో ఒక భాగమే. స్త్రీ - పురుషులను ఒకటిగా బంధించే మూల సూత్రమది. అందులోనే చలం భావించిన సౌందర్యముంది. 'మ్యూజింగ్స్' లో ఒక చోట "తృప్తినిచ్చేది కామం కాని సౌందర్య భావం కాదు. కోటులో పువ్వు అందంవలె ఇంట్లో స్త్రీ అందం నీకు అందక నీ గోడలకి తలుపులకి పరదాలకి చేతులకి చూపులకి సంభోగాలకి

పేరంటాలకి అతీతమై దేవత్వాన్ని పొంది నిన్ను శుద్ధ మూర్తుణ్ణి చేసి నవ్వుతోంది. నువ్వు అనుభవించేది చర్మం సౌందర్యం కాదు" అంటాడు. స్త్రీ సౌందర్యం సంభోగానికి అతీతం అనడంలో తృప్తినిచ్చేది కామం గాని సౌందర్యం కాదన డంతో చలాన్ని అర్థం చేసుకోవడానికి కొంత ఆలోచన కావాలి. స్త్రీ సౌందర్యంలో దివ్యత్వమున్నదనేది ఆయన అభిప్రాయం. ఈ దివ్యత్వమే ఆధ్యాత్మిక సౌందర్యం. కామం శరీరగతమైన తృప్తి. దీనివి దాటి పోయినప్పుడే దివ్యానుభూతి సాధ్యం. ఇది కూడా స్త్రీ ద్వారా సాధ్యమవుతుందంటాడు చలం. లైంగిక చర్య మనిషిని ఆనందపారవశ్యుణ్ణి చేసి దూర తీరాలకు తీసుకొనివెళ్ళి మనోనేత్రం మాత్రమే దర్శించగల ప్రకృతి అందాలను ప్రదర్శిస్తుందని చలం అభిప్రాయం. ప్రేయసిలో కనిపించే అందం సృష్టిలోని ఎన్నో రూపాలలో కనిపిస్తుంది. జగమంతా రాగ రంజితమై పోతుంది. నిశ్శబ్ది స్థితిలో అవ్యక్త మధురమైన ధ్వనులు చెవులకు వినిపిస్తాయి. ఆ స్థితిలో చరాచర ప్రకృతి ఏకీకృతమౌతుంది. దివ్యమైన అఖండ మైన సౌందర్య తత్వానికి అవన్నీ భిన్న రూపాలు, భిన్న సవ్వడులు. ఈ రూపాలు, ఈ సవ్వడులు శారీరక స్థితిని ఆత్మిక స్థితిని దాటుకొని అనంత స్థితికి చేరి అవ్యక్త సౌందర్యంలో లయించి పోతాయి. అందుకే చలం 'సంయోగంలో యోగముంది. కళలన్నిటిలో ఉన్నతం రతికళ" అన్నాడు.

**ముగింపు :**

"నేనే కల గన్నానో, ఏమి వాంఛించానో నా పుస్తకాలలో ఆ గొప్ప సౌందర్యారాధన ఫలించి నేనేమైనా నా స్వప్నాలలో కవి హృదయం అందుకోలేని ప్రపంచాతీతమైన గాంధర్వ సౌందర్యాలకి కళ్ళు తెరవబోతున్నాను. అప్పుడే దూరం నుండి వినవస్తున్నాయి దివ్యగానాలు" అనే ఆయన మాటలు ఆయన సౌందర్య దృష్టిని బహిర్గతం చేస్తున్నాయి. సౌందర్యం దివ్యం. ప్రపంచాతీతం. దానిని ఆరాధించి అందుకోవాలి. ఆ ఆరాధన కొన్నాళ్ళకు ఫలించి గాంధర్వ సౌందర్యం దృగ్గోచరమవుతుంది. 'సుధ' అనే గేయ సంపుటిలోని ఈ పంక్తులు కూడా ఈ సందర్భంలో పరిశీలనార్హాలు.

"లలనా ఈ లోకమింతే – ఏ సత్యమూ లేని
ధూర్తమూ శాల్మమూ అనే పడుగు పేకలపై

జ్ఞానకాంతి మెరిపించే తళుకు రూపాలు -
ఇదో బొమ్మలాట
ఈ మనసు మారిందా - తెలుసుకొనే మనసూ లేదు
తెలుసుకోవడమనే పనీ లేదు - తెలుసుకోవడానికేమీ లేదు
తెలుసుకొనే మనసు తెలిసే లోకం తెలిపే ఈశ్వరుడు
అన్నీ ఒకటే
ఒకటే మౌనం - శబ్దాతీతమైన నిశ్శబ్దం
సమస్తమూ నిండిన నిరామయం."

ఇదే చలం గుర్తించిన తత్వం. ఈ తత్వసౌందర్యం శబ్దాతీతమైన నిశ్శబ్దం నుండి వచ్చి ప్రేమ కామం ఆకర్షణ అనుభవం శారీరక సౌందర్యం ఆత్మిక సౌందర్యం అనే వివిధ దశలను దాటి మళ్ళీ అందులోనే కలిసిపోయింది. ఈ సౌందర్య అభివ్యక్తే ప్రపంచం. ఈ సౌందర్య అభివ్యక్తే ఇతర క్రియలూనూ. ఇదే చలం సౌందర్య దృష్టి.

# 11. ఆధునికాంధ్ర కవిత్వం – ఒక పరిశీలన

ఇప్పుడొస్తున్న కవిత్వమంతా ఆధునిక కవిత్వంగా చలామణి అవుతున్నది. కవి, కవిత్వం అనే మాటలు ప్రాచీనకాలం నుండి ఉన్నవే. కవిత్వానికి ప్రయోజనం ప్రాచీనకాలం నుండి సామాజిక చైతన్య స్ఫూర్తే. దీనితోపాటు కవిత్వం పఠిత లేక శ్రోత మనస్సును ఉల్లాసపరిచేదిగా వుండాలనడం కూడా దాని ప్రయోజనంలో భాగమే. దీనినే ప్రాచీనులు ఆనందమన్నారు. కవిత కలిగించే ఆనందం అది కలిగించే భావ సౌందర్యం పైన, శ్రుతి సౌందర్యం పైన ఆధారపడుతుంది. శ్రుతి ఛందస్సుకు సంబంధించిన మాట. ప్రాచీనకాలం నుండి ఈనాటివరకు వెలువడిన కవిత్వానికి ఈ లక్షణాలున్నాయి. ఇప్పటి కవులు భావానికి ప్రాధాన్యం ఇస్తున్నా అంతర్లీనంగా నాదానికి సంబంధించిన ఒక లయను సాధించడానికే ప్రయత్నం చేస్తున్నారు.

## కవిత్వ స్వరూపం :

కవిత్వానికి వస్తువు, రూపం ప్రధానమైనవి. రూపం అనేది కవిత్వ బాహ్య సంబంధి. కవిత్వ రూపాన్ని కవి అందంగా మలుస్తాడు. ఈ అందంలో శైలి, రీతి, ధ్వని యిత్యాదులుంటాయి. పద్యం, పదం, పాట, గేయం, వచనం అనేవి కవిత్వ రూపాన్ని నిలబెట్టే సాధనాలు. ఇవి కూడా కవిత్వ బాహ్య సంబంధులే. కవిత్వం అంటే వర్ణించడం అని అర్థం. వర్ణనా ప్రధానమైంది కవిత్వం అనుకున్నప్పుడు వస్తువేదైనా దాని బాహ్యరూపాన్ని కవి అలంకరించక తప్పదు. కవిత్వానికి అలంకారాలెన్ని వున్నా, ఏ రూపంలో వున్నా అది ప్రతిపాదించే విషయమొకటి వుండాలి గదా! ఇదే వస్తువు. కవిత్వం అనుభూతి ప్రధానమైంది కాబట్టి నిర్వచనాలకు సరిగా అందదు. ఈ కవిత్వం వస్తువులో వుంటుందా లేక రూపంలో వుంటుందా అని ప్రశ్నిస్తే చెప్పడం కష్టం. నిర్వచనానికి సరిగా అంద

నప్పుడు దానిని ఒక చట్రంలో బంధించి వివరించడం మరీ కష్టం. కవిత్వం వస్తువులోను, రూపంలోను ఉంటుందని చెప్పడం ఒక పద్ధతి. ఇది సరైన పద్ధతి కాదు. వస్తువును పొడి మాటల ద్వారా కూడా చెప్పవచ్చు. పొడి మాటలు కవిత్వం కాదు. కవిత్వం చమత్కార జనకంగా, ఆలోచనామృతంగా వుంటుంది కాబట్టి, అది పద్యంలో, పదంలో, పాటలో, గేయంలో, వచనంలో దేనిలోనైనా వుంటుంది కాబట్టి దీనికి ఫలానా రూపం కావాలని కూడా చెప్పలేం. అందువల్ల కవిత్వం వస్తురూపాల కతీతంగా వుంటుంది. మనస్సును స్పందింపజేసి ఒక భావం తాటిల్లతలా మనలో ప్రవేశించినపుడు కవిత్వం పుడుతున్నది.

కవిత్వానికి మనస్సుకు దగ్గర సంబంధముంది. భౌతిక సంఘర్షణ నుండి విడివడి మనస్సులో చేరి, మనస్సులో కొంతకాలం నాని స్ఫుటత్వం పొంది ఉరవడిగా బహిర్గతమవుతుంది కవిత్వం. చూచి ఉన్నదున్నట్లు చెప్పడం లేదా రాయడం కవిత్వం కాదు. కవిత్వం నిసర్గంగా, రమణీయంగా మనస్సును తాకు తుంది. అలంకారాది తొడుగులను, పద్యం, పదం మొదలైన రూప సాధనాలను తొలగిస్తే మిగిలేది భావం. అందమైన, ఆకర్షకమైన, హృదయాపర్జకమైన భావ స్ఫుటత్వమే కవిత్వం. ఈ భావం ఆత్మాశ్రయంగానూ వుండవచ్చు లేక వస్త్వా శ్రయం గానూ వుండొచ్చు. ఈ పద్యం చూడండి—

"వయసు మగవారు పలువురుండియును దీక్ష్ణ
మాలినట్టులె ఈ పల్లెఁగాలి పోయె
చెలియ! సందడిలో పైట తొలిగియాడు
నీదు గుబ్బ చన్దోయిది గాదె తప్పు"

ఈ పద్యంలో తొడుగులేవీ లేవు. మూడు నాలుగు పాదాలలోని భావంలో కవిత్వ ముంది. ఈ భావం పఠిత మనసులో సుళ్లు తిరుగుతుంది. మనస్సు ఆకర్షకమైన ఆలోచనల వెంట పరుగులు తీస్తుంది. మరొక పాట చూద్దాం—

"పడతికి చనుగవ మెరుగులు పైపై పయ్యెద వెలుపల
కడు మించిన విధమేమో కనుగొనరే చెలులు
ఉడుగని వేడుకతో ప్రియుడొత్తిన నఖశశి రేఖలు
వెడలగ వేసవి కాలపు వెన్నెల కాదుగదా!"

ఈ పాటలోని మూడు నాలుగు పంక్తులలో కవిత్వముంది. ఈ పంక్తులు అర్థమైనపుడు పఠిత పొందే అనుభూతి కవిత్వాన్ని రూపు కట్టిస్తుంది. ఇంకొక గేయాన్ని చూద్దాం—

"పాట పాడెను చెట్లు చామలు
కోటి చెవులను గ్రోలి యలరగ
తాటి వనమున నాగిచంద్రుడు
తాను చెవి యొగ్గెన్"

ఈ గేయంలోని మూడు నాలుగు పంక్తులలో జడ ప్రకృతికి ప్రాణం పోయడంలో కవిత్వముంది. ఇంకొక వచన కవితను చూద్దాం –

"దేశ పటాన్ని కొరికేపిన్నై
సామంతుల చిట్టెలుకలు
దరిద్రుడి మేనిపై ధరించిన అతుల బొంతలా
దానవుల సంతలా
బ్రతుకులో నుంచి కారిపోతున్న చిల్లుల బానలా
అధర్మపు వానలా
దేశ పటం"

ఈ వచన కవితా పంక్తులలో కవి పఠితకు స్ఫురింపజేసిన జాతీయ భావంలో కవిత్వముంది.

పైన చూపిన పద్యం, పాట, గేయం. వచనం – ఈ నాలుగింటిలో ఆయా కవులు మనల్ని వారి వారి కవితా లోకాలకు తీసుకొని పోయారు. కవితకు రూప మెలా ఉన్నా భావం ప్రధానమని, అదే పఠితలో కవిత్వ స్థితిని నిలుపుతుందని, మాటలు తేలిపోయి ఆ మాటల వెనక స్ఫుటా స్ఫుటత్వం పొందు భావం అనుభూతిగా మారి పఠిత మనసును స్పందింపజేస్తుందని అర్థమవుతుంది. ఇంతవరకు కవితకు నిర్ణీతమైన రూపం వుండనక్కరలేదని, అది ప్రతిపాదించే భావంలోనే దానికి బ్రతుకు వుంటుందని చెప్పడం జరిగింది. ఈ కవితా సిద్ధాంతం ప్రాచీన కాలం నుండి నేటి వరకు వెలువడిన కవిత్వానికంతటికి వర్తిస్తుంది. ఇక కవితకు గల ప్రయోజనాన్ని గురించి ఆలోచిద్దాం.

**కవిత్వ ప్రయోజనం:**

ఏ కాలపు కవిత్వమైనా ఆ కాలపు సాంఘిక స్థితిని ప్రతిబింబిస్తుందనడం వాస్తవం. ఒక కవి ఒక కావ్యం లేక ఖండిక రాస్తే దానికొక ప్రత్యేక ప్రయోజనాన్ని ఉద్దేశించడం కూడా వాస్తవమే. కవితకు సాంఘిక ప్రయోజనముండాలన్నది కొత్త విషయం కాదు. కవులంతా సంఘంలోనే జీవించారు కాబట్టి సంఘాన్ని గురించి ఆలోచించే వుంటారు. ప్రాచీనకాలపు సమాజ సమస్యలు ఒక రకంగా వుంటే మధ్యయుగాల నాటికి మరొక రకంగా, ఈనాడు మరొక రకంగా వున్నాయి. ఈనాటి సాంఘిక సమస్యల జటిలత్వానికి కారణం నేటి జీవిత విధానంలో ఎదురయ్యే క్లిష్టత. ఇలాంటి క్లిష్టత ఏ సమాజంలోనైనా ఉండే వుంటుంది. ఒక కాలానికి సమస్యలైనవి మరొక కాలం నాటికి సమస్యలే కావు. వాటి స్థానంలో కొత్త సమస్యలు రావచ్చు. సంఘ స్థితిని కవితలో చూపించే కవి మారిన సమస్యల కనుకూలంగా కవిత్వం రాయాల్సి వుంటుంది. ఇది కవిత్వానికి ఒక సిద్ధాంతం కానక్కరలేదు. కవిత వెలార్చే భావం సంఘం నుండి పుడితే చాలు.

ఇలా ఆలోచిస్తూ పోతే ప్రాచీనకాలం నుండి కవి సంఘం నుండి దూరంగా పోలేదని చెప్పవలసి ఉంటుంది. నాటికీ నేటికీ కవిత కలిగించే ప్రయోజనంలో మార్పు లేదు. ఈ ప్రయోజనం అప్పుడొక రకంగా వుంటే ఇప్పుడొక రకంగా ఉండవలసి వస్తున్నది. సాంఘిక సమస్యలకు పరిష్కారం కవిత ద్వారా కలుగుతుందని భావించినపుడు నేటి కవిత్వం ఎన్నో సమస్యలను పరిష్కరించవలసి ఉంది. కారణం నాడు సమస్యలు కానివెన్నో నేడు సమస్యలవుతున్నాయి. ఈ కారణంగా కవిత్వానికి భౌతికరూపం కూడా మారవలసి వచ్చింది. గేయం, వచనం మొదలైనవన్నీ ఈ మార్పును సూచించేవే. కవిత్వంలో మారకుండా వస్తున్నది భావం. పదాల ద్వారా భావం వ్యక్తం కావాలి. పద్యాల్లో, పాటల్లో, గేయాల్లో, వచనాల్లో కూడా మాటలే వుంటాయి. ఏ వాహిక ద్వారానైనా కవిత ఆకర్షకంగా ఆశించిన ప్రయోజనాన్ని నెరవేర్చినపుడు అది ఉపాదేయమే కదా! అలాంటప్పుడు పద్యం, పాటలు నేటి కవిత్వ రూపాలుగా అంగీకరించక పోవడం, వచన కవిత ద్వారానే నేటి సమస్యలను చిత్రించాలనడం సబబు కాదు. నేటి కవిత అంటే ఆధునిక కవిత. వివరంగా చెప్పాలంటే ఆధునిక భావాలను పాతరూపాలలో చెపితే కవిత పాతదై పోతుందన్న అభిప్రాయం సరికాదు. అలాగే ఆధునిక

భావాలను నేటి కనుకూలమైన వచన కవితలోనే చెప్పాలన్న నియమం కూడా సరికాదు. ఈనాటి కవితలు వెలార్చే భావాలను స్పృశించే అంశాలు ప్రాచీన కవిత్వంలో లేకపోలేదు. ప్రాచీనకాలం నుండి కవిత ప్రధానంగా మానవ జీవితాన్నే చిత్రిస్తూ వచ్చింది. కవిత్వం ఇప్పుడు చేస్తున్న పనీ అదే. ఈ విషయాన్ని కాళిదాసు తన మాళవికాగ్ని మిత్ర నాటక ప్రస్తావనలో ఇలా చెప్పాడు.

"పురాణ మిత్యేవన సాధు సర్వమ్
నచాపి కావ్యం నవమిత్య వద్యమ్
సంతః పరీక్షన్యతరైర్భజన్తే
మూఢైః పరప్రత్యయనేయ బుద్ధిః"

పాతదంతా సాధువూ కాదు. కొత్తదంతా గ్రహించదగినదీ కాదు. విజ్ఞుడు పాత కొత్తలను బేరీజు వేసుకొని దేశకాల పరిస్థితుల కనుకూలంగా దేనిని గ్రహించ డానికి వీలుంటే దానిని గ్రహిస్తాడు. మూఢుడు గొర్రెదాటుగా వెళతాడు. ఈ అభిప్రాయం కాళిదాసు కాలం నాటికి సాహిత్యంలో గొప్ప అభ్యుదయ పంథా. తరువాత లాక్షణికులు కాళిదాసు ఆలోచనను అంతగా పట్టించుకొన్నట్లు కనపడదు.

**కవిత్వం - చారిత్రక నేపథ్యం :**

కవిత్వం మొట్టమొదట మతమనేపాదులో పుట్టి రాజకీయ పరిణామాల దోహదంతో పెరిగి, సామాజిక స్ఫూర్తితో పక్వమైంది. ఇది అన్ని దేశాల కవిత్వానికి సంబంధించిన మాట. కవిత్వంలో వచ్చే పరిణామాలను చారిత్రక దృష్టితో చూస్తే కవిత్వంలో పనికొచ్చేదెంతో పనికిరానిదెంతో అర్థమవుతుంది. చారిత్రకతలో భిన్న కాలాలు; భిన్న సమాజాలు, వాటిని నియంత్రించిన రాజ కీయాలు, మతాలు వీటి ప్రభావంతో నడచిన సంఘాలు - ఇవన్నీ సమన్వ యిస్తాయి. కవిత్వ ప్రయోజనం అన్నపుడు ఈ విషయాలన్నింటిని ఆలోచించవలసి వుంటుంది. ఈ రకంగా కవిత్వాన్ని పరిశీలిస్తే ఆయా కాలాల కవిత్వ పరిణామం స్పష్టంగా బోధ పడుతుంది. ఒక కాలానికి చెందిన కవిత్వం ఆ కాలస్వభావానికి అనుగుణంగా వుంటుంది. అది మరొక కాలానికి పూర్తిగా పనికిరాదని చెప్పడం సాహసం. కవిత్వం ఒక జాతి జీవిత గమనాన్ని సూచిస్తుంది. ఆ జాతి

సంస్కృతిని ప్రతిబింబిస్తుంది. అది రాబోయే తరాలకు వారసత్వంగా సంక్రమించే సంపద. ఈ సాంస్కృతిక వారసత్వం నుండీ తొలగి దూరంగా వెళ్ళడం సాధ్యం కాదు. అది మరొక కాలానికి అంతగా పనికి రాకపోయినా పనికొచ్చే ఒకటి రెండంశాలను తప్పకుండా మోసుకొస్తుంది. అది తరువాత తరంవారికి కరదీపిక అవుతుంది. మనం చరిత్రనుండి నేర్చుకొనేది యిదే. ప్రయోజనం లేనప్పుడు పాత కాలాలకు చెందిన చరిత్రను అధ్యయనం చేసే అవసరమేముంది? రామాయణ కథ, భారత కథ ఇప్పుడు అవసరం లేకపోయినా రామాయణం చిత్రించిన ఆదర్శం, భారతం చిత్రించిన కుటుంబ సమస్యలు మానవ జీవితం ఉన్నన్నినాళ్ళు అవసరమే. సాహిత్యం సాంఘిక ప్రయోజనం కలదిగా ఉండాలి. జీవిత చిత్రణలో వాస్తవికత ఉండాలి. ఈ రెండు లక్షణాలు నేటి కవిత్వానికిగల లక్షణాలలో కొన్ని. రామాయణం నాటి ఆదర్శం నేటి సంక్షుభిత సామాజిక రుగ్మతలలో పడి నలిగిపోతుందని, అలాంటి ఆదర్శం ఇప్పుడు కడుపు నింపదని మనిషి ఆదర్శవంతుడుగా ఉండడం కంటే చైతన్యవంతుడుగా ఉండడం అవసర మని చెప్పేవాళ్ళే ఎక్కువ మంది వున్నారు. రామాయణ ఆదర్శాన్ని సంకుచిత ధోరణిలో అర్థం చేసుకొన్న పద్ధతి ఇది. మానవులు ఎల్లప్పుడూ ఆదర్శవంతంగా వుండాలన్నది వాల్మీకి ఆలోచన. ఆదర్శవంతులుగా ఉన్నపుడు ఎవరికివారు వ్యక్తి గతమైన కట్టుబాట్లను విధించుకొని తమ సాంఘిక బాధ్యతల్ని గుర్తించుకొని సామరస్యంతో జీవించే అవకాశముంది. అలాంటప్పుడు సాంఘిక రుగ్మతలకు సమస్యలకు తావులేదు. ఒకవేళ ఉన్నా వ్యక్తికిగల సాంఘిక బాధ్యతల్ని తెలుసు కొన్న వెంటనే పరిష్కరించే అవకాశముంది. ఈ రకంగా ప్రాచీన సాహిత్యాం శాలు నేటికేరకంగా ఉపయోగపడతాయో వివేచించుకొని నిర్ణయించుకోవాలి. పూర్తిగా ఆ సాహిత్యం అస్పృశ్యం అనుకొంటే సాహిత్యం పట్ల పెద్ద దోష మవుతుంది.

ప్రాచీన సాహిత్యం ప్రేమ, ఆదర్శం, మానవత్వం మొదలైన విలువైన అంశాలను చిత్రించింది. ఇవి మానవ మనుగడకు ఎంత అవసరమో అందరికీ తెలుసు. పురాణ కావ్యసాహిత్యాలలోనే గాకుండా 20వ శతాబ్దపు సాహిత్యంలో వచ్చిన వివిధ ఉద్యమ కవిత్వాలలో కూడా ఈ అంశాలున్నాయి. మానవ మనుగడ ఈ అంశాల చుట్టూ తిరుగుతుంది. వీటిని స్పృశించకుండా ఏ కవిత్వమూ ఉండదు;

ప్రాచీన సాహిత్యం చాలావరకు వర్ణనాత్మకంగా ఉండడంవల్ల ఈ అంశాలు స్ఫుటంగా గోచరించవు. నింపాదిగా ఆలోచిస్తే ఇవి తప్పక మనకు అర్థమవుతాయి. ప్రాచీన సాహిత్యాన్ని విమర్శించిన విమర్శక పండితులు ఈ విషయానికి అంతగా ప్రాధాన్యత ఇవ్వడంలేదు. నేటి సమస్యలను దృష్టిలో పెట్టుకొని నిన్నటి సాహిత్యాన్ని విమర్శించి అందులో ఇది లేదని అందువల్ల పనికిరాదని చెప్పడం హాస్యాస్పదం. సాహిత్యం ప్రతిపాదించే అంశాలు సమకాలీన సమాజానికి దగ్గరగా ఉంటాయని, వాటిని పరిణామక్రమంలో అధ్యయనం చేయాలని, ఆ అంశాలలో నేటికి పనికొచ్చే భాగం తప్పకుండా ఉంటుందని, దానినే గ్రహించాలని ఇలాంటి వారికి తెలియపోవడానికి కారణం వీరికి చరిత్రజ్ఞానం లేకపోవడం.

సాహిత్య విమర్శకుడు చరిత్రను తప్పక చదవాలి. వివిధకాలాలలో చరిత్ర అలా ఏర్పడడానికి గల సాంఘిక నేపథ్యమేమిటో తెలుసుకోవాలి. ఆయా దశల్లో సాహిత్యం నిర్వహించిన పాత్ర ఎలాంటిదో కూడా గుర్తించడం అవసరం. చరిత్రకు సాహిత్యానికి దగ్గర సంబంధముంది. చరిత్ర గతిలో వచ్చిన మార్పు సాహిత్యంలో ప్రతిఫలిస్తుంది. చరిత్ర జ్ఞానంతో సాహిత్యాన్ని విమర్శించే విమర్శకుడికి సాహిత్యానికి కొత్త పాతలుంటాయని, అలా వుండాలని అనిపించదు. నేటి కవిత్వంలో నేటి సంఘానికి పనికొచ్చేదే పూర్తిగా ఉందని చెప్పడానికి వీలు గాదు. ఇరవయ్యో శతాబ్దంలో వచ్చినదంతా నేటి కవితగా కొందరు చెపుతారు. ఈ శతాబ్దంలో మొదటి ఉద్యమరూపంలో కనిపించినది భావకవిత్వం. తరువాత అభ్యుదయ, దిగంబర, విప్లవ కవితా ఉద్యమాలు వచ్చాయి. ఇప్పుడు తెలుగు కవులను ఊపుతున్న ఉద్యమాలు స్త్రీవాద, దళితవాద కవితోద్యమాలు. ఖచ్చితంగా చెప్పవలసివస్తే నేటి కవులు ఒక ఉద్యమానికి కట్టుబడినట్లు కనిపించదు. నిజానికి దిగంబర, విప్లవ, స్త్రీవాద, దళితవాద కవితోద్యమాలన్నీ అభ్యుదయ కవితా ఉద్యమంలో భాగాలే. అభ్యుదయం అనే మాట మానవ జాతికి చెందిన వివిధ అంశాల అభివృద్ధికి సంబంధించినది. కవులంతా అభ్యుదయాన్నాసించి కవిత్వాన్ని రాస్తున్నప్పుడు ఇన్ని ఉద్యమాలు ఏర్పడడానికి కారణం సాంఘిక సమస్యల పరిణామం.

చరిత్ర జ్ఞానం లేకపోవడంవల్ల కవిత్వం పాతదిగా కొత్తదిగా కనిపిస్తున్నదనీ, ఉద్యమమేదైనా అందులో వ్యక్తం కావలసింది మానవాభ్యుదయమేనని

ఈ చర్చకు సారాంశం, ఇప్పుడు రాస్తున్న కవులంతా సామాజికాభ్యుదయాన్నే కాంక్షిస్తున్నారని చెప్పడానికి వీలుగాదు. వీరి కవితల్లో సమాజానికి అక్కరకు రాని వైయుక్తిక విషయాలున్నాయి. ఉదాహరణకు 'ప్రేమ' భావాన్ని గ్రహిద్దాం. లోకంలో ప్రేమించని, ప్రేమించబడని వ్యక్తి వుండడు. ఒకవేళ వుంటే పిచ్చి వాడుగానో, అస్వస్థుడుగానో వుంటాడు. ప్రాచీన సాహిత్యమంతటా దీనికి స్థాన ముంది. దీనిని ప్రత్యేకంగా ఎత్తి సాహితీలోకానికి చాటినవారు భావకవులు. భావకవులు ప్రేయసీ విరహంలోపడి సమాజాన్ని గురించి పట్టించుకోలేదనే విమర్శ కూడా ఉంది. ప్రేమ, ప్రేయసి వ్యక్తిగతాంశాలని, వాటిని సమాజీకరణ చేయనవసరంలేదని, కవి తన చుట్టూ వున్న సామాజిక స్థితిని వాస్తవదృష్టితో వీక్షించి సామాజిక సమస్యలను తమ కవిత్వంలో ఎత్తి చూపాలని భావించ డంలో అభ్యుదయ కవితోద్యమం పురుడుపోసుకొన్నది అయితే ఇప్పటికీ ప్రేమ కవితలు రాసేవారున్నారు. సంఘంలోని ప్రతివ్యక్తీ ఏదో ఒక దశలో ప్రేమను గురించి ఆలోచించకపోడు. ప్రేమ వ్యక్తిగతాంశమైనప్పటికీ ఇది పనికిరాదని చెప్ప డానికి వీలుకాదు. ఇంకెన్ని కవితోద్యమాలు వచ్చినా ప్రేమను రూపుమాపలేవు. అయితే ఇది సమాజానికి అవసరమా అంటే అవసరమని చెప్పలేకపోయినా అనవసరమని మాత్రం చెప్పలేము. మరికొంత మంది కవులు మరేవో వ్యక్తిగత మైన గొడవలు కవితల ద్వారా వెళ్ళబోసుకొంటూనే ఉన్నారు. ఇవన్నీ అనుభూతి పరమైన విషయాలు. అనుభూతి లేకపోతే కవిత్వానికి అస్తిత్వమేర్పడదు.

అభ్యుదయ కవిత్వం మార్క్సిస్టు సిద్ధాంతాల పునాది ఆధారంగా పుట్టిందని అందరూ చెప్పేమాట. మార్క్సిస్టు సిద్ధాంత ప్రాతిపదికలో నిర్మించినపుడే అభ్యు దయ కవిత్వమవుతుంది. 'అభ్యుదయ కవి కాగోరినవాడు మార్క్సిజాన్ని గురించి తెలుసుకొని తీరాలి' అని కూడా కొందరి అభిప్రాయం. అభ్యుదయకవి మార్క్సిస్టు సిద్ధాంతాల్ని వల్లెవేయనవసరం లేదని సామాజిక చైతన్య స్ఫోరకంగా రాస్తే అభ్యుదయ కవిత్వమవుతుందని మరికొందరి అభిప్రాయం. ఏమైనా నేటి కవిత్వం సామాజికాభ్యుదయమే అభ్యుదయంగా భావించాలన్నది సర్వత్రా వినిపించే మాట. వ్యక్తిగతాంశలున్న కవితలకు విలువ వుండదు మరి. అయినా రాసేవారు రాస్తూనే వున్నారు. పత్రికలలో అచ్చవుతూనే ఉన్నాయి. కొందరు ఏదో ఒక విధంగా కవిత్వం రాసి తానుగూడా కవినని గుర్తింపుపొందడానికి ప్రయత్నిస్తున్నారు. ఇప్పు

వస్తున్న కవితలను చూస్తే అంతా పనికొస్తుందని చెప్పలేము. ఇక్కడొక ప్రధాన విషయాన్ని గమనించాలి. ఒక కవిత ఒకరికి ప్రయోజనకారిగా కనిపిస్తే మరొకరికి చెత్తగా కనిపిస్తుంది. ఒకరిని స్పందింపజేస్తే మరొకరికి నీరసంగా వుంటున్నది. ఇవి అనుభూతిపరమైన కవితల లక్షణాలు. నేటి కవిత్వంలో గల ఇలాంటి కవితలను తొలగిస్తే మిగిలినది సమాజానింతటికి ఎలా ప్రాతినిధ్యం వహిస్తుంది? సంఘంలో భిన్న మనస్తత్వాలున్న మనుషులున్నారు. ఒకరు అభ్యుదయమనుకున్న దానిని మరొకరు వైయక్తికంగా భావించవచ్చు. అభిప్రాయభేదాలు లేని కవితా సిద్ధాంతాన్ని తయారు చెయ్యడం సాధ్యంకాదు. అందరూ ఒకే అభిప్రాయానికి బద్ధులైతే కవితా ఉద్యమాలే లేవు. మనిషి మనిషికీ అవసరాలలో తేడాలున్నాయి. ఈ తేడాలను సరిచేయలేము. అందువల్ల ఏనాటి కవిత్వంలోనైనా కొంత పరిహరించవలసినది తప్పకుండా వుంటుంది. ఈ రకమైన చారిత్రక దృష్టితో చూచినప్పుడు కవిత్వానికి ప్రాచీనత, ఆధునికత అన్నమాటలు అవసరమా అనిపిస్తుంది. తెలుగు కవిత్వం అంటే సరిపోదా! ఏ కవిత్వమైనా ఆ కవితాకర్త కాలానికి సంబంధించిన సమస్యలనే చిత్రిస్తుంది కదా!

**ఆధునిక కవిత్వం :**

1857 నుంచి లేక 20వ శతాబ్దం నుంచి వచ్చిన కవిత్వం ఆధునిక కవిత్వం అని ఒక అభిప్రాయం. ఆంగ్లభాషా సంపర్కం ఏర్పడినప్పటి నుండి సంస్కరణ దృక్పథంతో ప్రజలలో సామాజిక చైతన్యం తీసుకొని రావడానికి రాయబడినది ఆధునిక కవిత్వం అనేది మరొక అభిప్రాయం. సమకాలీన సమాజాన్ని సమస్యలను చిత్రిస్తూ జీవితంపట్ల సమకాలీన దృక్పథాన్ని కలిగించేది ఆధునిక కవిత్వమని ఇంకో అభిప్రాయం. ఆధునిక కవిత్వానికి కొన్ని లక్షణాలున్నాయి. కవిత్వరూపం, వస్తువు, భావం. రచన—ఈ నాలుగూ పూర్వ సాహిత్యం కంటె భిన్నంగా వుండాలి. ప్రజలకు వెంటనే అర్థం గావడానికి వాడుక భాషనే వాడాలి. ఛందోబంధాలు పనికిరావు. రూప రస దృష్టుల కంటె వస్తుదృష్టి ముఖ్యం. మానవ చరిత్ర అనాదిగా వర్గపోరాటానికి సంబంధించినదిగానే వుండడంవల్ల నేటి సమాజస్థితి ఎలాంటి సంఘర్షణలకు లోనవుతున్నదో వివరించాలి. వ్యక్తిగతాంశ కంటె సామాజికాంశకే ప్రాధాన్యముండాలి. ఈ లక్షణాలను దృష్టిలో వుంచుకొని పరిశీలిస్తే ఈ శతాబ్దంలో వచ్చిన కవిత్వమంతా

ఆధునిక కవిత్వం కాదు. ఎందుకంటే దీనిలో పురాణ, భావ, ప్రబంధ, కవితా రీతులు వ్యక్తమవుతాయి. ఆధునికతను ఒక కాలవాదిగా తీసుకోంటే ఈ ఇబ్బంది లున్నాయి. ఆధునికత మనిషి స్వభావానికి సంబంధించినది. ఈ యుగంలో వచ్చిన పాశ్చాత్య సంస్కృతి ప్రభావం మనపైన పడి కట్టూబొట్టూ మారాయి. ఆలోచన లలో మార్పులొచ్చాయి. ఈ మార్పులు సాహిత్యంలో చోటు చేసుకొన్నాయి. సాహిత్యానికి నిర్దిష్ట ప్రయోజనం వుండాలని, అది సామాజిక సమస్యలను రూపు మాపేదిగా వుండాలని భావించబడింది. దీనితో కవిత్వ వస్తువు, రూపం కూడా మారిపోయాయి. మార్క్సిస్టు సిద్ధాంతాలను దృష్టిలో పెట్టుకొని కవిత్వం రాయా లనే నినాదం ఒక దశలో సర్వత్రా వినిపించింది. ఈ నినాదం చేసినవాళ్ళు మార్క్సిస్టు సిద్ధాంతాలను ఏ రకంగా సాహిత్యానికి వర్తింపజేయాలో అర్థం చేసుకోలేదని నాకనిపిస్తున్నది. కవిత్వం అనే మాటలోనే సౌందర్యతత్వం ఇమిడివుంది. కవిత్వంలో విషయం లేక వస్తువు ప్రధానమే. ఇది ఇప్పటి వాళ్ళెవరూ కాదనరు. అయితే ఈ విషయాన్ని బండగా కాకుండా కొత్త ఆకర్ష కంగా చెప్పవచ్చు. కవితలోగాని మరొక రచనలోగాని వస్తు రూపాలు రెండూ ప్రాధాన్యం పొందితేనే ఉత్తమమైన కళ పుడుతుందని మార్క్సిస్టు సౌందర్య శాస్త్రవేత్తలు చెపుతున్నారు. అయినా మార్క్సిస్టు కవిత్వం వస్తువుకే పరిమితమై పోయింది. ఏమి చెప్పాలన్నది ముఖ్యంగాని ఎలా చెప్పాలన్నది ముఖ్యం కాదనే అభిప్రాయం బలపడింది. దీని ప్రభావంవల్ల కవిత్వంలో వుండవలసిన శిల్పం దెబ్బ తినింది. శిల్పంతో మాకు పనిలేదు మాకు కావలసింది వస్తువేనని ఎవరైనా అంటే వారిని కవులుగాను, వారి రచనలను కవిత్వంగాను గుర్తించడం ఎవరికి వాళ్ళు నిర్ణయించుకోవలసిన విషయం.

కొంతమందికి ఇక్కడ ఒక పెద్ద అభ్యంతరం వుండవచ్చు. కవిత్వ లక్షణం ఆస్వాదానికి, అనుభూతికి సంబంధించిన విషయం. కవితవల్ల, ఇతర కళాఖండాలవల్ల లోకోత్తరానుభూతి కలుగుతున్నదేగాని, లౌకికమైన సద్యః ఫలం ఆశించినంతగా ఉండడంలేదు. లోకోత్తరానుభూతికి సాంఘిక చైతన్యానికి బొత్తిగా సంబంధంలేదు. ఈనాటి వాళ్ళకు భౌతిక భోగాలలో ఉన్న ఆసక్తి మరి దేనిలోను లేదు. ప్రజలనుభవించే భౌతిక సౌకర్యాలనుబట్టే వారి అభ్యుదయం నిర్ణయమవు తున్నది. కాబట్టి భౌతిక భోగాలాలసమైన ప్రజానీకం కవిత్వాస్వాదనకు దూర

మవుతున్నది. ఈ అభిప్రాయం సమంజసంగానే ఉంది. సంఘంలోని పచ్చి నిజాలను ప్రజలముందు పెట్టడానికి రచయిత రాసే కొన్ని పంక్తులను కవిత్వ మవడంలోనే ఇబ్బంది.

"దేశంలోని సంస్థానాలన్నింటిలో
హైదరాబాదు పెద్దది
భూస్వామికం జాఢల్ని ప్రజలు సహించిన
చిట్టచివరి హద్దు అది"

ఈ పంక్తులను వరుసగా రాస్తే రెండు వాక్యాలవుతాయి. ఇందులో కవిత్వమెంత వుందో తెలియదు. అయినా ఇది ఒక వచన కవితగా చెలామణిలో వుంది. ఆలోచిస్తే ఇందులోని భావం కొంత చైతన్య స్ఫోరకంగానే ఉంటుంది. కాని చదివించే గుణం ఇందులో లేదు. ఈ రెండు వాక్యాలు కలిసి ఒక చిన్న వచనం. దీన్ని వచనమంటే సరిపోతుంది గదా! కవిత్వానికి సంబంధించిన ఏ అంశాన్ని స్ఫురింప చేయని దీన్ని వచన కవిత్వమనటంలో నేమి? సాంకేతికార్థాలతో సమాజపు కుళ్ళును బయట పెట్టడానికి రూపంతో పని లేదని, వాస్తవికతను నగ్నంగా నిల బెట్టాలని భావిస్తే ఇలాంటి ఉదాహరణాలు నవలలలో బోలెడు దొరుకుతాయి. నవలలను వచన రచనలంటున్నామే గాని వచన కవితలని అనడం లేదు.

రచనలో కవితాగుణం ఎక్కడో ఉంటుంది. ఇది అంతర్గతం. ఈ లక్షణం పఠితనాకర్షించి అతనిని చదివేటట్లు చేయాలి. మంచి కవి ఈ లక్షణాన్ని వస్తువు లోను, రూపంలోను కూడా చూపించగలడు. రూపం ద్వారా వ్యక్తమయ్యే కవితా గుణం కొంతవరకు ఛందస్సు ద్వారా సాధింపబడుతుంది. కవిత్వానికి ఛందస్సు తొడుగులాంటిది. ప్రాచీన ఛందస్సులో ఆధునిక భావం చెప్పవచ్చు. కవిత్వలక్షణం ఛందస్సుపైననే పూర్తిగా ఆధారపడక పోయినప్పటికీ అందులో అంతర్లీనంగా ఒక లయ తప్పక వుండాలి. ఇది పఠిత మనస్సులో కవిత్వాన్ని ఆవిష్కరించ డానికి సహాయ పడుతుంది.

"జీవితం ఓర చూపులా బులిపిస్తుంది
చెంగు జారుస్తూ మెత్తగా ఉడికిస్తుంది
ఎంతగా స్నేహ పరిమళం పంచుతు వున్నా
ఏందుకో ద్వేషం పొగలా వ్యాపిస్తుంది."

ఈ పంక్తులలో వస్తువూ వుంది. రూపమూ వుంది. ఈ నాడు సంఘంలో ఉంటున్న కుహనా సంస్కృతి, జన జీవనంలోని వ్యాపార దృక్పథం ఈ పంక్తుల లోని వస్తువు. ఈ పంక్తులలో పాటింపబడిన 'లయ' భావాన్ని స్నిగ్ధంగా మార్చడమే కాకుండా మనచేత చదివిస్తున్నది. ఈ చర్చవల్ల తేలిన సారాంశమిది. భావాన్ని సూటిగా వెలార్చే ప్రతి వచన ఖండికను కవిత్వమనలేము. కవిత్వం దీని కతీతంగా వుంటుంది. కనీసం ఒక ఊపు గాని, లయ గాని లేని వచన ఖండి కలను ఎంత భావస్ఫోరకంగా ఉన్నా వచన కవితలనడం కంటె వచన ఖండిక లంటే సరిపోతుంది.

## తెలుగు కవిత్వం - నిన్న నేడు:

కొడవటిగంటి కుటుంబరావు 1946 జనవరి 'తెలుగు తల్లి' పత్రికలో ప్రచురించిన 'అభ్యుదయ సాహిత్యం' అనే వ్యాసంలో ఒక మంచి అభిప్రాయాన్ని ప్రకటించారు. "ప్రాచీన కవులంతా వారి వారి కాలాల్లో అభ్యుదయ సాహిత్యం రచించినవారే అయినప్పటికి వారి రచనల్ని వారి సమాజ వ్యవస్థ నుంచి వేరుచేసి చూడడంవల్ల వారి నవమానం చెయ్యడమేగాక వారి రచనల తాలుకు నిజమైన విలువ గుర్తించక పోవడమే గాక, ఈనాడు జరగదగిన సాహిత్యాభ్యుదయం గురించి సక్రమమైన అభిప్రాయాలు లేకుండా పోతున్నాయి." ఆయన ఈ మాటలు చెప్పింది ఏభై సంవత్సరాల ముందు. అయినా ఇప్పటి సాహిత్యమార్గానికి కూడా అన్వయించే మాటలివి. అప్పటి కవులకు ఇప్పటి కవులకు ప్రధానమైన భేదమేమిటంటే అప్పటి కవులలో ఎక్కువ మంది ఆనాటి రాజకీయ స్థితికి ఒదిగి పాలకుల అభిప్రాయాలను గౌరవించవలసి వుండేది. ఇది ఒక రకంగా వారి సాహిత్య జీవితానికి సంబంధించిన నిబద్ధత. ఈ నిర్బంధం ఇప్పటి వారికి లేదు. స్వేచ్ఛాప్రియత్వం ఆధునిక కవిత్వ లక్షణమైంది.

అప్పుగొనియైన దొంగలియైన లెస్స
జిహ్వకింపైన దాని భుజింపవలయు
కంటి కింపైన కాంతల గలయవలయు
బ్రతుకు దినముల మోక్షంబు వెదుకనేల

ఇది ధరణిదేవుల రామమంత్రి దశావతార చరిత్రలో రాసిన పద్యం. ఇందులో ఈనాటికి సరిగ్గా పోయే ఆలోచన వుండడం గమనార్హం. ప్రాచీన కావ్యాలను బాగా ఓర్పుగా పరిశీలిస్తే ఇలాంటి అంశాలు దొరుకుతాయి.

ఆధునిక కవిత్వం ప్రజలకు దగ్గరగా వచ్చినంతగా ఆనాటి కవిత్వం రాలేదు. దానికి కావలసినన్ని చారిత్రక కారణాలున్నాయి. ఆధునిక కవిత్వంలో ఒకదాని వెంట ఒకటిగా ఉద్యమాలు వచ్చాయి. అనాటి కవిత్వాన్ని గూడా బాగా పరిశీలిస్తే ఉద్యమాలు కాకపోయినా కొన్ని పరిణామాత్మక దశలు కనిపిస్తాయి. నేటి ఉద్యమ కవితలకున్నంత తీవ్రత వీటికి లేకపోవచ్చు. అస్పష్టత, ఆడంబరత సాగదీసి చెప్పడం అనే లక్షణాలు అప్పటి ఇప్పటి కవితల్లో ఉన్నాయి. ప్రస్తుత దశకంలో వస్తున్న కవితలలో స్పష్టత, సంక్షిప్తత, వస్తుతీవ్రత వుండడం గమనించవచ్చు. భావకవిత్వం మొదలు విప్లవ కవిత్వంవరకు వచ్చినవి ఉద్యమాలు. ఇవి ఒకదాని వెంట మరొకటి వచ్చాయి. ఒకటి మరొకదానికి చోటిచ్చింది. ఒక ఉద్యమంమీద తిరుగుబాటు మరొక ఉద్యమం. 1980 నుండి కొత్తగా ఉద్యమ రూపం పొందే దిశగా పయనిస్తున్నవి స్త్రీవాద దళితవాద కవితలు.

ఉద్యమ కవితలు ఆ ఉద్యమ ప్రయోజనం నెరవేరగానే తమ అస్తిత్వాన్ని కోల్పోతాయి. ఉద్యమాల కాలపరిమితి పెద్దదైనా వాటి పుట్టుక, విస్తరణ, వికాసం అంతరించిపోవడం వుంటాయి. ఏ ఉద్యమ కవితల ప్రయోజనమైనా ఆ కాలంనాటి సామాజిక సమస్యల పరిష్కారం. కవిత్వం సామాన్యుడి దగ్గరకు వచ్చింది కనుక అతని సమస్యలను సానుభూతితో వ్యక్తపరచాలి. ఇక్కడ ఒక విషయాన్ని గుర్తించాలి. కవికి అభ్యుదయ దృక్పథమున్నా, సామాజిక చైతన్యం కోసమే కవిత్వం రాసినా ఆతడు కవి. నిజమైన కవి రాసే కవితలో సమకాలీనతే కాకుండా దానికి మించిన మరొక ప్రయోజనాన్నిచ్చే అంశముంటుంది. ఆ అంశం లేకపోతే అది కవిత్వం కాదు. సాహిత్య విమర్శకులలో కొందరు ఈ సిద్ధాంతాన్ని అంగీకరిస్తారు. కొందరికిది సుతరామూ గిట్టదు. సమకాలీన సమస్యలను ప్రతిపాదించడమే కవిత్వ లక్ష్యమంటారు వాళ్లు. దీనికి మరొక ప్రయోజనం కాని, మరొక రకమైన చమత్కారం కాని అవసరం లేదని వీళ్ళ వుద్దేశం. ఇలాంటి అభిప్రాయంతో కవిత్వం రాసినవాళ్లు కూడా సామాజిక చైతన్యాన్ని మించిన మరొక అంశం

తమ కవితలల్లో చోట్లు చేసుకోవడం గమనించదేదనడానికి ఈ క్రింది పంక్తులు చూడండి.

బారులు బారులుగా నిర్భయ సైనిక వీరుల్లా
ఆకుపచ్చ పతకాలతో అందగిస్తూ
వింత వాసనల పూల వృక్షాలు
తమ గాలుల శుభాకాంక్షల్ని
ఊరు నాలుగు మూలలకే పంపుతుండేవి.

చెట్లను నిర్భయ సైనిక వీరులుగాను, ఆకులను పతకాలుగాను, గాలులను శుభాకాంక్షలుగాను చెప్పడంలో రూపకాలంకార శోభ వుంది. చెట్లను విచక్షణా రహితంగా కొట్టివేయడంవల్ల పచ్చదనం పలుచనై పోతున్నదని చెప్పడం ఈ కవిత అందించే సామాజికాంశం. అది వస్తువు. కవికి తెలియకుండానే ఈ పంక్తులలో చోటు చేసుకొన్న ఆలంకారికత వస్తువుకంటే భిన్నమైన కవితా లక్షణం. తెలుగు కవిత్వ రంగంలో ఎన్ని ఉద్యమాలు వచ్చినా కవి ఎంతగా వస్తువుకే పరిమితమైపోయినా అతనిలోని కవితాగుణం అతని కవితలో కనిపిస్తూనే ఉంటుంది. కవిత్వంలోని వస్తువు ఉద్యమానికి సంబంధించినదైతే అందులోని కవిత్వాంశం అనుభూతికి సంబంధించినది. అనుభూతి లేని కవిత్వం ఎక్కువ రోజులు నిలవదు.

కవి అనుభూతికి లోనైతే సంఘాన్ని పట్టించుకోడన్న అభిప్రాయం ఉంది. ఇది నిజమైనప్పటికి అనుభూతి లేకుంటే కవిత్వమే రాయలేడు కదా! కవిత్వానికి స్థితి లేనప్పుడు వస్తువెక్కడుంటుంది? సామాజికమైన వస్తువును గ్రహించి దాని లోని వాస్తవికతను బట్టబయలు చేయడం నేటి కవిత్వ లక్షణమైనా దానిలో కవి ఆత్మీయాంశ తప్పకుండా వుంటుంది. ఇది ఆత్మాశ్రయ ధోరణి అని కొట్టి పారేయ డానికి వీలులేదు. వస్తువును ఎంత బాగా ఆవిష్కరించినా కవిత్వం రాయడంలో కవికి తన స్వార్థం తప్పకుండా వుంటుంది. ఇది ఏమిటంటే కవిగా పేరు తెచ్చు కోవడం గావచ్చు లేక మరొక ప్రయోజనం కావచ్చు. కవికి స్వేచ్ఛ వుండాలనే అంశాన్ని తెలియజేస్తుందీ విషయం. కవికి అభ్యుదయ దృక్పథమున్నా, సాంఘిక చైతన్యమున్నా తన అనుభూతికి కట్టుబడతాడు. అతడు ప్రతిపాదించే వస్తువు

అవసరమే కాని అనివార్యం కాదు. అందుకే కొడవటిగంటి కుటుంబరావు 'సాహిత్య ప్రయోజనం' అనే గ్రంథంలో మొదట భావకవి కావడమే మంచిదని అభిప్రాయ పడ్డాడు. ఆయన ఉద్దేశం కవిత్వం ఆత్మాశ్రయ ధోరణిలో కూరుకొని పోవాలని కాదు, కవికి మొదట అనుభూతి కావాలని చెప్పడమే.

నాటి నేటి కవిత్వాలను ఈ రకంగా పరిశీలిస్తే కొన్ని సాదృశ్యాలు కొన్ని భేదాలు కనిపిస్తాయి. వస్తువును విశ్లేషించి చూపడం రెండిటా సమానం. నేటి కవితలలో కొంత అస్పష్టత కనిపిస్తుంది. ఇప్పుడిప్పుడు రాస్తున్న కవులు ఈ అస్పష్టతను తమ కవితలలోకి రానీకుండా జాగ్రత్త పడుతున్నారు. ఉద్యమ కవితలలో వస్తు విశ్లేషణ ముఖ్యంగా వుంటుంది. దాని ప్రయోజనం కొంతకాలం వరకే. అందులో కవి ప్రదర్శించిన అనుభూతి కవిత్వపరంగా అతనిని ఎప్పటికీ నిలబెడుతుంది.

**కవిత్వోద్యమాలు :**

ప్రబంధ, హీన ప్రబంధ యుగాల తరువాత వచ్చిన నవ్యకవిత్వ ఉద్యమాల్లో మొదట పేర్కొనదగింది భావకవితోద్యమం. పై రెండు ప్రబంధ యుగాల కథా వస్తువులకంటె భిన్నంగా భావకవులు పల్లీయ వాతావరణానికి చెందిన వస్తువులను గ్రహించారు. ప్రకృతిలోని ప్రతి కదలికలో వీళ్ళు ప్రణయాన్ని దర్శించారు. 1910 నుండి ప్రారంభమై 1940 వరకు తెలుగు దేశమంతటా విస్తరించిన భావ కవిత్వ ప్రభావం ఆనాటి సమకాలీన సాహిత్యంపై సమాజంపై ఎంతో వుంది. అంతకుముందు తెలుగు సాహిత్యం సంప్రదాయ బద్ధంగా పాండితీ ప్రకర్షతో జీవహీనమైన రచనా ప్రక్రియలలో వుండేది. భావకవిత్వం ఉదయించిన తరువాత వస్తువులో, పదచిత్రాలలో, ఊహాలలో, శైలిలో మౌలికమైన మార్పులు కనిపించాయి. మధ్యతరగతి జన జీవితం, సామాన్యుడి జీవితం కావ్యవస్తువులయినాయి. దీనితో వస్తువులో నవ్యత వచ్చింది. భావకవులు స్వేచ్ఛాప్రియులు. వీరు శైలిలో కూడ నవ్యతను ప్రదర్శించారు. ప్రకృతి, ప్రేమ, భక్తి, సంఘ సంస్కరణ, స్మృతి మొదలైనవి వీరి కవితలో అంశాలయ్యాయి. భావకవులు ఊహాజగత్తులో స్వప్నమందిరాలను నిర్మించుకొని కాపురముంటూ దిగంతాల అంచులలో ఊహా ప్రేయసులను భావించుకొని ఆహ్లాదాన్ననుభవిస్తూ 'దిగిరాను దిగిరాను దివినుండి భువికి' అని చాటుతూ సమాజ సమస్యలకు దూరమయ్యారని వీరిపై అభియోగం,

వీరి కవిత ప్రేమమత్తును కలిగిస్తుందని, సమస్యల నుండి దూరంగా పోతుందని ప్రగతివాదులైన కవులు తిరుగుబాటు చేసి మానవాభ్యుదయాన్ని కాంక్షించాలని, వ్యక్తిగతానుభూతి సమాజానికి అక్కరలేదని అభిప్రాయపడినారు.

భావకవుల స్వేచ్ఛా ప్రియత్వాన్ని, ప్రేమతత్వాన్ని, పలాయన తత్వాన్ని నిరసిస్తూ సామాజిక చైతన్యాన్ని ప్రబోధించడానికి భావకవిత్వం మీద తిరుగుబాటు చేసి ఆవిర్భవించింది అభ్యుదయ కవిత్వం. అభ్యుదయ కవిత్వంలో వస్తువే ప్రధానం. కవితా సౌందర్యంతో పనిలేదు. దీనికి మార్క్సువాదం ఆత్మస్థానీయం. మార్క్సువాదం కేవలం భౌతికవాదం. ఇందులో ఆధ్యాత్మిక భావాలకు తావులేదు. గతి తార్కిక భౌతికవాదం మార్క్సు వాదానికి ఆధారం. ఉత్పత్తి సంబంధాన్ని బట్టి వర్గాలేర్పడతాయి. ఉత్పత్తి సాధనాలు ఉండేవాళ్ళు పీడకులు. ఉత్పత్తి చేసే వాళ్లు పీడితులు. పీడక పీడిత భేదమే వర్గసంఘర్షణకు ప్రధాన హేతువు. మానవ చరిత్ర అంతా వర్గకలహ చరిత్ర. కార్మికులు, కర్షకులు, ఉత్పత్తిలో భాగస్వాములు కావాలి. అందరికీ ఆర్థిక సమానత్వం వుండాలి. ఈ సిద్ధాంతాలు నినాదాలుగా వర్గ సంఘర్షణ, విప్లవ ప్రబోధం, వీరగాథా కథనం, గత నిరాసనం, యుద్ధవిముఖత, శాంతిప్రియత లక్షణాలుగా అభ్యుదయ కవిత్వం 1940 నుండి ఒక సాహిత్య ఉద్యమంగా మారింది. శ్రీ శ్రీ మొదలు ఎందరో కవులు ఈ ఉద్యమానికి స్ఫూర్తి నిస్తూ కవితలు రాశారు.

సామాజిక చైతన్యమే ఊపిరిగా ఈ ఉద్యమం పుట్టినప్పటికి కొందరి ఆత్మీయాంశ ప్రస్ఫుటంగా కనిపించడం, నిరాశా నిస్పృహలకు లోనైన ప్రజల పూర్తి అవసరాలు ఈ ఉద్యమ కవితలు తీర్చకపోవడం, మొదలైన కారణాలవల్ల కొందరు కవులు అభ్యుదయ కవిత్వంపై తిరుగుబాటు ప్రకటించారు. ఈ ఉద్యమం మీద అసహనాన్ని ప్రదర్శించిన కవులు దిగంబర కవులు. వీరు సంఘంపై కూడా విరుచుక పడ్డారు. వీరి కవితల్లో జుగుప్స, అశ్లీలత చోటు చేసుకొన్నాయి. అభ్యుదయ కవులవలె వీళ్లు కూడా సమాజ శ్రేయస్సుకు కృషి చేసినా సంఘంలో ఉండే కుళ్లును, మురికిని అశ్లీల పదాలతో ఎత్తి చూపడం ద్వారా సాంఘిక చైతన్యాన్ని, సమస్యల పరిష్కారాన్ని బాగా సాధించవచ్చుననుకొన్నారు. నగ్నముని, నిఖిలేశ్వర్, జ్వాలాముఖి, చెరబండరాజు, భైరవయ్య, మహాస్వప్న అనే ఈ ఆరుగురు కవులు తాము దిగంబర కవులమని ప్రకటించుకొన్నారు. వీరు రాసిన

కవిత్వం దిగంబర కవిత్వం. వీళ్లు వరుసగా 1965, 66, 68 సంవత్సరాల్లో మూడు కవితా సంపుటాలను ప్రకటించారు. అభ్యుదయ కవులవలె వీరిది కూడా వస్తుప్రధానమైన కవిత్వమే. అయితే భావప్రకటన నగ్నంగా వుండడంవల్ల వీరి కవితలకు ఆదరణ లభించలేదు. ఈ మూడు సంపుటాలతోనే దిగంబర కవిత్వం అదృశ్యమైంది. తరువాత వీళ్లు తమ పంథాను కొంతవరకు మార్చుకొని నగ్న ప్రకటనలను వదిలేసి అభ్యుదయ దిశలోనే రాశారు. రాస్తున్నారు. ఆ తరువాత వీళ్ళు విరసంలో చేరిపోయారు.

అభ్యుదయ కవుల, దిగంబర కవుల కవితా మార్గాలతో విసిగిపోయిన కొందరు కవులు సాంఘిక సమస్యల నన్నిటిని విప్లవమే పరిష్కరిస్తుందన్న నమ్మకంతో తమ కవితలద్వారా విప్లవ భావాలను ప్రతిపాదించారు. సంస్కరణవాదానికి కాలం చెల్లిపోయింది. సాంస్కృతిక వ్యవహారాల్లో నిస్తబ్ధత పేరుకొంది. అభ్యుదయ రచయితల ఉద్యమం కూడా శవప్రాయమై పోయింది. ఈ దుస్థితిని తొలగించుకొని, జాతిని సమగ్ర విమోచనవైపు నడిపేందుకు విప్లవ కవిత్వం కావాలంటూ వీళ్ళు విప్లవ రచయితల సంఘాన్ని 4-7-1970 న స్థాపించారు. వీరు రాసిన కవిత్వం సాయుధ పోరాటాన్ని ప్రోత్సహించింది. నినాదాలను ప్రచారం చేసింది. అమరవీరుల సాహసాన్ని కొనియాడింది. విప్లవ కవిత సామరస్య ధోరణిని విడనాడి అరాచక మార్గాల నవలంబించి పోరాటమే సమస్యలను పరిష్కరిస్తుందని ప్రబోధించడంవల్ల చాల మందికి నచ్చలేదు. విప్లవ కవిత్వం రాసిన కవులలో కొందరు ప్రభుత్వ నిర్బంధాలకు కూడా గురి అయినారు. వీరు ప్రజలలో కవితలద్వారా కలిగించే విప్లవంవల్ల జాతి వినాశమేగాని అభ్యుదయం కలగదని తేలిపోయింది. అందువల్ల ఈ ఉద్యమానికి దేశంలో ఆదరణ లభించలేదు.

**వచన కవిత్వం :**

వచన కవిత్వం అనేది ఒక చిత్రమైన మాట. వచనంలో కవిత్వం రాయడం దీనికర్థం. వ్యాసాలు, నవలలు, కథలు రాసే రచయితలందరూ వచనంలోనే రాస్తున్నారు. వీళ్లు కూడా కొంత ఆకర్షకంగా రాస్తారు. కాబట్టి వీరి రచనలను కవిత్వమనాలా అనిపిస్తుంది. ప్రతిపాదించే భావాన్ని ముక్కలు ముక్కలు చేసి ఒక ముక్క కింద మరొక ముక్కను పేర్చుకొంటూ రావడం నేటి కవితల్లో కనిపించే లక్షణం. ఈ ముక్కలు ఒక అంతర్గత లయననుసరించి విరిగినాయా అంటే

అదీ లేదు. ఒక ముక్క ఒక పదంతో ఉంటుంది. మరొకముక్క ఒక వాక్యంగా ఉంటుంది. ఇలాంటి కవితలు రాసే కవులకు వాళ్లు రాసేది కవిత్వమనే స్పృహ ఉంటుందో లేదో మరి. పోనీ ఆ ముక్కలలో అనంతమైన అర్థాన్ని పొదిగి పఠితను తీవ్రంగా ఆలోచించేటట్లు చేస్తారా అంటే అదీ కనపడదు. ఇప్పుడొస్తున్న కవితల్లో ఇలాంటివి సుమారు సగం వుంటాయి. వీటిలో వ్యక్తిగత విషయాలు వస్తువులుగా ఏదో ఒకటి రాసి కవిననిపించుకోవాలనే కోరిక కనిపిస్తాయి. ఈనాటి సమాజ స్థితిగతులను సమగ్రంగా దర్శించి కవిత్వం రాసేవాళ్లు కూడా ఎక్కువ మంది వస్తున్నారు. ముఖ్యంగా స్త్రీవాద కవితల్లో గల సాంఘిక స్పృహ తారా స్థాయికి చేరి కనిపిస్తుంది.

ఇంతకూ వచన కవిత్వం అనే దాన్ని ఎలా అర్థం చేసుకోవాలి. వచన కవిత్వాన్ని ఒక ఉద్యమంగా చాలమంది పేర్కొంటున్నారు. వచన కవితకు, అంతకుముందు వచ్చిన అభ్యుదయ కవితకు వస్తురీత్యా తేడా లేదు. రూపదృష్టితో చూస్తే అభ్యుదయ కవులు కూడా కవిత్వాన్ని ముక్కలు ముక్కలుగానే రాశారు. అందువల్ల వచనకవిత్వమంటూ వేరుగా చూపవలసిన పనిలేదు. పైగా వచనం అనేది అభ్యుదయ కవిత్వాది ఉద్యమ కవితల బాహ్యరూపానికి సంబంధించినది. ఒక భావం ఆధారంగా ఉద్యమం ఏర్పడుతుంది. ఆ భావానికి తొడుగుగా ఉండే భౌతికరూపానికి సంబంధించి ఉద్యమం ఏర్పడదు. ఈ రకంగా చూస్తే వచనకవితోద్యమం అభ్యుదయ కవితోద్యమంతో భాగమే. "శ్రీశ్రీ వంటి వారితో ప్రారంభింపబడి తిలక్ వంటి కవుల చేతుల్లో పరిపక్వతను పొంది కుందుర్తి వంటి కవుల ప్రచారంతో తెలుగునేల నలుమూలలా విస్తరించి వ్యాప్తి, ప్రజాదరణ పొందిన వచన కవిత ఉద్యమంగా వెలుగొందినది....అభ్యుదయ సాధనలో భిన్నదృక్పథం గల దిగంబర కవులు, విప్లవ కవులు అభ్యుదయ కవులతో రాజీ పడలేకపోయినా వచన కవిత్వ మహోద్యమంతో రాజీ పడ్డారు" (యస్వీడి చంద్రశేఖర్, వచన కవిత్వంలో కుందుర్తి పాత్ర. పుట 21. తిరుపతి 1985). ఈ అభిప్రాయం ప్రకారం వచన కవిత ఒక ఉద్యమం. శ్రీశ్రీ, తిలక్ వంటి కవుల కవితల్లో ఛందస్సుకు సంబంధించిన లయ పాటింపబడింది. వాళ్లు వస్తువును, రూపాన్ని కొంతవరకు సమంగా చూశారు. ఈ దృష్టి తరువాత వచ్చిన వాళ్ళలో లేదు. వచన కవిత్వానికి వచన గేయం. వచనపద్యం అనే మాటలు వాడుకలో ఉన్నాయి. కవిత్వం ప్రతిపాదించే

వస్తువుకు, రూపానికి సంబంధం లేదనుకున్నప్పుడు ఇప్పుడొస్తున్న కవితలను ప్రధానంగా వస్తుకవితలని లేక వచన ఖండికలని చెప్పాలేగాని వచన కవితలని చెప్పడానికి వీలుగాదు. ఆ కవితలలో వస్తువును మించిన మరొక కవిత్వాన్ని స్ఫురింపజేసే అంశం కనిపించకపోవడం దానికి కారణం.

**ఆధునిక కవిత్వ రూప లక్షణం :**

ఇక్కడ రూపం అనే మాట పద్యం, పాట, గేయం మొదలైన అంశాలకు సంబంధించినది. ఇవన్నీ ఛందోబంధాలు. ఆధునిక కవిత్వానికి ఛందస్సు అక్కర లేదన్నది ఒక ప్రధాన అభిప్రాయం. కాని మనకు వచన కవిత్వానికి ప్రాచుర్యం కలిగిన కాలం వరకు వచ్చిన కవిత్వమంతా ఏదో ఒక ఛందో రూపంలోనే ఉన్నది. గురజాడ తన కవితలలో గేయ ఛందస్సును వాడాడు. గేయ ఛందస్సు అక్షర గణాలతో కాకుండా మాత్రాగణాలతో కూడుకొని వుంటుంది. వ్యవహారిక భాషకు పద్య ఛందస్సుకు పొత్తు కుదరదని ఆయన అభిప్రాయం. ఆధునిక కవిత్వం గురజాడతోనే మొదలైందని ఈ నాడు అందరూ అంగీకరించిన మాట. గురజాడ ఛందస్సును పూర్తిగా నిరాకరించి ఉండవచ్చుగదా! అలా జరగలేదు. కవిత్వానికి శ్రావ్యత వుండాలని, అది ఛందస్సువల్ల వస్తుందని ఆయనకు తెలుసు. గురజాడ వాడిన గేయ ఛందస్సు ఆయనకంటె ముందు ఎంతోకాలంగా సాహిత్యంలో ఉన్నదే. మాత్రా ఛందస్సువల్ల కవితకు గానయోగ్యత సిద్ధిస్తుంది. గేయం అనే మాట కూడా చాలా ప్రాచీనం. దోదకాది ఛందస్సులకు గానంవల్ల, స్రగ్ధరాది ఛందస్సులకు పఠనంవల్ల శోభ కలుగుతుందని భరతుడు చెప్పాడు. దోదకాదులు మాత్రా ఛందస్సులు. స్రగ్ధరాదులు అక్షర ఛందస్సులు. 'పాఠ్యే గేయేచ మధురమ్' అంటుంది రామాయణం. నాచన సోమనదిగా భావింపబడుతున్న—

"వీణా గానం వెన్నెల తేటా
రాణ మీరగా రమణుల పాటా
పేరు చెప్పిన పిన బ్రాహ్మణు వీటా
జాణలు మెత్తురు జాజర పాటా"

అనేది సాహిత్యంలో మొదటి గేయంగా అంగీకరించబడింది. (చెన్నకేశవ రెడ్డి, ఆధునికాంధ్ర గేయ కవిత్వం. పుట. 35, హైద్రాబాదు, 1988) గతి ననుసరించి

లయబద్ధంగా పాడుకోవడం గేయం. పల్నాటి వీరచరిత్ర మొదటి గేయ కావ్యంగా భావించబడుతున్నది. ఆధునిక కవులలో మొదటి తరం కవులమీద గేయఛందస్సు ప్రభావం ఎంతో ఉంది. ఈ ప్రభావంతోనే గురజాడ ఒక కొత్త గేయఛందస్సును తయారు చేశాడు. అదే ముత్యాల సరం ఛందస్సు. తరువాత భావ కవితోద్యమంలో గేయఛందస్సు ఎంతో వైవిధ్యంతో విరివిగా వాడబడింది. నారాయణరెడ్డి రచించిన నాగార్జున సాగరం, కర్పూర వసంతరాయలు మొదలైనవి గొప్ప గేయ కావ్యాలు. కవిత్వానికి గేయలక్షణం శ్రావ్యత దృష్టితో అనివార్యమని, గేయలక్షణం ప్రాచీన కాలం నుండి కవిత్వ లక్షణంగా ఉందని తెలియజేయడం ఈ చర్చకు సారాంశం.

అభ్యుదయ కవితోద్యమ కాలం నుండి కవిత్వానికి గేయలక్షణం కొంత వరకు వెనకకు నెట్టబడి వస్తువుకే ప్రాధాన్యమివ్వడం కనిపిస్తుంది. వచన కవితా పితామహుడుగా పేరు పొందిన కుందుర్తి ఆంజనేయులు రచించిన కవితలలో కూడా లయాత్మకత పాటింపబడనివి చాలా వున్నాయి. "వచనంలాగే భాసించే మాటల్లో కవితా స్వభావమైన భావానుభూతిని కలిగించే ప్రయత్నం వచనకవిత్వం" (అదిపిరాల విశ్వం, 'వచన కవిత్వమంటే ఏమిటి?' వీచిక, ఏప్రెల్. 1977) అనే నిర్వచనంలో భావానుభూతి అన్నది ప్రధానాంశం. కవిత్వం ప్రతిపాదించే భావం పఠితలో అనుభూతిని కలిగించాలన్నది ఈ నిర్వచన సారాంశం. ఇక్కడొక ముఖ్య విషయాన్ని గమనించాలి. అభ్యుదయ కవిత్వ కాలం నుండి సామాజిక చైతన్యస్ఫూర్తిని కలిగించడానికి కవిత్వం రాసిన కవులంతా భావానుభూతిలో పాఠకులను ముంచాలనుకోలేదు. వాళ్ళ ఉద్దేశం భావప్రకటన ద్వారా సామాజిక సమస్యలను అందరికీ అర్థమయ్యేటట్లు చేయడం. అందువల్ల వీళ్ళ కవితల్లో లయాత్మకత కనిపించదు. కొన్ని కవితలు లయాత్మకంగా వుంటాయి. శ్రావ్యతను కలిగించే ఈ లయగుణాన్ని వీరు ప్రయత్నం చేసి సాధించినది కాదు. తానంతట అది కుదురుకొన్నది. ఎలాంటి నిర్బంధం లేకుండా, ఆచ్ఛాదన లేకుండా సహజమైన మాటలతో సమకాలీన భావాన్ని ఆవిష్కరించడం కవిత్వ లక్షణమంటారు వీళ్ళు. అంటే భావప్రధానంగా గల నిరలంకారమైన వచనాన్ని కవిత్వ ఖండికగా భావించవలసి వుంటుంది.

వచన కవిత్వంలోని 'వచన' అనే పదం వచన సంయుక్త చంపూ కావ్య పద్ధతిలోని 'వచనం' అనే మాటను జ్ఞాపకం చేస్తుంది. ప్రాచీన సాహిత్యానికి

సంబంధించిన కావ్యాల్లో పద్యం, వచనం వేర్వేరుగా చూపబడతాయి. రెండు పద్యాలలోని భావాలను కలపడానికి కవి ఆ రెండు పద్యాల మధ్యలో ఒక వచనం రాసినట్లు మనకు అర్థమవుతుంది. ఈ వచనంలో కవిత్వముంటుంది. ప్రాచీనాంధ్ర కవులు వచనాన్ని కూడా చక్కని లయాత్మకమైన శైలిలో రాశారు. ఏదో ఒక తూగు గాని, లయాత్మకమైన గేయాంశ గాని ఆ వచనాలలో వుంటుంది. ఇప్పుడు వచనకవులు రాస్తున్న లయవిరహితమైన వచన రచన కాదది. ప్రాచీన సాహిత్యంలో కనిపించే వచనానికి సంస్కృత కావ్యాలలో వాడబడిన గద్య లక్షణాలు కొంతవరకు కనిపిస్తాయి. ఇప్పటి వచన కవితకు ఇవేవీ లేవు. అవసరం లేదు కూడా. వస్తువును మినహాయిస్తే ఇప్పటి వచన కవితలో, కవిత్వానికి సంబంధించిన అంశాలేవి మిగలవేమో. ఇప్పటి వచన కవులను ప్రశ్నించినా వాళ్ళు కూడా వస్తువే ప్రధానమంటారు గాని కవిత్వ రూపాన్ని గురించి మాట్లాడరు. రూపాన్ని గురించికూడా ప్రత్యేకంగా పట్టించుకొనే కవులు కొందరు ఇప్పటికీ లేకపోలేదు. అయితే వీరు కొద్దిమంది. ఇప్పుడొస్తున్న కవితలనన్నింటిని అధ్యయనం చేసి, వాటిలో ప్రతిబింబించే సమకాలీనతను గుర్తించి కవితను కొత్తగా నిర్వచించవలసిన అవసరం ఏర్పడుతున్నది.

# 12. నవ్య సంప్రదాయ కవి-దువ్వూరి

తెలుగు కవులలో మరికొందరికి కూడా 'కవి కోకిల' బిరుదు ఉన్నప్పటికి ఆ బిరుదు దువ్వూరి రామిరెడ్డిగారి విషయంలోనే అన్వర్థం. ఆయన కవిత మృదు మధురం. ఆయన పలుకులు కప్పురపు గుళికలవలె గుప్పుమని సువాసనలు వెద జల్లుతూ అంతరాంతరాలను సుతారంగా కదిలిస్తాయి. ఆయన నిలువెల్లా కవి. ఎన్నో కళలలో ఆయనకు ప్రావీణ్యమున్నా కవిగానే ప్రసిద్ధుడు.

"అంతము లేని యీ భువనమంత పురాతన పాంథశాల; వి
శ్రాంతి గృహంబు; నందు నిరుసంజలు రంగుల వాకిళుల్; ధరా
క్రాంతులు పాదుషాలు బహురామ్ జమిషీడులు వేన వేలుగా
కొంత సుఖించిపోయి రెటకో పెరవారికి చోటొసంగుచున్"

ఈ పద్యం రామిరెడ్డిగారి 'పానశాల' లోనిది. 'పానశాల' ఉమర్ ఖయ్యామ్ ఫారసీ రుబాయతులోని కొన్ని ముఖ్యమైన రుబాయీలకు రామిరెడ్డిగారి అనువాదం. రామిరెడ్డి పేరు వినగానే చప్పున జ్ఞాపకమొచ్చే పద్యమిది. ఈ పద్యం వినగానే రామిరెడ్డిగారు స్మృతి పథంలో మెదులుతారు. ఈ పద్యమొకటి చాలు ఆయన కవితామూర్తిని అజరామరం చేయడానికి. అలాంటిదే మరొక పద్యం—

"స్వైరిణీ నీవు భారత క్ష్మాతలాత్మ
గౌరవ పవిత్రమూర్తివి! శూరమణివి!
ధారుణీపతి పాలన దండమెపుడు
నీ హలంబు కన్నను ప్రార్థనీయమగునె?"

ఈ పద్యం రామిరెడ్డిగారి 'కృషీవలుడు' అనే కావ్యం లోనిది. రైతును ఇంత గొప్పగా భావించిన కవులంతకుముందు లేరు. ఆయన కావ్యాల్లో ఇలాంటి పద్యాలెన్నో వున్నాయి. నిబద్ధ, అనిబద్ధ; వస్త్వాశ్రయ, ఆత్మాశ్రయ కవితా పద్ధతుల కాయన కవిత లోబడదు. ఆయన కవితది స్వచ్ఛంద సంచారం. ఆ మార్గంలో అన్నీ సమన్వయమవుతాయి. ఆలంకారిక లక్షణాలను గౌరవిస్తూనే ఆయన అతి సున్నితంగా ఆ లక్షణాలను అధిగమిస్తాడు. ఆయన కవిత సంప్రదాయ బద్ధంగా కనిపిస్తుంది. అయినా అందులో ఒక కొత్త ఆలోచన, సమకాలీన జీవితాన్ని అతి సమీపంనుండి దర్శించి మానవ జీవితంలోని అన్ని కోణాలను స్పృశించే ఒక విశ్లేషణ వుంటాయి. అందుకే విమర్శకులంతా ఆయనను సంప్రదాయాన్ని నిశితంగా పరిశీలించి అందులోని మానవీయ గుణాలను మనకందించే పరిణామశీలిగా భావిస్తారు.

"దువ్వూరి రామిరెడ్డిగారి కవిత్వం పాతకొత్తల మేలుకలయిక. ప్రాక్పశ్చిమాలకు అందాల వంతెన. వీరి కవిత్వమునందు ప్రాచీన నవీనాంధ్ర కవితా సంప్రదాయములు కలవు. దీనికి తోడు పాశ్చాత్య కవితా జీవము, పారశీక కవితా జవము మేళవింపబడినవి. అందువలన కవికోకిల కవనం అందాల నలవరచుకొన్న భవనము." ఇది ఆంధ్ర పత్రిక దువ్వూరి కవిత్వంపై వెలువరించిన అభిప్రాయం. ఈ అభిప్రాయంలో ప్రాచీన నవీనాంధ్ర కవితా సంప్రదాయాలు ఆయన కవితలో సమన్వయంగా పొందడం అనే విషయం ముఖ్యమైంది. ప్రాచీన అనే మాట సంప్రదాయాన్ని, నవీన అనే మాట నవ్యసంప్రదాయాన్ని గుర్తు చేస్తాయి. ఈ రెండు సంప్రదాయాల సమన్వయమే ప్రాక్పశ్చిమాలకు అందాల వంతెన.

రామిరెడ్డిగారి కావ్యాలు, ఖండికలు 1935 నాటికే చాలా వెలువడినాయి. ఆయన రచనలలో 'నియోక్లాసిక్' దృక్పథానికి చెందిన లక్షణాలు కనిపిస్తాయి. ఈ విషయాలను చర్చించేముందు ఆ కాలపు సాహితీ స్థితిగతులను వివేచించుకోవలసిన అవసరముంది. ఆధునిక సాహిత్య చరిత్రలో 1910 నుండి 1940 వరకు గల 30 సంవత్సరాల కాలానికి ఎంతో ప్రత్యేకత వుంది. ఈ కాలం భావకవితా యుగం. 1935 నుండి భావకవిత్వం మీద వెగటుపుట్టిన కొందరు కవులు అభ్యుదయ కవితా ఖండికలు రచించారు. 1934 నుండి విశ్వనాథ రామాయణ కల్పవృక్ష రచన ప్రారంభమై 1961 వరకు కొనసాగింది. అప్పటినుండి నవ్యసంప్రదాయ కవితో

ద్యమం ప్రారంభమైనట్లు విమర్శకులు భావిస్తున్నారు. ఇదే కాలంలో అభ్యుదయ కవితోద్యమం పుట్టడం, విరగడం కూడా జరిగింది. అయినా నవ్యసంప్రదాయ ప్రయోగం కొనసాగింది. ఆంగ్ల సాహిత్యంలో ముందు నవ్యసంప్రదాయోద్యమం తరువాత కాల్పనిక కవితోద్యమం కనిపిస్తుంది. తెలుగులో కాల్పనిక కవితోద్యమం తరువాత నవ్యసంప్రదాయ కవిత వచ్చింది. ఆంగ్ల సాహిత్యంలోని రొమాంటిక్ కవిత ప్రభావంతో తెలుగులో భావకవిత రూపు దిద్దుకొన్నది. భావకవిత్వానికి సంప్రదాయం భూమిక అయినప్పటికి కవులు వ్యక్తిగత భావాలను ఉద్వేగ భరితంగా చిత్రించి సమాజానికి దూరంగా వెళ్ళడం, కవితా సుందరిని ఊహాలోకాలలో త్రిప్పి మానవీకరణను సామాజీకరణను విస్మరించడం వంటి కారణాల వల్ల ఇది కొనసాగలేదు. సంప్రదాయాన్ని వివేచించి అందులోని మంచిని పునాదిగా గ్రహించి జీవితాన్ని ఉదాత్త నైతికతాత్త్విక కళాదృక్పథంతో దర్శించి తద్వారా నైతిక ప్రమాణాలను పునరుద్ధరించాలని కొందరు కవులు ప్రయత్నించారు. ఈ దృక్పథంతో రచింపబడిన కవిత నవ్యసంప్రదాయకవితగా పేరు పొందింది.

ప్రాచీన రసశిల్ప మూలాలు, నవీన సామాజిక సంవేదన కలిస్తే నవ్య సంప్రదాయమవుతుంది. వస్తువును గ్రహించడంలో నవ్యత వుంటుంది. వస్తువు పాతదైనా అది నేటి సమాజానికి ఎలా పనికొస్తుందో ఆలోచించి తదనుగుణంగా కవి చిత్రిస్తాడు. వ్యక్తుల అంగాంగ వర్ణనలకు మారుగా అంతరంగాల వర్ణనలకే ప్రాధాన్యముంటుంది. ప్రతి అంశంలోను మానవత్వ స్ఫూర్తి, ప్రకృతిని మానవీకరించడం అనే లక్షణాలుంటాయి. ఈ లక్షణాలు కొంతవరకు కాల్పనిక కవితలో కూడా వుంటాయి. అందుకే కాల్పనిక నవ్యసంప్రదాయ కవితలను విడివిడిగా చూడటం సాధ్యం కాదంటారు విమర్శకులు. అవి రెండూ ఒకే కాలంతో కొనసాగుతూ వుంటాయి. అయితే ప్రాధాన్య లక్షణాన్ని బట్టి నవ్యసంప్రదాయ కవిత వేరుగా కనిపిస్తుంది. రామిరెడ్డిగారి కవితను పరిశీలించడానికి ఈ విషయాలను దృష్టిలో వుంచుకోవాలి.

రామిరెడ్డిగారు కవిత్వం రాసేనాటికి భావకవితా రోచిస్సులు ప్రసరిస్తున్నాయి. ఆ కాంతులు రెడ్డిగారిమీద పడ్డాయి. భావ స్వేచ్ఛ, ప్రకృతి ప్రీతి, ప్రకృతిలో ఆధ్యాత్మిక భావాలను దర్శించడం, సామాన్య జనజీవనం నుండి వస్తువును గ్రహించడం, ప్రణయ తత్త్వం మొదలైన కాల్పనిక కవితా లక్షణాలను ఆయన

పరిశీలించాడు. ఆత్మాశ్రయ ధోరణితో, ఊహా వైభవంతో వస్తున్న ఇలాంటి కవితలలో సాంఘిక సమస్యలను నిశితంగా పరిశీలించడానికి తగిన అవకాశం ఆయనకు కనిపించలేదు. ప్రయత్నం చేసి కవితలల్లడం నేర్చుకొన్నవాడు కాబట్టి కవిత్వానికొక నిర్దుష్ట ప్రయోజనముండాలని అందులో మానవుడు తన వ్యక్తిత్వ పరిధిని దాటి విశ్వపరిధిలో విహరిస్తూ తనకూ విశ్వానికిగల సంబంధాలను తెలుసుకొనే అవకాశముండాలని భావించాడు. ఇది సాధింపబడాలంటే మనిషి ముందు సంప్రదాయాన్ని అర్థం చేసుకోవాలి. సంప్రదాయ సూత్రాలను వివేచించుకొని ఆ వివేచనతో తన కాలం నాటి విషయాలను విశ్లేషించుకోగలగాలి. ఈ విశ్లేషణ. సంప్రదాయ పునాదులపైన నవీన సామాజిక చైతన్య భవన నిర్మాణాలకు సంబంధించి వుంటుంది. ఇది ఒక సమన్వయం. ఇలాంటి సమన్వయ మార్గాన్ని అనుసరించి కావ్యాలు రాసినవాళ్ళు నవ్యసంప్రదాయ కవులు. రామిరెడ్డిగారు ఈ కోవకు చెందిన కవి.

సాంస్కృతిక పునరుజ్జీవన విధానాలవల్ల దేశంలో త్వరత్వరగా మార్పులొస్తున్న కాలమది. మూఢవిశ్వాస నిరసన, నిరక్షరాస్యతా నిర్మూలన, సాంఘిక సంస్కరణ, మానవత్వ బోధన, వ్యవహార భాషా సముద్ధరణ మొదలైనవి ఆనాడు ప్రాధాన్యత వహించిన విషయాలు. ఈ అంశాలన్నీ సాహిత్యంలో ప్రతిఫలించి సాహిత్య స్థితిగతులను మార్చాయి. కావ్యయుగం పోయి ఖండకావ్య యుగం వచ్చింది. సాహిత్యం కేవలం ఆనందం కోసమే కాకుండా దానికొక నిర్దిష్ట సాంఘిక ప్రయోజనముండాలని భావించబడింది, ఒక సాహిత్య స్రష్ట కావాలనుకొన్న రామిరెడ్డిగారు ఈ విషయాలను తప్పకుండా పరిశీలించి వుంటారు. కవిగా మారిన తరువాత తన కవితా సూత్రాలనీవిధంగా ప్రకటించుకొన్నారు.

"భావరస ప్రసంగములు పాయగరాదు, సుధామయోక్తులం
బోవిడరాదు, మార్దవమువో శ్రుతికంటకమైన పల్కు సం
భావన సేయరాదు, మదిభారము తోపగరాదు, శైలి సొం
పేవగ జూడ నిక్షురసమీనెడు నట్లు రచింపు కావ్యముల్"

ఈ పద్యంలో ఆయన చెప్పిన కవితా లక్షణాలన్నీ ప్రాచీన కవుల అభిప్రాయాలే. 'మదిభారము తోపగరాదు' అనే విషయం ఈ పద్యంలో గమనింపదగిన అంశం.

చదివిన వెంటనే కవిత అర్థం కావాలి. అర్థం కావాలంటే అందులో సరళత వుండాలి. విషయంలో స్పష్టత వుండాలి. మార్దవములైన సుధామయోక్తులు భావాన్ని రసాన్ని వ్యక్తపరచాలి. ఈ లక్షణాలతో అప్పటికే కొనసాగుతూ ఉండిన భావకవితా మార్గంలోని ఆత్మాశ్రయ భావోద్వేగం ఆయనకు అంతగా రుచించలేదు. అది మనిషి అంతరంగంలో సామాజిక స్పృహను నింపడానికి బదులు పలాయన తత్త్వాన్ని స్ఫురింపజేయడం దానికి కారణం. అయితే కవితా లక్షణాలను భావ కవులు భావించిన విధంగా, ముందు తరాల కవులు భావించిన విధంగా రామిరెడ్డి గారు కూడా భావించడంలో ఒక అర్థముంది. రామిరెడ్డి వ్యక్తపరచిన కవితా లక్షణాలు ఏకాలపు కవితకైనా అన్వయించేవే. మార్పు వస్తువులో దాని విశ్లేషణలో వుండాలేగాని రూపంలో వుండనవసరం లేదని ఆయన అభిప్రాయం. సంప్రదాయ కవులను నవ్యసంప్రదాయ కవులను వేరుపరిచే ప్రధాన విషయమిదే.

ప్రచలితమైన కవితా సంప్రదాయాలు ఉద్యమాలు తన ముందర ఉన్నప్ప టికీ రామిరెడ్డి తన మార్గాన్ని తానే ఎన్నుకొన్నారు. దీనికి కారణం ఆయన 'రసిక జనానందం' అనే ఖండ కావ్యావతారికలో రచించిన ఈ కింది పద్యంలో అన్వే షించవచ్చు.

"ఒక్కరి శిక్షలేదు, కవి నొక్కనినేనియు కాంచలేదు, పే
రెక్కిన పండితార్యు లిదమిత్థమటంచొక కావ్యమేనియున్
నిక్కము సెప్పలేదు! యిక నీదగు సొంపు రహించు కైతవే
రెక్కడ నుండి యుప్పతిలె? హృత్సరసీజము నుండియే కదా"

రామిరెడ్డిగారి మీద సమకాలీన కవుల ప్రభావ మెప్పటికి లేదని ఈ పద్యం చెపుతున్నది. కవి కాదలచి సాహిత్య గ్రంథాలను స్వయంగా చదువుకోవటంచేత ప్రబంధ కవితాప్రభావం ఆయనమీద పడింది. తత్ఫలితంగా రసికజనానందం, స్వప్నాశ్లేషం, అహల్యానురాగం. కృష్ణరాయబారం అనే రచనల్ని ప్రబంధశైలిలో రచించాడు. ఈ రచనలలో సంప్రదాయ కవులైన పెద్దనాదుల ముద్రలు కని పిస్తాయి. తరువాత తరువాత ఈ పద్ధతి రచనలు ఆయనకే రుచించలేదు. ఈ రచన లలో కొన్ని వర్షపునీటిలో తడిసి చీకిపోవడం యాదృచ్ఛికమైనా తరువాత ఆయన భావాలల్లో కలిగిన మార్పుకు ఫలితంగానే ఇది జరిగిందనిపిస్తుంది.

కవనపు తీరును పరిశీలిస్తే దువ్వూరి భావకవిగానే కనిపిస్తారు. వస్తు వర్ణన విశ్లేషాదులను పరిశీలిస్తే నవ్యకవిగా కనిపిస్తారు. భావకవుల కవితా ద్రవ్యాలైన ప్రకృతి, ప్రణయం మొదలైనవన్నీ రామిరెడ్డి రచనలలో పుష్కలంగా ఉన్నాయి. ప్రణయం విషయంలో భావకవులకు రామిరెడ్డికి కొంత వ్యత్యాసం కనిపిస్తుంది. రాయప్రోలు 'కష్టకమల' రామిరెడ్డి 'కడపటి వీడ్కోలు' ఒక తరహా కావ్యాలు. రెండిటా అమలిన శృంగారం ప్రతిపాదింపబడింది. కష్టకమలలో అవివాహితుడిని ప్రేమించిన వివాహితయైన నాయిక మరణిస్తుంది. కడపటి వీడుకోలులో అవివాహితులైన నాయికా నాయకు లిరువురూ మరణిస్తారు. ప్రేమకు కామానికి కలిగిన సంఘర్షణ దీనికి కారణం. ఈ కావ్యంలో శారద ఆనందం స్వానుభవం కోసమే నంటుంది. ఈమెది కామ ప్రవృత్తి. గౌతముడు అందాన్ని చూచి ఆనందించాలే గాని స్వంతం చేసుకోకూడదంటాడు. ఇతనిది విశ్వజనీయమైన అమలిన ప్రేమ. వీళ్ళిద్దరూ అవివాహితులు కావడంవల్ల ఒకరి మరణం మరొకరి చిత్తక్షోభకు కారణమవుతుంది. దానివల్ల బ్రతికిన వ్యక్తిలో ఉన్న కామవాంఛగాని లేక తీపి గుర్తులుగాని నైతికపతనావస్థకు చేరుకొనే అవకాశముంటుంది. ప్రేమకు కామానికి సంఘర్షణ కలిగినపుడు మరణమే పరిష్కారం కానప్పటికి రామిరెడ్డి అలా చేయటానికి కారణం సామాజిక నీతికి భంగం కలుగకూడదని చెప్పడానికే. భావకవుల ప్రేమ సిద్ధాంతాన్నే గ్రహించి రామిరెడ్డి తానొక కొత్తదారిలో పయనించి నవ్యతకు బాటవేసినాడు. శృంగారం విషయంలో రామిరెడ్డిపై భావకవుల ప్రభావం పడలేదని కె.వి. రమణారెడ్డి (27-2-95 నాటి ఆంధ్రజ్యోతి దినపత్రిక సాహిత్య వేదికలో) కూడా నిర్ణయించారు.

ప్రణయేతి వృత్తంతో రామిరెడ్డి రచించిన మరొక కావ్యం వనకుమారి (1918). కావ్యంలో వనకుమారి రాజకుమార్తె. కారణాంతరాలవల్ల అడవిలో గొర్రెలను మేపుతూ వృద్ధుడైన తండ్రితో గడపవలసి వచ్చింది. ఆమె నాగరిక ప్రపంచం నుండి అడవికి వెళుతుంది. అడవిలో ఒక వీరుని చూచిన తరువాత ఆమెలో ప్రణయం అంకురిస్తుంది. ఆమె మనస్సులో ఎన్నో భావాలు రేగుతాయి. కథలో జరిగిన మార్పుల ఫలితంగా ఆమె ఆ వీరుని వెదుకుతూ వెళ్ళి ఒకచోట స్మృతితప్పి పడిపోతుంది. వీరుడు వచ్చి ఆమెను చేతులలోకి తీసుకోగా అతనిని చూస్తూ ఆమె ప్రాణం వదులుతుంది. కథను విషాదాంతంగా మార్చదలచి కవి

ఇలా ముగించాడు. దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి సలహామేరకు తరువాత మోదాంతంగా మార్చి వీరునితో వనకుమారికి పెండ్లి జరిపించాడు. ఈ కావ్యంలో కనిపించే శృంగారం దాంపత్య ధర్మంలో పర్యవసిస్తుంది. అడవి నుండి వనకుమారి నగరికి రావడంతో ఆటవికత ఓడిపోయి నాగరికత గెలుస్తుంది. పశుత్వం ఓడిపోయి సంస్కారం జయిస్తుంది. ఇది కవి సాధించిన నవ్యత.

కాల్పనిక కవితాప్రభావం నుండి ఆయన బయటపడనప్పటికి దానిని తన సిద్ధాంతానికి అనువుగా మార్చుకోగలిగాడు. కాల్పనిక కవిత అంటే ఆయన ఉద్దేశంలో భావనామయమైన స్వేచ్ఛాప్రియకవిత్వం. దీనిని ఆయన వైచిత్రి అని పేర్కొన్నాడు. ఇది ఎక్కువగా కవితారూపానికి సంబంధించినది. కవిత్వంలో భావం ప్రధానమని అది వస్తురీత్యా మానవజీవితానికి వ్యాఖ్యానప్రాయం కావాలని, సాంఘిక చైతన్య సాధనకు కవి దానిని తన మార్గంలో వ్యక్తపరచవచ్చునని, ఈ విషయంలో అనుకరణ మంచిది కాదని ఆయన అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని ఆయన కావ్యాలలో చూడవచ్చు. సమకాలీన కవులలో ప్రకృతిని అంత రమణీయంగా వర్ణించిన కవి మరొకరు లేరని, రామిరెడ్డిగారే అసలైన ప్రకృతి కవి అని ఒక అభిప్రాయముంది. ప్రకృతిలోని అందచందాలను వర్ణిస్తూనే మానవ మనుగడకు ప్రకృతి ఎలాంటి పాఠం చెపుతుందో వివరించడం ఆయన ప్రత్యేకత. వెనుకటి కవులవలె ఆయన ప్రకృతి వర్ణనలు కూడా కథకనుకూలంగా వుంటాయి. సృష్టిలోని సమస్త వస్తువులు రూపాంతరం చెంది కనిపిస్తాయే కాని నాశం కావనే విషయం వనకుమారి కావ్యంలో వనకుమారి జీవితానికి అన్వయించి చెపుతాడు. ఆమె రాజకుమార్తె అయినా గొల్లబాలికగా పెరగవలసి వచ్చింది. దీనికి కారణం ప్రకృతి పరిణామ సిద్ధాంతమని చెపుతాడు. ఈ సిద్ధాంతానికి అనువుగా ప్రకృతి వర్ణనలుంటాయి.

"కష్టజీవియ కన్నీటి కాల్వకైన
కాల చక్రము నిలువదు కనికరమున
ధారుణీ పాలు పాలనా దండమునకు
వెరచి యాగదు, తృటియైన విరతిగొనదు."

అనే పద్యం ద్వారా కాలకఠోరతను వ్యక్తపరిచాడు. కాలకఠోరతలో ప్రకృతి పరిణామ సిద్ధాంతం సమన్వయమవుతుంది. మానవ జీవితం ప్రకృతిలో

భాగమే కాబట్టి మానవ జీవితం కూడా పరిణామ సిద్ధాంతం మీద ఆధార పడుతుందని చెప్పడానికి వనకుమారి జీవితాన్ని లక్ష్యంగా చూపించాడు. ఆయన ప్రకృతిలో ఈ తత్త్వాన్ని దర్శించాడు. కవిలో తాత్త్వికత కూడా ఒక లక్షణం కాబట్టి ప్రకృతిలో కనిపించే పరిణామశీలమైన తాత్త్వికతను సామాన్య జీవితానికి అన్వయింపజేశాడు. పై పద్యంలోని భావమే—'పలిత కేశం'లోని

"కాలరథ ప్రచారమొక క్షణదనిమేషము నాగబోదు, భూ
పాలుని యాజ్ఞకుం బరమ భక్తుని మ్రొక్కుకు, దిక్కులేని చం
డాలుని కంటనీటి కెరటాలకు కాలమమూల్యమోయి! యా
కాలుడు రాకమున్నె వెదుకందగు విస్మృత జీవితార్థముల్"

అనే పద్యంగా పరిణమించింది. ఈ కఠోరసత్యాన్ని పాఠకుడు అర్థం చేసుకోవలసి వుంది. ఆయన దృష్టిలో 'విస్మృత జీవితార్థములు' అంటే పోగొట్టుకున్న మధుర క్షణాలు. జీవితం అశాశ్వతమైనా కేవలం దుఃఖమయం కాదు. ఎన్నో అనుభూతుల కూడలి. సృష్టిలేని అందం, అది కలిగించే ఆనందం జీవితంలోకి రావాలి. తన కవిత ద్వారా కవి పఠితలను అనుభూతికి లోనుచేస్తాడు. ఇలా చేయాలంటే కవి ప్రకృతిని తన అనుభవంలోకి తీసుకోవాలి. అనుభూతిని కలిగిస్తూనే కవితద్వారా మానవతా విలువలను ప్రబోధించాలి. మానవ జీవితానికి అవసరమైనంత ఆధ్యాత్మికతను, ఆదర్శాన్ని బోధించాలి. ఇన్ని విషయాలను చెప్పగలగాలంటే కవి ఉత్తమ కళాకారుడై ఉండాలి. ఈ లక్షణాలన్నీ నవ్యకవులకు వర్తిస్తాయి. ఇవన్నీ దువ్వూరిలో కనిపిస్తాయి.

దువ్వూరి అసాధారణ వ్యక్తి. బహుముఖ ప్రజ్ఞాశాలి. కవి, విమర్శకుడు, నాటక కర్త. చిత్రకళ, విగ్రహ నిర్మాణం, వాస్తుశిల్పం మొదలైన లలితకళలలో ప్రవీణుడు. కాల్పనికోద్యమ జాతీయోద్యమ స్ఫూర్తితో కవిత్వం వస్తుండిన కాలంలో రామిరెడ్డిగారు కవిత్వం చెప్పడం ప్రారంభించారు. ఆ కాలంలో కాల్పనిక భావావేశానికి వ్యతిరేకంగా, జాతీయోద్యమ హిందూత్వ భావనకు అనుకూలంగా బయలుదేరిన సంప్రదాయ ఆలోచనా విధానం ఆధునికమైన అభివ్యక్తి రామణీయకత చేత నవ్య సంప్రదాయంగా గుర్తింపు పొందింది. నవ్య సంప్రదాయంలో వచ్చిన రచనలలో విచ్ఛిన్నమైపోతున్న 'క్లాసికల్' సంప్రదాయ భావజాలాన్ని నవీకరించి పునరుద్ధరించడం కనిపిస్తుంది. దీన్ని 'Traditional revivalism

అనవచ్చు. క్లాసికల్ సంప్రదాయంలోని మంచిని భావితరాల వారికి అర్థమయ్యేలా చెప్పి దానిని పునరుద్ధరించాలనే అభిప్రాయం ఈ రచయితలది. దానికోసం వీళ్ళు సంస్కృత భాషా కవులను, అలంకార శాస్త్రాన్ని, ప్రాచీన తెలుగు కవులను విస్మరించలేదు. సంప్రదాయ చేతనను సామాజిక చేతనగా మార్చి వస్తువు పాతదైనా దాన్ని సమకాలీన దృష్టితో నవీకరించి మనిషిలో మానవత్వాన్ని మేల్కొలిపి మానవీయ విలువలను తెలుసుకొనేటట్లు చేసి సమాజంలో వ్యక్తి విలువను నిర్దేశించి వ్యష్టి దశనుండి సమిష్టి దశకు, ప్రాంతీయతనుండి దేశీయతకు మానవమనుగడను చేర్చడం నవ్య సంప్రదాయ కవులు చేసిన పని. ఈ దృష్టితో దువ్వూరి రచనలను పరిశీలిస్తే ఆయన కవితా దృక్పథం స్పష్టంగా అర్థమవుతుంది.

దువ్వూరి రచనలలో ఆధునిక చైతన్యం, సంప్రదాయ పరిరక్షణ రెండూ వున్నాయి. ఆయనది ఈ రెండూ సమన్వయించిన నవ్య సంప్రదాయం. ఆయన సమన్వయ దృష్టి గలిగిన పరిణామవాది. ఆకాశంలో కనిపించే జలద శకలాన్ని ఎందరో కవులు దర్శించారు. ప్రకృతి వర్ణనలో భాగంగా అంబుదాన్ని ఎందరో కవులు వర్ణించారు. దువ్వూరి జలదాన్ని ఒక స్త్రీగా ఊహించి ఒక లఘు కావ్యమే రాశారు. ప్రాచీన కవులంతా మేఘానికి పురుషత్వమాపాదించారు. రామిరెడ్డి స్త్రీత్వమాపాదించారు. సూర్యునికి అప్పటికే ఇద్దరు భార్యలుండగా జలదాంగనను మూడవ భార్యగా వివాహం చేశారు. సూర్యునితో కాపురానికి ఈమె ఆకాశంపైకి వెళ్ళింది. అక్కడ తనకు సవతులువున్నట్లు గుర్తించింది. భర్తపై అలిగి తన జన్మస్థానమైన నదీనదాలలోచేరింది. సూర్యుడు వచ్చి అనునయించాడు. మళ్ళీ ఆయనతో ఆకాశానికెళ్ళింది. ఇద్దరు భార్యలున్నా భర్త తనను ఆదరించాడని పొంగిపోయింది. ఇదీ ఈ కావ్య సారాంశం. విమర్శకులు దీన్ని శాస్త్ర కావ్యమన్నారు. ఎలాంటి కావ్యమైనా రామిరెడ్డి ఇందులో చెప్పదలచినది సమాజంలోని భార్యాభర్తల సంబంధాన్ని. ఈ కావ్యంలో వస్తువు అతి స్వల్పం. ఒక ప్రకృతి ద్రవ్యాన్ని మానవీకరించి దానిద్వారా సామాజిక ధర్మాన్ని స్ఫురింపజేయడం ఇందులోని నవ్యత. ప్రకృతిలో కవి ఎన్నుకొనే ఒక కవితాద్రవ్యం మేఘం. దానిలో మానవ లక్షణాలను నిక్షేపించి చైతన్య స్ఫోరకమైన భావాలను సృష్టించడం, ఆ భావాలను సాధారణీకరణం ద్వారా సార్వజనీనం చేయడం కవి ప్రత్యేకత. ఈ భావాలు మానవ జీవితాన్ని వివేచించిన అనుభవం నుండి పుట్టినవి. ఈ లక్షణాలన్నీ దువ్వూరిలో కనిపించే నవ్య సంప్రదాయ లక్షణాలు.

‘కృషీవలుడు’ రామిరెడ్డిగారి రచనలలో ఉత్తమోత్తమమైన రచన. రైతు జీవితం ఇందులోని విషయం. రైతు జీవితాన్ని ప్రధానాంశంగా గ్రహించిన తెలుగు కావ్యాలలో ఇదే మొదటిది.

“అన్నా హాలిక! నీదు జీవితము నెయ్యంబార వర్ణింపమే
కొన్నన్ నిర్ఝరసార వేగమున వాక్పూరంబు మాధుర్య సం
పన్నంబై ప్రవహించుగాని యితరుల్ భగ్నాశులై యీర్ష్యతో
నన్నుం గర్షక పక్షపాతియని నిందావాక్యముల్ పల్కరే!”

అదే పద్యాన్ని పరిశీలిస్తే ఈ రచనలో ఎంత నవ్యత వుందో అర్థమవుతుంది. సగటుమనిషి జీవితానికి ఎంతో దిగువనగల సామాన్య రైతు జీవితాన్ని వస్తువుగా స్వీకరించడంలోనే నవ్యత వుంది. ఇది వస్తు నవ్యత. పొలంలో పనిచేసి ఇంటికి వచ్చి వంట చేయడానికి పొయ్యిలో కట్టెలు పెట్టి ఊదుతూ కండ్లలో నీరు కారుతున్నా లెక్కచేయని రైతు యిల్లాలు; ఆకలితో ఇంటికి వచ్చి వంట కాకపోయినా భార్యపై కోపపడకుండా విధిని ధ్యానించుకుంటూ ఒక మూల కూర్చునే రైతు ఈ కావ్యంలో ప్రధానంగా కనిపిస్తారు. ఉదయం నుండి రాత్రి నిద్రపోవు వరకు రైతులు చేసే కార్యకలాపాలు ఒకవైపు, ఆ కార్యాలతో సమ్మేళనం చెందే ప్రకృతి వర్ణనలింకొకవైపు ఈ కావ్యంలో కనిపిస్తాయి. నాగరికులైన రాజుల కథలలోనే గాక సామాన్యుల జీవితాలలో కూడా రసస్ఫోరకమైన ఘట్టాలను దర్శింపవచ్చునని చాటడానికి దువ్వూరి ఈ కావ్యం రాశారు. తన కవిత కృత్రిమ సౌభాగ్యం వహించిన పూలచెట్లవంటిది కాదని ‘సహజ ప్రరోహ వర్ధన నియమానుసారముగ అల్లుకొనే తీగవంటిదని’ అది ‘అపూర్వ పద్ధతి’లో రమణీయతను చిల్కరిస్తుందని కవి చెప్పుకున్నారు.

“పంజర నిబద్ధ కీరంబు బయలు గాంచి
యుక్కు కమ్ముల దాటుగ నాసజేయు
నటుల బహిర్నియమంబుల నతకరించి
మన్మనంబు స్వాతంత్ర్య సీమకు జరించు”

“కాన, యెవరేమి యనుకొన్నదాన నేమి
గలుగు, కాలమనంతము, ఇల విశాల

భావలోకము క్రమముగా బడయు మార్పు
ఏల హృదయంబు వెలిపుచ్చ నింత యశకు ?"

ఈ పద్యాలను పరిశీలిస్తే కవి స్వేచ్ఛాప్రవృత్తి వ్యక్తమవుతుంది. ఆలంకారిక సంప్రదాయాలకు దూరంగా వెళ్ళాలనుకోవడం కూడా స్ఫురిస్తుంది. ఈ పద్యాలను బట్టి తాను రాసిన కావ్యం అప్పటికి ప్రయోగ దశలోనే ఉండినా రాబోయేకాలంలో ఆదరణ పొందుతుందని కవి భావించినట్లు అర్థమవుతుంది.

రామిరెడ్డిగారికి సంప్రదాయంపట్ల అభిమానం, గౌరవం ఉన్నాయి. అలాగని ఎప్పటివో పాత కథలనే పట్టుకొని వేలాడడం ఆయనకిష్టం లేదు. కవితావస్తువును ప్రకృతిలోని అనేకానేక విషయాలనుండి గ్రహించవచ్చునని ఆయన అభిప్రాయం. గ్రహించిన వస్తువును సామాజిక దృక్పథంతో విశ్లేషించి మానవీయ విలువలను ప్రతిపాదించడం ఆయన పద్ధతి. ప్రకృతి ఆయనకు కనిపించినంత చైతన్య వంతంగా మరొకరికి కనిపించలేదేమో. జడత్వాన్ని పోగొట్టి కర్తవ్యోన్ముఖుని చేస్తూ మనసులోని చింతను పోగొట్టి ఆత్మస్థైర్యాన్ని కలగజేసే మిత్రుడువలె ప్రకృతి ఆయనకు సాక్షాత్కరిస్తుంది. గ్రహించిన వస్తువెలాంటిదైనా దానిని చైతన్యవంతంగా తీర్చి దిద్ది సంప్రదాయబద్ధంగా వస్తున్న మంచిని దానిద్వారా పునః ప్రతిష్ఠించడం ఆయన రచరలన్నిటిలో కనిపిస్తుంది. ఆయనిది సంప్రదాయం. ఆయన నవ్యసంప్రదాయ కవి.

# 13. శాసన నిఘంటువులు

భారతదేశంలో ప్రాకృత, సంస్కృత ఇతర దేశ భాషలలో క్రీ.పూ. 3వ శతాబ్దం నుండి వేయబడిన కొన్ని లక్షల శాసనాలు దొరికాయి. ఈ శాసనాలన్నీ సమకాలపు రాజకీయ, సాంఘిక, సాహిత్య, సాంస్కృతిక విశేషాలతో నిండి వున్నాయి. శాసనాల్లో కనిపించే పదాలు ఆనాటి జనవ్యవహారానికి చాల దగ్గరగా వుంటాయి. ఈ పదాలను పరిశీలిస్తే ఆనాటి సంస్కృతిని నిక్షిప్తం చేసుకొన్న శిలాజాలలాగా కనిపిస్తాయి. ఈ పదాలలో చాల పదాలు ఇప్పటి వ్యవహారంలో లేవు. కొన్ని వున్నా మరొక అర్థంలో రూఢికెక్కి కనిపిస్తాయి. ఉదాహరణకి 1. అమరం—ఈ పదానికి శాశ్వతం అని నేడు మనం చెప్పే అర్థం. 10, 11 శతాబ్దాలనాటి తెలుగు శాసనాలలో ఈ పదానికి సైన్యాధికారులకు వాళ్ళ జీత భత్యాలకుగాను రాజు ఇచ్చే భూమి అని అర్థం. 2. ఆయకం—అంటే ఒక గ్రామానికి సంబంధించిన పరిపాలన అని అర్థం. నేడీ మాట అనుమానం, వడ్డీ భోగ్యం అనే అర్థాలలో వాడబడుతూ వుంది. 3. అరివాణం—ప్రసాదాలు సమర్పించటానికి ఉపయోగించే రాగిపళ్ళెం అని అర్థం. ఈ పదం ఎన్నో దేవాలయ శాసనాల్లో కనిపిస్తుంది. 4. శ్రీవిశాలమ్—ఈ పదానికి దేవాలయానికి ఆనుకొని వున్న వసారా అని అర్థం. ఇది ఇక్ష్వాకుల శాసనాల్లో కనిపిస్తుంది. ఇక్ష్వాకుల శాసనాల్లో కనిపించే మరొక పదం. 5. తలవర—ఆనాడు తలవర ఒక బిరుదుగాను, నగర రక్షకుడు అనే అర్థంలోను వాడబడింది. ఈనాడిది తలారి శబ్దంగా మారి గ్రామసేవకుడు అనే అర్థంలో స్థిరపడింది. ఈ విధంగా పరిశీలిస్తే ఎన్నో పదాలు అర్థభేదంతో కనిపిస్తాయి. సమకాలీన సాహిత్యంలో శాసన పదాలు కొన్ని చోటు చేసుకొని ఈ నాటికీ మనకు కనిపిస్తున్న మాట నిజమే. సాహిత్యంలో చేరని పదాలు కూడా ఎన్నో ఉన్నాయి. అర్థవైవిధ్యాన్నిబట్టి శాసనాల్లో పదాలు ముఖ్యంగా నాలుగు రకాలుగా కనిపిస్తాయి. 1. సాంకేతిక పదాలు 2. రాజకీయ సంబంధమైన పదాలు 3. సంస్కృతిపరమైన పదాలు 4. సామాన్యమైన పదాలు

పై మూడు తరగతులకు చెందిన పదాలకు అర్థం ఒకటి రెండు పదాలలో చెప్పడం కష్టం. ఉదాహరణకి కీల్‌గుంటె అనే మాట చూడవచ్చు. మరణించిన వీరుని శరీరం భూమికి తగలకుండా అతని సేవకుడు తను చితిమీద పండుకొని తన శరీరం మీద ఆ వీరుని శరీరాన్ని పెట్టుకొని అతనితోపాటు కాలిపోవడం కీల్‌గుంటె. ఈ విషయాలనుబట్టి శాసన పదాలకు నిఘంటువులు తయారుచేయవలసిన అవసరముందని తెలుస్తుంది,

నిఘంటువులు తయారుచేయడం మనకు వైదికకాలం నుండి కనిపిస్తుంది. యాస్కాచార్యుని నిరుక్తం ప్రపంచ భాషలలోకెల్లా మొదటి నిఘంటువుగా గుర్తించబడింది. తరువాత అనేక దేశాలలో అనేక భాషా నిఘంటువులు తయారయ్యాయి. తెలుగు భాషకు సంబంధించిన నిఘంటువుల రచనా విధానం ప్రారంభమై ఇప్పటికి సుమారు నూటనలభై సంవత్సరాలు కావచ్చింది. ఈ కాలంలో నూరుకు పైగా తెలుగు నిఘంటువులు ఆవిర్భవించాయి. వీటిలో శాసనాలకు సంబంధించిన నిఘంటువు ఒక్కటే కనిపిస్తుంది. అది కుందూరి ఈశ్వరదత్తుగారు తయారుచేసిన శాసన శబ్దకోశం. బూదరాజు రాధాకృష్ణగారు తమ 'ప్రాచీనాంధ్ర శాసనాలు' అన్న గ్రంథంలో ఆ గ్రంథంలో ఆయన వాడుకొన్న శాసనాల్లో కలిపించే పదాలన్నిటిని అర్థాలతో ఒక అనుబంధంగా సుమారు 300 పేజీలలో కూర్చారు. ఇది కూడా ఒక కోశమే. అయినా రాధాకృష్ణగారి ఉద్దేశం శాసనకోశం తయారుచెయ్యడం కాదు గాబట్టి కందుకూరి ఈశ్వరదత్తుగారి ఒక్కటేది శాసనకోసం అని చెప్పవచ్చు.

ఈశ్వరదత్తుగారు శాసన శబ్దకోశం నిర్మించడానికి కొంత పూర్వరంగముంది. ప్రభుత్వ శాసన శాఖవారు ప్రచురించే ఎపిగ్రాఫియా ఇండికా సంపుటాలలో కొన్ని వందల శాసన వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. శాసన విషయాలతోపాటు శాసన ప్రతిబింబం గూడా ఇవ్వడం ఈ వ్యాసాల ప్రత్యేకత. శాసనాలు ప్రాచీనకాలానికి సంబంధించినవి గాబట్టి, అందలి పదాల అర్థనిరూపణ కష్టంగాబట్టి ఆయా వ్యాసకర్తలు వ్యాసం చివర కొన్ని పదాలకు అర్థాలిస్తూ వచ్చారు. ఇదే పద్ధతి Corpus inscriptionum Indicarum సంపుటాల్లో కూడా కనిపిస్తుంది. శాసనకోశాలు తయారుకావడానికి ఇది ప్రారంభదశ. తరువాత దక్షిణ హిందూదేశ శాసన సంపుటాలు వచ్చాయి. ఈ సంపుటాలలో శాసన పాఠాలకు అక్కడక్కడా ఇచ్చిన ఆంగ్ల వివరణలలో కొన్ని పదాలకు అర్థాలు కనిపిస్తాయి. శాసన పదాల

దేశ, మత, సాంఘిక, రాజకీయ, ఆర్థిక, సారస్వత పరిస్థితులను ప్రస్ఫుటం చేస్తాయి కాబట్టి అలాంటి తెలుగు శాసనాల్లోని పదాలు పట్టికలుగా తయారుచేసి అర్థాలు నిర్ణయించాలని ఈశ్వరదత్తుగారి కనిపించింది. ఈ స్థితిలో దత్తుగారు తెలుగు శాసనాల నుండి కొన్ని పదాలను సేకరించి 'శాసనాలలో తెలుగు భాష' అన్న పేరుతో 'ప్రతిభ' మొదటి సంచికలో ఒక వ్యాసం గూడా ప్రకటించారు.

శాసన పదాలు అర్థ వివరణలతో అనుబంధంగా కూర్చవలసిన గ్రంథాలు మరికొన్ని ఉన్నాయి.

1. A Topographical list of the Inscriptions of the Madras Presidency : వి. రంగాచార్యగారు ప్రచురించిన ఈ గ్రంథం మూడు సంపుటాలుగా 1919 లో వెలువడింది. మూడో సంపుటం చివర్లో 'Index and glossary' అనే పేరుతో ఆయా శాసనాల్లో వచ్చిన సాంకేతిక పదాలు, వ్యక్తుల పేర్లు, బిరుదువాచకాలు, గ్రంథాల పేర్లు, ఇతర పదాలకు అర్థాలు గూడా ఇవ్వ బడినాయి. ఇది 330 పేజీలున్న పెద్ద glossary "The Index and glossary at the end of the volume will I believe highly fecilitate the reading of the inscriptions in each district" అని రంగా చార్యులు తన glossary ఉద్దేశాన్ని తెలిపారు.

2. South Indian Temple inscriptions (critically edited with introduction and notes) దీనిని టి. యన్. సుబ్రమణియన్‌గారు 1957 లో మూడు సంపుటాలుగా ప్రచురించారు. మూడో సంపుటంలో దేవాలయ శాసనాల్లోని ముఖ్యమైన పదాలన్నింటి అర్థవివరణతో ఒక అనుబంధం చేర్చ బడింది. ఇది సమగ్రంగా అర్థాలను ఆవిష్కరించే నిఘంటువు కాదని రచయితే ఉపోద్ఘాతంలో చెప్పుకున్నారు. ఇందులో చాల తెలుగు పదాలు గూడా ఉన్నాయి.

3. డి.సి. సర్కార్ 1965 లో ప్రచురించిన Indian Epigraphy అన్న గ్రంథం. ఇందులో సర్కారు పండితుడు Technical Expressions అనే అధ్యాయంలో శాసనాల్లో సంక్షేపించబడిన ఎన్నో సంకేతాలకు వివరణ రూపాలు, వాటి అర్థాలు ఇచ్చారు. ఇంతే గాకుండా ప్రాచీన రాజకీయ పరిపాలనకు, పదవులకు, భూపరిమాణాలకు సంబంధించిన ఎన్నో పదాలకు అర్థవివరణలు పొందుపరిచారు,

దీని తరువాత 1966 లో Indian Epigraphical glossary ని సర్కారుగారే తయారుచేసి ప్రచురించారు. 'Majority of the wods collected in this glossary occur in inscriptions in Sanskrit or in the Sanskritic dravidian Languages' అని రచయిత ఉపోద్ఘాతంలో పేర్కొన్నారు. ఈ రెండు గ్రంథాల్లో శాసన పదాలకు అర్థాలు ఆంగ్లంలో ఇవ్వడం జరిగింది. ఈ నిఘంటు నిర్మాణంలో సర్కార్ ఇచ్చిన పదాలన్నింటికి ఆయా పదాలు ఏయే శాసనాల నుండి లభిస్తున్నాయో, ఆ శాసనాలు ఏయే శాసన పత్రికలలో ప్రచురింపబడ్డాయో ఆ వివరాలు ఇవ్వడం గమనించదగ్గ విషయం. రెండు మూడు పదాలకు సర్కారు ఇచ్చిన అర్థవివరణలు చూపడం ఇక్కడ అప్రస్తుతం కాదు.

**దశవంద :**

(1-A-30)—Land granted to a person for repairing or building a tank on condition of paying in money or one-tenth or some small share of the produce.

**దేవభోగ :**

(EI-23, 31)—Rent free property of a temple; Land given for the enjoyment of the temple.

**తలవర :**

(EI-8, 20, 28)—A title of the nobility of subordinate rulers; Nagara Rakshaka. ఇందులో సుమారు 10 వేలకు పైగా శాసన పదాలకు ఆంగ్ల అర్థాలు ఇవ్వబడినాయి. పైన చెప్పిన గ్రంథాలన్నింటిలో ప్రాకృత, సంస్కృత, ద్రావిడ భాషాపదాలున్నాయి.

శాసన పదాలకు అర్థాలు నిర్ణయించడంలో చాల మెలకువలు అవసరం. శాసన నిఘంటువును తయారుచేసే నైఘంటికుడికి ప్రాచీన భూగోళం, చరిత్ర, శిల్ప కళ, వాస్తు శాస్త్రం, సాహిత్యం, భాషా శాస్త్రం, సంస్కృతి మొదలైన అనేక విషయాలలో మంచి పాండిత్యం వుండాలి. కావ్య భాషకు గాని, ఆధునిక భాషకు గాని నిఘంటువు తయారు చేయడం కష్టమైన పని అయినప్పటికి శాసన పదాలకు నిఘంటువులు తయారు చేయడంలో ఇలాంటి కష్టాలు ఎదురౌతాయి.

1. ప్రాచీన శాసనాల్లోని పదాలు నేటి వ్యవహారంలో ఉండవు. అలాంటి పదాల అర్థాన్ని నిర్ణయించడానికి అన్ని శాసనాల్లోను కనిపించే అటువంటి పదాలను పరిశీలించాలి. ఆ పదాలతో సారూప్యతగల ఇతర భాషా శాసనాల్లోని పదాలను గూడా పరిశీలించాలి. ఇటువంటి పదాలు నేటి నిఘంటువులలో దొరకవు. ఆ యా పదాలతో కూడిన చారిత్రక సాంస్కృతిక సన్నివేశాలను బట్టి అర్థ నిర్ణయం చేయవలసి ఉంటుంది.

2. ద్విభాషా ప్రాంతాలలో దొరికిన శాసనాలలోని కొన్ని పదాలకు అర్థ వివరణలు రెండు ప్రాంతాల సంస్కృతి తెలిసివుంటే గాని యివ్వడం కష్టం. ఉదాహరణకి 'కీల్ గుంటె' అన్న పదాన్ని పరిశీలించవచ్చు. ఇది అనంతపురం జిల్లాలో దొరికిన శాసనాల్లో కనిపిస్తున్నది. ప్రాచీన కన్నడ సంస్కృతితో ముడి పడిన మాట ఇది.

3. గరకళి, కృచ్ఛ్రము, తరుజావు మొదలైన పదాలకు అర్థ నిర్ణయం చేయడం కష్టం. ఇలాంటి పదాలు శాసనాల్లో చాల కనిపిస్తాయి. శాసనాలలో ఈ పదాలున్న సందర్భాలు తెలిసినా ఇవి కొరకరాని కొయ్యలే.

తెలుగులో మొదట పద్య నిఘంటువులు. ఆ తరువాత అకారాది నిఘంటువులు కనిపిస్తాయి. శాసన కోశాన్ని కొందరు తెలుగు గద్య నిఘంటువులలో చేర్చారు. వస్తు వైవిధ్యాన్ని బట్టి నిఘంటువులను సాహిత్య నిఘంటువులు, శాస్త్ర నిఘంటువులు అని విభజిస్తే శాసనకోశాలు ఈ రెండు విభాగాల క్రిందికి రావు. క్రీ. శ. 11వ శతాబ్దం వరకు వచ్చిన తెలుగు శాసనాల్లోని పదాలు ఆనాటి జన వ్యవహారానికి దగ్గరగా ఉంటూ దేశీయ సంస్కృతితో పెనువేసుకున్నట్లు కనిపిస్తాయి. 11వ శతాబ్దం తరువాత వచ్చిన తెలుగు శాసనాల్లోని పదాలు గూడా చాల వరకు కావ్యభాషా పదజాలంతో విభేదించేవే. అందువల్ల శాసన పదాలకు ప్రత్యేకకోశాలు తయారైతే చరిత్ర, సంస్కృతులను అధ్యయనం చేసే వాళ్ళకు ఎంతో ఉపయోగకరంగా వుంటుంది. ఈ అవసరాన్ని గుర్తించే కందూరి ఈశ్వరదత్తుగారు ఎంతో వ్యయప్రయాసల కోర్చి శాసన నిఘంటువును నిర్మించే పనికి పూనుకొన్నారు.

శాసనాల్లోని పదాలు ఇప్పటివరకు వచ్చిన అకారాది నిఘంటువులలో లేవా అన్న ప్రశ్న ఒకటి కలుగుతుంది. దీనికి సమాధానంగా శాసనపదాలు అకారాది నిఘంటువులలో చాలవరకు లేవనే చెప్పాలి. శాసన పదాలకు అర్థ నిర్ణయం చేయడం

అంత సులువుకాదు కాబట్టి అకారాది నిఘంటు కర్తలు బహుశః వాటి జోలికి వెళ్ళక పోయి వుండవచ్చు. ఒక్క సూర్యరాయాంధ్ర నిఘంటువు దీనికి అపవాదం. 1936 మార్చి నెలలో వెలువడిన సూర్యరాయాంధ్ర నిఘంటువు ప్రథమ సంపుటం పీఠికలో జయంతిరామయ్య పంతులుగారు "ఉదాహరణ వాక్యములు గ్రంథముల నుండి మాత్రమేగాక, సందర్భోచితముగా అప్పటప్పటి లోకవ్యవహారం నుండి, ప్రాచీన శిలా శాసనములనుండి గ్రహింపబడినవి" అని వ్రాశారు. ఈ నిఘంటు నిర్మాణం నాటికి తెలుగు శాసనాలన్నీ ప్రకటింపబడలేదు. దక్షిణ హిందూ దేశ శాసనాలు నాలుగైదు సంపుటాల్లోని తెలుగు శాసనాలలోని కొన్ని పదాలు మాత్రం సూర్యరాయాంధ్ర నిఘంటువులో కనిపిస్తాయి. రామయ్య పంతులుగారు ఎన్నో శాసనాలను పరిష్కరించి ప్రకటించినారు కాబట్టి వారికీ అభిప్రాయం కలిగి వుంటుంది.

సూర్యరాయాంధ్ర నిఘంటువులో చేరిన శాసన పదాలను చూచి రామయ్య పంతులుగారి కృషిని గమనించిన తరువాత ఈశ్వరదత్తుగారికి శాసనపదాలన్నిటిని సేకరించి ఒక నిఘంటువు తయారు చెయ్యాలన్న పట్టుదల కలిగినట్లు వారే చెప్పు కున్నారు. ఈ ప్రయత్నంలో భాగంగానే ఈశ్వరదత్తుగారు ఆంధ్రదేశానికి సంబం ధించిన భౌగోళికాంశాలను ముఖ్యంగా నదులను, నగరాలను, స్థల నామాలను పరిపాలనా విభాగాలను ఆయా కాలాలనాటి శాసనాలనుండి సేకరించి 'ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము' అన్న గ్రంథంగా 1963లో ప్రకటించారు. ఇది ప్రాచీన ఆంధ్ర చరిత్ర పరిశోధకులకు ఎంతో ఉపయోగకరంగా వుంది. వివిధ భౌగోళి కాంశాలకు అర్థ వివరణే గాకుండా వాటికి సంబంధించిన సమస్త చారిత్రక విషయా లను పొందుపరచడంవల్ల దీనిని శాసన నిఘంటువుగా చెప్పవచ్చు. "కన్నింగుహామ్, నందాలాల్ దేవ్, పణిక్కర్ మొదలగువారు ఆంగ్లమున హైందవ చారిత్రక భూగోళముపై వ్రాసిన గ్రంథములను చదివి వానిలో ఆంధ్ర ప్రదేశమునకు సంబం ధించిన విషయ మత్స్వల్పమగుటను గమనించి ఆంధ్ర భాషలో ఆంధ్ర ప్రదేశమును గూర్చి యొక ప్రత్యేక గ్రంథమొకటి వ్రాయ సమకట్టితిని" అన్న దత్తుగారి మాటలు గమనించదగినవి. తరువాత తన 30 సంవత్సరాల కృషి ఫలితంగా సేకరించి అర్థ నిర్ణయం చేసిన శాసన పదాలను శాసన శబ్దకోశంగా 1967 లో ప్రకటించారు. దీనిని ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించింది.

శాసన శబ్ద కోశంలోని పదాలు ప్రాచీనాంధ్రదేశ రాజకీయ, మత, సాంఘిక, సారస్వత, ఆర్థిక పరిస్థితులను ప్రస్ఫుటం చేస్తాయని దత్తుగారు భావించారు. అది నిజమే. శాసనాల్లోని చాల పదాలు ఎన్నో తరాల చరిత్రను తన గర్భంలో నింపుకొని కనిపిస్తాయి. ఈ కోశంలో దత్తుగారు అకారాది క్రమాన్నే పాటించారు. ఇందులోని పదాలన్నీ దాదాపు నామవాచక రూపాలే. క్రియా రూపాలు, విశేషణ రూపాలు చాల తక్కువ. ఈ కోశంలో సుమారు మూడువేలకు పైగా శాసన పదాలున్నాయి. ఇవిగాక నాలుగు అనుబంధాలు గూడా చేర్చబడ్డాయి. ప్రాకృత శాసన పద పట్టిక అచ్చ తెలుగు పదాలుగా అనుమానింపదగిన పదాల పట్టిక ఈ అనుబంధంలో వున్నాయి. చివరి అనుబంధంలో అర్థ నిర్ణయం చేయవలసిన పదాల పట్టిక వుంది. శాసన పదాలకు అర్థ వివరణలు తెలుగులోనే గాకుండా తెలుగు తెలియని చరిత్ర పండితులకు సౌకర్యంగా ఆంగ్లంలో గూడా యివ్వబడినాయి. ఈశ్వరదత్తుగారు శాసనకోశం సమగ్రమైన నిఘంటువు కాదని భవిష్యత్తులో ఎవరైనా ఈ పనికి పూనుకొని దీనిని సమగ్రం చెయ్యాలని ఆశించారు. 'శాసన నిఘంటువులకు ఇది మార్గదర్శి' అని మాత్రమే భావించారు.

చరిత్ర, భాషా సంస్కృతులను తెలుసుకోవడానికి శాసన నిఘంటువులు అవసరం. ఈనాడు శాసన పదాలకు సంబంధించి తెలుగులో కందూరి ఈశ్వరదత్తు గారి శాసన శబ్దకోశం, బూదరాజు రాధాకృష్ణగారి ప్రాచీనాంధ్ర శాసనాలలో అనుబంధంగా కూర్చబడిన పదాల పట్టిక మాత్రం వున్నాయి. మరొక శాసన బృహన్నిఘంటువు తయారు చేయవలసిన అవసరముంది. ఈశ్వరదత్తుగారు శాసనకోశం నిర్మించేనాటికి చాల తెలుగు శాసనాలు వెలుగు చూడలేదు. ఇప్పుడు చాల తెలుగు శాసనాలు ముద్రింపబడినాయి. ఎంతో శబ్దజాలం ఈ శాసనాల్లో దొరుకుతుంది. చరిత్ర పరిశోధకులు, సాహిత్య పరిశోధకులు కలసి చెయ్యవలసిన పని యిది. ఎవరైనా ఈ కార్యానికి పూనుకొంటే తెలుగు భాషా సంస్కృతులకు మహోపకారం జరుగుతుంది.

# 14. అన్నమయ్య సంకీర్తనలలోని - పౌరాణిక గాథా విశేషాలు

పాతదైనా కొత్తగా భాసించేది పురాణం (పురా అపి నవం పురాణం). కొత్తగా భాసించేది వస్తువు అంటే కథ. సర్గం, ప్రతిసర్గం, వంశం, మన్వంతరం, వంశానుచరితం అనేవి పురాణానికి పంచ లక్షణాలు. ఈ లక్షణాలన్నీ భూత కాలానికి సంబంధించినవే. అందువల్ల జరిగిపోయిన వృత్తాంతాలను కథలుగా చెప్పేది పురాణమని అర్థమవుతుంది. జరిగిపోయిన వృత్తాంతాలు పాతవి కాబట్టి అవి కొత్తగా ఎలా కనిపిస్తాయని సందేహం కలుగుతుంది. పాత కథా సంఘటనల ద్వారా పాఠకుల శ్రోతల సమస్యలను పరిష్కరించడం, వారిని విజ్ఞానులను చేయడం పురాణాల పని. పురాణం చెప్పడం, చెప్పించుకోవడం మనదేశంలో ప్రాచీనమైన పద్ధతులు. పురాణాలు చెప్పేవాళ్ళు పౌరాణికులు. ఒక పౌరాణికుడు ఒక పురాణ కథను ఒక రకంగా చెపితే మరొక పౌరాణికుడు అదే కథను మరొక పద్ధతిలో వివరిస్తాడు. చెప్పే పద్ధతిలో నవ్యత ఉంటుంది. కథాంశాలను వినే వాళ్ళ జీవితాలకు తగిలేటట్లు చెప్పడం నవ్యత. పురాణ కథలు పాతవైనా పౌరాణికుని ప్రతిభతో వింటున్న ప్రతిసారి కొత్తగానే అనిపిస్తాయి, ఇది పురాణానికి ప్రధాన లక్షణం. ఈ లక్షణమే లేకుంటే పురాణ సాహిత్యం ఎప్పుడో మన జీవితాలనుండి తప్పుకొనేది.

ప్రాచీన కవులంతా పురాణ సాహిత్యంలోని సూక్ష్మాంశాలను తమ కావ్యాలలో విపులీకరించారు. వాగ్గేయకార సార్వభౌముడైన అన్నమయ్య కూడా ఈ పని చేశాడు. అన్నమయ్య సంకీర్తన వాఙ్మయం ఒక భక్తి సింధువు. భక్తి సింధువులో మునిగిన అన్నమయ్యకు సర్వం శ్రీనివాస మయంగా కనిపించింది. శ్రీనివాసుడు పరమేశ్వరుడుగా తాను జీవుడుగా తెలుసుకున్నాడు. జీవుడు పరమాత్మను చేరుకొనే ప్రయత్నం చేశాడు. పరమాత్మను ప్రస్తుతించాడు. తన

వేదనను వ్యక్తపరుచుకొన్నాడు. ఉన్నదే తన వేదనను పరమాత్మకు విన్నవించుకోవడానికి ఉపకరించిన వాహికలే లేక వ్యాసాలే సంకీర్తనలు. అన్నమయ్య సంకీర్తనల నిండా పురాణ కథలు నిండి కనిపిస్తాయి. శ్రీహరి పురాణ పురుషుడు. ఆయన కథే పురాణ కథలన్నింటికి మూలమని అన్నమయ్య భావించాడు.

"వారిచే పోజన్మము - వడి నిన్ను దెచ్చిరి
భారత రామాయణాలై - పరగె నీ కథలు
భువిమీద రావణుడు - పుట్టగా రాముడవై
తవిలి యిందరికి బ్ర - త్యక్షమైతివి
వివరింప నంతవాడు - వెలసితేగా నీవు
అవతార మందితేని - న్నందరు జూతురు"

అధ్యాత్మ సం. 6-160.

ఈ సంకీర్తనలో శ్రీమన్నారాయణుని కథలు భారత రామాయణాలైనట్లు చెప్పబడింది. సృష్టి స్థితి లయాలకు ఆధారభూతమైన ధరిత్రి శ్రీమన్నారాయణుని విరాడ్రూపం.

"విశ్వమెల్ల నీ విరాడ్రూపము
శాశ్వత హరి నీ శరణులము
కన్నుల సూర్యుడు కమలాప్తుడు నీ
పన్నిన మోమున బ్రాహ్మణులు
వున్నతి వైశ్యులు వూరువులందును
యున్నగ శూద్రులు యిదె పాదముల"

అనే సంకీర్తన అన్నమయ్య హరిని దర్శించిన పద్ధతిని వివరిస్తుంది. అన్నమయ్యకు పురాణ వాఙ్మయమంతా కరతలామలకం. సందర్భానుసారంగా ఆయన సంకీర్తనలలో పురాణకథలు తమంత తాముగా వచ్చి కుదురుకుంటాయి. పురాణ కథలతో పాటు విశిష్టాద్వైత వేదాంత విషయాలన్నీ సంకీర్తనలలో వ్యాఖ్యానింపబడతాయి. పురాణ కథలను, వేదాంత రహస్యాలను అన్నమయ్య భక్తజనులకు సుబోధం చేయడానికే సంకీర్తనలలో విశిష్టాద్వైత వేదాంత రహస్యాన్ని తొమ్మిది మాటలలో వివరించవచ్చునని చెపుతూ ఈ సంకీర్తన రచించాడు.

"మూడే మాటలు – మూడు మూండ్ల తొమ్మిది
వేడుకొని చదవరో – వేదాంత రహస్యము ॥పల్లవి॥

జీవస్వరూపము – చింతించి యంతటాను
దేవుని వైభవము – తెలిసి
భావించి ప్రకృతి సం – పద యిది యెఱుగుటే
వేవేలు విధముల – వేదాంత రహస్యము
తనలోని జ్ఞానము – తప్పకుండా దలపోసి
పనితోడ నందువల్ల – భక్తి నిలిపి
మనికిగా వైరాగ్యము – మఱవకుండుటే
వినవలసిన యట్టి – వేదాంత రహస్యము
వేడుకతో నాచార్య – విశ్వాసము కలిగి
జాడల శరణాగతి – సాధనముతో
కూడి శ్రీ వేంకటేశ్వరు – గొలిచి దాసుడౌటే
పీడని బ్రహ్మానంద – వేదాంత రహస్యము."

ఈ సంకీర్తనలో వివరించిన వేదాంతం విశిష్టాద్వైత వేదాంతం. తత్త్వం–హితం–పురుషార్థం అనేవి మూడు మాటలు; జీవుడు–దేవుడు–ప్రకృతి–జ్ఞానం–భక్తి–వైరాగ్యం – ఆచార్య విశ్వాసం–శరణాగతి–భగవద్దాస్యం అనేవి తొమ్మిది విషయాలు. విశిష్టాద్వైత వేదాంత సిద్ధాంతం ఇలా వుంటుంది. "శ్రీమన్నారాయణ ఏవ చిద చిద్వి శిష్టాద్వైత తత్త్వమ్, భక్తి ప్రపత్తిభ్యామ్ ప్రసన్నః స ఏవ ఉపాయః అప్రాకృత దేశ విశిష్టః స ఏవ ప్రాప్య ఇతి వేదాన్త వాక్యైః" — చిత్తు అంటే జీవుడు. అచిత్తు అంటే ప్రకృతి. ఈ రెండింటికి ఆత్మ శ్రీమన్నారాయణుడు. చిదచిదీశ్వరులు నిత్యులు. ఈశ్వరుని నియమాన్ననుసరించి చిదచిత్తులు ప్రవర్తిస్తాయి. పౌరాణిక కథలతో పాటు ఈ సిద్ధాంత విషయాలు కూడా అన్నమయ్య సంకీర్తనలలో ప్రధాన విషయాలు కనిపిస్తాయి

పౌరాణిక విషయాలలో తనకుగల అభిరుచిని పాండిత్యాన్ని ప్రకటించు కోవడానికి, పురాణ కథలను పాఠకులకు లేదా భక్తులకు పరిచయం చేయడానికి అన్నమయ్య ప్రయత్నం చేయలేదు. వేదేతిహాస పురాణాలలో ఆయనకుగల

అసమానమైన పాండిత్యం అలవోకగా, అప్రయత్న పూర్వకంగా సంకీర్తనలలో కనిపిస్తుంది. సంకీర్తనలలో కనిపించే పౌరాణిక విశేషాలను నిశితంగా పరిశీలిస్తే పురాణ కథలను ఆయన కొన్ని నిర్దిష్ట ప్రయోజనాల కోసం వివరించినట్లు అర్థమవుతుంది. సంకీర్తనలలో ఆయన మత రాజకీయ ఆర్థిక సామాజిక సాంస్కృతిక అంశాలనే గాక కుటుంబ వ్యవస్థ, వ్యక్తుల నడవడిక మొదలైన అనేకానేక అంశాలను పొందుపరిచాడు. అయితే ఈ విషయాలన్నీ భక్తి ప్రపత్తులలో మునిగి సందర్భానుసారంగా ఉండడంచేత విడివిడిగా మనకు స్ఫురించవు. బాగా ఆలోచిస్తే వక్తవ్యాంశాన్ని దృష్టాంతపూర్వకంగా వివరించడానికి పురాణ కథలు ఉపయోగించినట్లు అర్థమవుతుంది. ఎంతటివారైనా విధికి తల వంచవలసిందే. ఈ విషయాన్ని స్థాపించడానికి పురాణ కథలు వినియోగింపబడినాయి.

ఎంత సేయగలేదు యిటువంటి విధి యభవు
నంత వానిని భిక్షమడుగుకొన జేసె ॥పల్లవి॥
కోడి చంద్రుని బట్టి గురు తల్పగుని జేసె
కూడి మలరంగ నింద్రుఁగోడి జేసె
ఘోర కుడువంగ ద్రిశంకుని నంత్యజుని జేసె
వీరుడగు నీలుబట్టి విద్రూపు జేసె
అతివ నొద్దుగ జూదమాడ ధర్మజు జేసె
సతి నమ్ముకొన హరిశ్చంద్రు జేసె
కుతలపడ శూద్రకుని గొత్తి ముచ్చుగ జేసె
మతిమాలి కురురాజు మడుగు జొర జేసె
పడని పాట్ల బఱచి బ్రహ్మ తలవో జేసె
తొకరి కాలునికాలు దునియ జేసె
అదరని విధికి విధియగు వేంకటేశు కృప
పడయకుండగ భంగపడక పోరాదు ఆధ్యాత్మ సం. 5-76

అభవుడు (శివుడు) ఇతరులకు ఐశ్వర్య ప్రదాత. అయినా కూటికి గతిలేని వానివలె భిక్షమడుగుకొని జీవించాడు. జ్ఞానవంతుడైన చంద్రుడు జ్ఞానహీనుడై గురుతల్పగుడయ్యాడు. అంటే గురుపత్నియైన తారను కూడాడు. దేవతలకు రాజైన ఇంద్రుడు

ఒక మానవాంగన పొందుకోసం కోడిగా మారాడు. ఈ విషయాలన్నీ వివిధ పురాణాలలోని కథాంశాలు. ఈ సంకీర్తనలో ఇంకా ఇలాంటి పురాణ కథాంశాలెన్నో ఉన్నాయి. దేవతలు, మహాపురుషులే విధి చేష్టలను తప్పించుకోలేక అనేక కష్టాలు అనుభవించారు. ఇక సాధారణ మానవులు చేయగలిగినదేముంది ? అన్ని వేళల పురుష ప్రయత్నం ఫలించదు. విధికి ఎదురొడ్డి నిలవడం సాధ్యం కాదు. కాబట్టి ఎలాంత పస్థితులనైనా బెంబేలు పడకుండా ధైర్యంతో ఎదుర్కోవాలి అనే విషయాన్ని అన్నమయ్య ఈ కీర్తన ద్వారా తెలిపాడు. చేసిన పాపం నుండి తప్పించుకోడానికి భగవంతునికైనా సాధ్యం కాదని పాపంవల్ల కలిగే ఫలితాన్ని తప్పక అనుభవించవలసి వుంటుందని అన్నమయ్య నమ్మకం. భగవంతుడైన శ్రీమన్నారాయణునికే ఇది తప్పనప్పుడు సామాన్య మానవులు ఎలా తప్పించుకోగలరంటున్నాడు కింది సంకీర్తనలో—

ఎట్టి వారికి నెల్ల నిట్టి కర్మములు మా
యిట్టి వారికి నింక నేది త్రోవయ్య ॥పల్లవి॥

పాము జంపిన యట్టి పాతకమున పెద్ద
పాము మీద నీకు బవళింప వలసె
కోరులి జంపిన కొరతవల్ల నొక్క
కోమలి నెద బెట్టుకొని యుండవలసె
బండి విరిచినట్టి పాతకమున పెద్ద
బండి బోయిడవై పనిచేయ వలసె
కొండ వెఱికిన యట్టి గుణమున దిరుమల
కొండ మీద నీకు కూచుండ వలసె ఆధ్యాత్మ సం. 6-180

ఈ సంకీర్తనలో శ్రీ కృష్ణావతార ఘట్టాలను వర్ణించి ఆయా ఘట్టాలకు సంబంధించిన స్వామివారి అనంతర స్థితులను వివరించి కర్మానుభవ సిద్ధాంతాన్ని వ్యాఖ్యానించాడు అన్నమయ్య.

2. ఒక వీరుని జీవిత ఘట్టాలను వివరించడానికి పురాణ కథనంతటిని సంక్షిప్తంగా చెప్పటం లేక వీరుని జీవిత ఘట్టాలను వివరిస్తూ పురాణ కథనంతటిని స్ఫురింపజేయడం.

శ్రీరాముని జీవితంలోని వివిధ ఘట్టాలే శ్రీమద్రామాయణ కావ్యం. ఈ కింది సంకీర్తనలో శ్రీరాముని జీవితమంతా సంక్షిప్తంగా కనిపిస్తుంది.

రామరామ రామచంద్ర రాఘవా రాజీవలోచనా రాఘవా
సౌమిత్రి భరత శత్రుఘ్నుల తోడ జయమందు దశరథ రాఘవా ॥పల్లవి॥

శిరసు కూకటుల రాఘవా - చిన్నారి పొన్నారి రాఘవా
గరిమ నావయసున దాటికి జంపిన - కౌసల్య నందనా రాఘవా
అడవి యజ్ఞము గాచు రాఘవా - అహల్యహరునివి ల్లు విరచిన రాఘవా
సిరులతో జనకుని యింటను - జాలకి జెలగి పెండ్లాడిన రాఘవా
మలయు నయోధ్య రాఘవా - మాయామృగాంతకా రాఘవా
చెలగి చుప్పనాతి గర్వమడచి దైత్య - సేనల జంపిన రాఘవా
సొలసి వాలి జంపి రాఘవాదండి - సుగ్రీవునేలిన రాఘవా
జలధి బంధించిన రాఘవా లంకేశు సంహరించిన రాఘవా

ఆధ్యాత్మ సం. 5-217.

మానవుడుగా దశరథుని పుత్రుడుగా జన్మించిన శ్రీరాముడు చేసిన వీరోచితమైన పనులన్నిటిని చెప్పడం మానవుని కర్తవ్యోన్ముఖుని చేయడానికే. ఇన్ని పనులు చేసిన తరువాతనే శ్రీరాముడు దైవంగా స్తుతింపబడినాడు. మానవుడు మహనీయుడు కావాలంటే కర్తవ్య పాలనలో వెనక పడకూడదనే సత్యాన్ని ఈ సంకీ సంకీర్తన బోధిస్తున్నది.

3. భగవంతుని కంటె కొన్ని సందర్భాలలో భక్తుడే గొప్పవాడని చెప్పడానికి, భగవంతుడు చేసిన పనులు భక్తులకు మార్గ నిర్దేశం చేస్తాయని చూపడానికి పురాణ కథలను దృష్టాంతాలుగా గ్రహించడం.

సృష్టి కర్తృత్వం, లక్ష్మీపతిత్వం తప్ప తక్కిన అన్ని విషయాలలో ముక్తులైన భక్తులు పరమేశ్వరునితో సమానులని నిత్యవిభూతికి నిలయమైన వైకుంఠంలో స్వామి సన్నిధిలో ఆనందిస్తూ వుంటారని శ్రీ వైష్ణవం చెపుతుంది. అన్నమయ్య ఈ విషయాన్ని పురాణ కథల ద్వారా తన సంకీర్తనలలో స్పష్టం చేశాడు. శ్రీరాముడు చేసిన పనులన్నీ హనుమంతుడు చేశాడు. పైగా ఈ పనులు చేయడంలో శ్రీరాముడు పడినంత శ్రమ హనుమంతుడు పడలేదు. అవలీలగా

శ్రమ లేకుండా చేశాడు. అందువల్ల దేవునికంటె భక్తుడు గొప్పవాడనిపిస్తుంది. అయితే ఆ గొప్పతనం భక్తునిదా లేక దేవునిదా అన్నపుడు ఇద్దరిదీ కాదు భక్తిదేనని సమాధానం.

ఇతడే యతడు గాబోలేలిక బంటునునైరి
మితిలేని రాఘవుడు మేటి హనుమంతుడు ॥పల్లవి॥

జలధి బంధించిదాటె చలపట్టి రాఘవుడు
అలరి వూరకె దాటె హనుమంతుడు
అలుకతో రావణుని యదటణచె నతడు
తలచి మైరావణుని దండించె నితడు
కొండ పెల్లగించె తొల్లి గోవర్ధనుడతడు
కొండతో సంజీవియెత్తె గోరి యితడు
గుండు గరచె నహల్య కొరకు సీతాపతి
గుండు గరగగ బాడె కోరి యితడు
అంజనా చలము మీదనతడు శ్రీ వేంకటేశు
డంజనీ తనయుడా యనిలుజాడు
కంజాప్త కుల రామ ఘనుడు దానును దయా
పుంజమాయ మంగాంబుధి హనుమంతుడు

ఈ సంకీర్తనలో భగవంతుడు భక్తుడు సమానులుగా చూపబడినారు, ఒకరు మితి లేనివారు. మరొకరు మేటి. ఒకరు ఏలిక మరొకరు బంటు. వీరిది యజమాని సేవక సంబంధం. ఈ సంబంధానికి భక్తి పునాది. భక్తిలో తరించిన సేవకునికి యజమాని గుణం అబ్బుతుంది.

4. భక్తులకు భగవంతునితో గల సంబంధం చెపుతూ ఆ భక్తుల కథలను వివరించి తద్వారా ఆ కథలకు లోకప్రాచుర్యం కలిగించడం—

భక్తి ప్రధానమైన పురాణ కథలను ప్రచారం చేయడం భక్తిని ప్రచారం చేయడమే అవుతుంది. ఈ కింది సంకీర్తనలో అన్నమయ్య భవరోగాలను పోగొట్టుకోడానికి శ్రీమన్నారాయణుని శరణు పొందడమే గొప్ప మందని చెపుతున్నాడు.

కొనరో కొనరో మీరు - కూరిమి మందు
ఉనికి మనికి కెల్ల - నొక్కటే మందు ॥పల్లవి॥

ధ్రువుడు గొనిన మందు - తొల్లియు బ్రహ్లాదుడు
చవిగా గొనిన మందు - చల్లని మందు
భవ రోగములు వీడి - పాటగ పెద్దలుమున్న
జవకట్టి కొనినని - చ్చలమైన మందు
నిలచి నారదుడుగా - నినమందు జనకుడు
గెలుపుతో గొని బ్రతి - కిన యామందు
మొలిచి నాలుగు యుగ - ముల రాజులు ఘనులు
కలకాలము గొని - కడగన్న మందు
అజునకు పరమాయువై - యొసగిన మందు
నిజమై లోకము లెల్ల - నిండిన మందు
త్రిజగములు నెఱుగ - తిరు వేంకటాద్రిపై
ధ్వజమెత్తి గోనేటి - దరినున్న మందు

శ్రీమన్నారాయణుడనే మందు ఉనికికి మనికికి ఆధారమైన మందు. ఆ మందే దేవర్షులు రాజర్షులు రాజులు మొదలైన వారు బ్రహ్మానందం పొందడానికి అనువైన మందు. సమస్త విశ్వానికి సృష్టి కర్తయైన బ్రహ్మకు పరమాయువు ఆమందు. తిరుమలలో కోనేటి గట్టుననున్న ఆ మందు ముల్లోకాలకు తెలిసేటట్లు 'నావలె భవరోగాన్ని పరిమార్చే మందింకొకటి లేదు' అని ధ్వజమెత్తి చాటినది. ఈ సంకీర్తన ధ్రువుడు, ప్రహ్లాదుడు మొదలైన భక్తుల కథలను స్పృశిస్తూ భక్తి ప్రాశస్త్యాన్ని చాటుతున్నది.

ముకుందమాలలో కులశేఖరాళ్వారు కృష్ణుడు అనే అమృతమొక్కటే జనన మరణాది దుఃఖాలను తొలగించే దివ్యౌషధమని—

వ్యామోహ ప్రశమౌషధమ్ ముని మనోవృత్తి ప్రవృత్త్యౌషధమ్
దైత్యేంద్రార్తి కరౌషధమ్ త్రిభువనీ సంజీవనైకౌషధమ్
భక్తాత్యంత హితౌషధమ్ భవభయ ప్రధ్వంసనైకౌషధమ్
శ్రేయః ప్రాప్తి కరౌషధమ్ పిబమన శ్రీకృష్ణ దివ్యౌషధమ్
(ముకుందమాల - 24వ శ్లోకం)

అనే శ్లోకంలో కీర్తించాడు. ఇలాగే అన్నమయ్య కూడా

"వేదమంత్ర మింకవేలపేరు వెల్లంకులు వేల
పుదమిధరుడు మాకు భవనౌషధము"

అని, "అన్నిటికినిది పరమౌషధము - వెన్నుని నామమె విమలౌషధము" అని కీర్తించాడు.

5. అన్నమయ్య పురాణ కథలద్వారా జనులకెదురయ్యే లౌకిక విషయాలను పరిష్కరించే ప్రయత్నం చేశాడు.

కలదిది వోసుఖము గలిగినను - గర్వము నిలువక మానునా
మలసికామ్య కర్మలకు జొచ్చిన - మగుడ బుట్టువులు మానునా ॥పల్లవి॥

పరగనింద్రజిత్తుడు హనుమంతుని - బ్రహ్మాస్త్రంబున గట్టి
అరయనందు పై మోకులు గట్టిన - నల బ్రహ్మాస్త్రము వదిలె
పరిపరి విధముల నిటువలెనే హరి - ప్రపత్తి నమ్మిన నరుడు
తిరుగ కర్మమార్గమునకు జొచ్చిన - దేవుడు తన వాత్సల్యము వదలు
అలరిన సంసార భ్రమ విడిచి - యడవిలోన జడభరతుడు
తలపుచు నొక యిఱ్ఱి బెంచినంతనే - తనకును నా రూపుదగిలె
ములుగుచు లంపటములు దెగవిడిచి - మోక్షము వెదకెడి నరుడు
కలవని దుస్సంగతులు బెంచినను - వాసనలంటక మానునా

ఒక పెద్ద ప్రయత్నంతో జీవిత ధ్యేయాన్ని సాధింపగోరినవాడు దానికి తగిన అర్హత సంపాదించుకొని మరల దుస్సాంగత్యం పెంచుకుంటే జన్మహేతువులైన మాలిన్యాలు అంటుతాయి. చేసిన ప్రయత్నం భగ్నమై పోతుంది. ఈ విషయాన్ని అన్నమయ్య వాల్మీకి రామాయణం సుందరకాండ 48వ సర్గలోగల ఇంద్రజిత్తు వృత్తాంతంలో నిరూపించాడు. ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రంతో బంధించి మరల మోకులతో కట్టివేశాడు. బ్రహ్మాస్త్ర ప్రభావం తెలియక అలా చేసినందువల్ల బ్రహ్మాస్త్ర ప్రభావం హనుమంతుని మీద లేకుండా పోయింది. ఇలాగే జడభరతుని వృత్తాంతం కూడా. సంసార భ్రమను వదలిపెట్టి అడవిలో వాసంచేస్తూ జడభరతుడు అక్కడ ఒక ఇఱ్ఱిని పెంచాడు ఇది అతనిలోని ప్రవృత్తిని

ప్రేరేపించి అతనికి ఇష్టి రూపు కలిగేటట్లు చేసింది. ఈ విషయాలను తెలుసుకుంటే సాధారణ మానవులు కూడా తమతమ జీవితధ్యేయ సాధనలో ఎదురయ్యే సమస్య లను పరిష్కరించుకో గలుగుతారు.

6. అన్నమయ్య సంకీర్తనలలో దశావతారస్తుతి చేసిన కీర్తనలెన్నో వున్నాయి. ఆయన చేసిన దశావతార స్తుతినికూడా కొన్ని విభాగాలుగా చేసి పరిశీలించవచ్చు.

(అ) హస్తవర్ణన వ్యాజంతో దశావతారాలలో దేవుడు చేసిన కృత్యాలు చూపబడినాయి,

ఇందరికి నభయంబు - లిచ్చు చేయి
కందువగు మంచి బం - గారు చేయి ॥పల్లవి॥
వెలలేని వేదములు - వెదకి తెచ్చిన చేయి
చిలుకు గుబ్బలి కింద - చేర్చు చేయి
కలికియగు భూకాంత - కౌగిలించిన చేయి
వలనైన కొనగోళ్ళ - వాడి చేయి
తనివోక బలిచేత - దానమడిగిన చేయి
ఒనరంగ భూదాన - మొసగు చేయి
మొనసి జలనిధియమ్ము - మొనకు దెచ్చిన చేయి
మెనయ నాగేలు ధరి - యించు చేయి
పురసతుల మానములు - పొల్లు చేసిన చేయి
తురగంబు బరిపెడి - దొడ్డ చేయి
తిరువేంకటాచలాధీశుడై - మోక్షంబు
తెరువు ప్రాణులకెల్ల - దెలిపెడి చేయి.

ఈ సంకీర్తనలో మత్స్య కచ్ఛప వరాహ నారసింహ వామనాది దశావతారాలు ప్రస్తుతింపబడినాయి.

(ఆ) ఒక పెద్ద భూతాన్ని వర్ణించే నెపంతో దశావతార వర్ణన.

పుడమి నిండరిబట్టె - భూతము కడు
బొడవైన నల్లని - భూతము

కినిసి ఓడపుం - గెడి ఘాతము
పెనుకవీపు పెద్ద - ఘాతము
కనలి కవియు చీ - కటి ఘాతము
చేటకాళ్ళ మిం - చిన ఘాతము
ఘోటుదారల - పెద్ద ఘాతము
గాటపు జడల బిం - కపు ఘాతము
జూటరి నల్ల ము - సుగు ఘాతము
కెలసి చిత్తలే తిరి - గేటి ఘాతము
సొలుపు దాంట్ల పెద్ద - ఘాతము
బలుపు వేంకటగిరి - పయిఘాతము
పులుగు మీది మహా - ఘాతము

ఈ సంకీర్తనలో సర్వభూతాలను తనలో లయింపజేసుకొన్న ఆది భూతమైన శ్రీమన్నారాయణుని దశావతార లీలలు స్తుతించబడినాయి. అసలు ఘాతం ఏ కొందరినో పడితే ఈ పెనుఘాతం పుడమిలోని వారందరిని పడుతుందని చెప్పడంలో స్వామి సర్వోన్నతి, విశ్వవ్యాపకత్వం వ్యక్తమవుతున్నాయి.

(ఇ) దశావతార వర్ణనతో ముడి పెట్టి సంసారి సాధు జీవితాన్ని వివరించడం.

సంసారమే మేలు - సకల జనులకు
కంసాంకుని భక్తి - గలిగితే చాలు ॥పల్లవి॥

వినయపు మాటల - విద్య సాధించితే మేలు
తనిసి యప్పులలోన - దాగుకుంటే మేలు
మునుపనె భూమి దన్ని - మోదించకుంటే మేలు
పెనుకొన్న కోపము - విడిచితే మేలు
కోరి ఒకరి నడిగి - కొంచ పడకుంటే మేలు
సారెసారె జీవులను - చంపకుంటే మేలు
భారపుటిడుమలను - పడకుండితే మేలు
కారించి తిట్లకోడి - గట్టకుంటే మేలు

పరకాంతల భంగ - పడకుంటే మేలు
దొరకని కెశవులు - దొక్కకుంటే మేలు
అరుదైన శ్రీ వేంక - టాద్రి విభుని గొల్చి
యిరవై నిశ్చింతుడైతే - నిన్నిటా మేలు

ఏ పనినైనా సాధించాలంటే సక్రమమైన మార్గంలోనే ప్రయత్నించాలి. అపమార్గములను ఆశ్రయించకూడదు. చేసిన ప్రయత్నం నెరవేరదని బాగా తెలిసినప్పుడు ప్రయత్నించి భంగపడడం కంటె మిన్నకుండడమే మంచిది. వివిధ సందర్భాల్లో దేవుడు ప్రయత్నించి సాధించిన పనులన్నీ మానవులకు దృష్టాంతాలుగా ఈ సంకీర్తనలలో చూపబడినాయి.

(ఈ) దశావతారాలను ఒకే సంకీర్తనలో వర్ణించడమే గాకుండా ఒకొక్క అవతారాన్ని ఒక్కొక్క సంకీర్తనలో కూడా అన్నమయ్య వర్ణించాడు. ఉదాహరణకు నృసింహావతారాన్ని వర్ణించిన కింది సంకీర్తనను చూడవచ్చు.

శరణని బ్రతుకరో - జనులారా
గరిమ మెరసెనిదె - కనకపు సింహము ॥పల్లవి॥

అహరహముల ప్ర - హ్లాదుడు దొరకొని
బహు విధముల హరి - మహిమలు వొనరగ
కహకహ హిరణ్య - కశిపుడు నగిహరి
సహజమేదియని - చఱచె గంభము

దశావతార వర్ణనలు అన్నమయ్య సంకీర్తనలలో మరెన్నో రకాలుగా కనిపిస్తాయి. అన్నమయ్య దశావతార వర్ణన ప్రత్యేక పరిశీలనకర్హమైన విషయం.

అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనలను పరిశీలిస్తే ఏదో ఒక పౌరాణికాంశం లేని కీర్తన కనపడదు. వివిధ ప్రయోజనాల దృష్టితో ఆయన పౌరాణిక కథలను సంకీర్తనలలో స్పృశించాడు.